సంస్కృతి ప్రచురణ–18

# డాక్టర్ కొట్నిస్

(చైనాకు వెళ్ళిన కాంగ్రెస్ వైద్యదళ చరిత్ర)



రచన: క్వాజా అహమ్మద్ అబ్బాస్.
అనువాదం: రావు.

కల్చరల్ బుక్స్ లిమిటెడ్
మద్రాస్.

# డాక్టర్ కొట్నిస్

(చైనాకు వెళ్లిన కాంగ్రెస్ వైద్య దళ చరిత్ర)

రచన:

ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్.

అనువాదం:

'రావు'




సంస్కృతి గ్రంథమండలి

పెరంబూరు పోస్టు :: మద్రాస్.

ప్రచురణ—18

ప్రథమ ముద్రణ.

వెల రూ 1–0–0

1945

సంపాదకులు :

పోచిరాజు రామారావు

కస్తూరి సూర్యప్రకాశరావు

కొత్తపల్లి సుబ్బరామయ్య

మేనేజరు :

వంగల్ గోవిందస్వామి రెడ్డి

# తొలి పలుకు

ప్రియమైన అబ్బాస్,

"మరి ఒకడు మరలి రాలేదు" అనే నీ పుస్తకం వ్రాతప్రతిని చదవడము ఎంతో ఆనందం కలిగించినది. సరళమైన శైలిలోనున్నది. ఈ గాథలో చైనాలోని సంఘటనలను సరిగ్గా ప్రకటించినావనే విశ్వసిస్తున్నాను. తమ వైద్యులు చైనాకు ఏమిచేసినారో భారతీయులు తెలుసుకోవడానికి ఈ పుస్తకము ఎంతగానో ఉపయోగ పడుతుంది. ఎక్కువగా ప్రచారం కావలసిన కథ ఇది.

కలకత్తా,
16 మార్చి 1944

భవదీయుడు.
లిన్‌యుటాంగ్

# అర్హతలు

వ్రాత ప్రతిని ఆమూలాగ్రంగా చూచిన తరువాత ఉన్నది ఉన్నట్టుగా, ప్రతిభావంతంగా నివేదించినావని అంగీకరించక తప్పదు. నేను చెప్పినది అంతా వ్రాయడమేగాక నేను చెప్పదలచి మరచిన విషయాలను కూడా వ్రాసినావు.

డాక్టర్ బి. కె. బాసు,
చైనాకు వెళ్ళిన కాంగ్రెస్ వైద్యదళ సభ్యుడు.
(గ్రంథకర్తకు వ్రాసిన లేఖలో)

4

# మా మాట

"డాక్టర్ కొట్నిస్"కు మూలం ఆంగ్లంలో "అండ్ ఒన్ డిడ్ నాట్ కంబాక్" 1944 లో ప్రచురింపబడినది. కాంగ్రెస్‌చే చైనా కంపబడిన భారత వైద్యదళ చరిత్ర యిది. చైనాపట్ల భారతీయులు చూపిన సానుభూతి, సుహృద్భావాలను, భారత కాంగ్రెస్ యెడల చైనా ప్రజలకు, ప్రభుత్వానికిగల ఆదరాభిమానాలను యీ పుస్తకం చదవడంవల్ల చక్కగా తెలుసుకొన వచ్చును.

ఈ పుస్తకాన్ని అనువదించి ప్రచురింప అనుమతి నిచ్చిన క్వాజా అహమ్మద్ అబ్బాస్ గారికిని, అనువదించి యించిన మిత్రులు రావుగారికిని, ప్రచురణ కార్యంలో తోడ్పడ్డ మిత్రులందరికిని కృతజ్ఞులం. ఈ రచనలోని విషయాన్నే బొంబాయిలోని రాజకమల్ కళామందిర్ వారు శ్రీ శాంతారామ్‌గారి దర్శకత్వంక్రింద చలనచిత్రంగా తయారు చేస్తున్నారు.

పెరంబూరు. సంపాదకులు.

24-12-45

# 1. నేను అక్కడ వున్నాను!

వీరుల విశాల హృదయాలు నాకు గ్రాహ్యములు
త్రికాల ధైర్య స్థయిర్యములు
ప్రాణ త్యాగుల నిర్లక్ష్య ప్రశాంతతలు
వీటిని అన్నింటినీ స్వాహా అంటాను, రుచికరం.
నాకు చాల యిష్టం, అది నేనే అవుతుంది
నేనే ఆ వ్యక్తిని, బాధలు భరించినాను.
నేను అక్కడ ఉన్నాను.

—వాల్ట్ విట్‌మన్

చైనాకు భారతజాతీయ కాంగ్రెస్ పంపిన వైద్యదళం చరిత్రను ప్రత్యక్ష అనుభవంగలవారు, ఆ దళ సభ్యులలో ఎవరైనా ఒకరు నివేదించడము ఉచితము. హృదయాన్ని ద్రవింపచేసే అలాంటి అనుభవములను స్వయంగా పొందినవారే—ఏక వచనము, ప్రథమావిభక్తిలో—చెపితేనే సొగసు. అలాంటి అర్హతగల అయిదుగురులోనూ ఇలాంటి పనికి పూనుకోడానికి ఏ ఒక్కరికీ సాధ్యంగాదు. విధికృతం! వెళ్ళిన అయిదుగురులోనూ ఒకడు మనకు అతీతుడైపోయినాడు. మృత్యుదేవత ఆహుతిగొన్నది. అతడు డాక్టర్ కొట్నీస్. మనకు దక్కినవారిలో ఇద్దరు—డాక్టర్ అటాల్, డాక్టర్ ముఖర్జీ—నేనీ వాక్యాలు వ్రాస్తూ ఉండగా కారాగార బద్ధులై ఉన్నారు. ఈ ఫాసిస్టు వ్యతిరేక గాథకు వీరి నిర్బంధం, కొంచెం విపరీతమే అయినా, చాలా ప్రధానమైన విషయం. ఇక మిగిలిన దళసభ్యులు ఇద్దరిలోనూ దళపితామహులు డాక్టర్ చోల్కర్ తమ వైద్యవృత్తిలో మునిగి ఉన్నారు. అయినా వీరు కథ ఆసాంతంవరకూ చైనాలో లేరు. ఉత్తర చైనా శీతోష్ణస్థితి వీరికి బొత్తిగా పడలేదు. ఏడాదివుండి తిరిగి వచ్చేసినారు.

పోతే—ఈ పనికి పూనుకోడానికి మిగిలినది డాక్టర్ బాసు ఒక్కరు. మొన్న మొన్ననే చైనానుంచి తిరిగివచ్చినారు. వచ్చింది మొదలు క్షణం తీరిక

లేక దేశాటనం చేస్తూనే వున్నారు. మరోవైద్య దళాన్ని పంపవలెనని వీరి సంకల్పము. అంతటి నిర్విరామ కార్యక్రమములోనూ ఒక పక్షము రోజులు పూసగుచ్చినట్టు కథా క్రమం యావత్తూ నాకు చెప్పినారు. ఈ పదిహేనురోజుల సంభాషణలలోనూ తెలుసుకొనిన విషయాలూ, ఇంచు మించు సమగ్రముగానే ఉన్న వీరి డెయిరీ ఈ గ్రంధరచనలో నాకు ఎంతో ఉపకరించినవి. వివరాలను పూర్తి చేయడానికీ, చైనా వాతావరణమును కల్పించడానికీ ముద్రిత గ్రంథాలనుంచి ధారాళంగా విషయములను సేకరించినాను. అలాంటి గ్రంథములలో ఎడ్గార్ స్నో రచనలు ముఖ్యమైనవి.

నేను తల పెట్టిన ఈపని గ్రంథకర్తలకంటే విలేఖరి చేయతగ్గపని. మాటలేనావి. అనుభవాలు ఆ అయిదుగురు అసహాయశూరులవీ. పరుల అనుభవాన్ని ఆనందించడమే విలేఖరుల అలవాటు. డాక్టర్ బాసు తమ అనుభవములను నివేదించుతూవుంటే, వారితోబాటు ఆ ప్రాంతాలలో, నేనూ ఈ పంచపాండవులతో సంచరించుతూవున్నట్టేవుంది. చుంగ్ కింగ్‌లో జపాన్ విమానదాడి జరిగినప్పుడూ, ఉత్తర చైనాలో శత్రుమార్గాలమధ్యగా ప్రాణాలు పిడికిట్లో పెట్టుకొని ప్రయాణముచేస్తూ వున్నప్పుడూ వారితోబాటు ఉండినట్టే ఊహించుకొని ఆ అనుభూతిని పొందకలిగినాను.

ఈ అత్యద్భుత గాధను గ్రంధస్తంచేసే అవకాశము లభించడము నిజంగా మహా గొప్ప అదృష్టం. చైనాకు ఇలాంటి వైద్యసహాయక దళము పంపవలెనని ఓం ప్రథమంలో పండిట్ జవహరలాల్‌నెహ్రూ విజ్ఞప్తి చేసినదిమొదలు, ఎందుచేతనో చెప్పలేను కాని, నేను పూర్తిగా ఈ దళకలాపములో లీనమైపోయినాను. స్వచ్ఛంద సేవకుల కొరకు విజ్ఞప్తిజరిగిననాడు—1938—నేను షాంఘైలో ఉన్నాను. చైనా ప్రజలు యావన్మందిన్నీ, భారత ప్రజానీకము తరఫున ఈ సుహృద్భావ ప్రకటనకు, ఎంతటి కృతజ్ఞతను వెల్లడించినారో నేను స్వయంగా ఎరుగుదును—ప్రత్యక్షంగా చూచినాను. ఈ దళము చైనాలో పనిచేస్తూవున్న నాలుగు సంవత్సరములూ, ఇందుకు సంబంధించిన వార్తలను బహుశ్రద్ధగా అతిజాగ్రత్తగా గమనించుతూవుండేవాణ్ణి. అయితే వీరి కార్యకలాపంగురించి భారతీయ పత్రికల్లో అట్టే ఎక్కువగా ప్రకటితమౌతూవుండేది కాదు. గడచిన సంవత్సరం డాక్టర్

కొట్నిస్ గతించిన విషాదవార్త విన్నాను. వెంటనే "బొంబాయి క్రానికల్" పత్రికలో "అతను ఆఖరు ఘడియలు ఎలా గడిపివుంటాడు?" అన్న ప్రశ్నమీద ఊహాగానము చేసినాను. తరువాత డాక్టర్ బాసు నేను ఊహించి వ్రాసినది వాస్తవిక పరిస్థితులకు చాలా దగ్గరగానే ఉన్నట్టు చెప్పినారు. చైనాకు మరోవైద్యదళమును పంపాలి అన్నది "రేపు మనది" అనేనా నవలలో ప్రధాన అంశము. వీటన్నింటివల్లా ఈ గ్రంధరచనకు అవసరమైన అర్హత, హక్కు సంపాదించినాను అనే నేను భావిస్తున్నాను.

ఉద్రేక పూరితము, ప్రోత్సాహ జనకము ఈ గాధ. జన్మానికల్లా శివరాత్రి అన్నట్టు విలేఖరులజీవితాలలో ఇలాంటి ఉత్కృష్టకార్య నిర్వహణం ఎప్పుడో ఒకసారి వస్తుంది. ఈ ఐదుగురు వైద్యులు ఆరోగ్యం గురించి ఆలోచించుకోలేదు. ప్రాణాలసంగతి పట్టించుకోలేదు. జపాన్ విమానాలు బాంబులవర్షం, విధీ విరామం లేక కురిపిస్తున్నా అనుభవులవలె అతి మెలకువగా తప్పించుకు తిరిగినారు. శత్రుముట్టడిని నిర్లక్షించి పనిని సాధించినారు. చాలీ చాలని ఆహారంతో కడుపునింపుకొని, ప్రాణాల విలువపుకొని, అప్పటి కప్పుడు అవసరాలకు అనుగుణంగా తయారుచేసుకొనిన పరికరాలతో కొండ గుహలలోనూ, కర్షకుల కుటీరములలోనూ అత్యద్భుతంగా శస్త్రచికిత్సల సైతము చేసి ఎన్ని ప్రాణాలనో కాపాడిన ధీరులు. వీరులు ఈ అయిదుగురున్నూ. వీరికి సంబంధించిన వీరగాధ ఇది. వీరిలో అగ్రజుడు అరవై సంవత్సరాలు నిండిన డాక్టర్ చొల్కార్. కనిష్ఠుడు డాక్టర్ కొట్నిస్. పాతిక వసంతములను చూచివుంటాడు. బాధలనుభవించి బందీకృతమైన హృదయముతో భారతావని, వసుంధర మూరుమూలల భరింపజాలని బాధలపాలైన మానవకోటికి, సౌహార్ద్ర ప్రకటనమే ఈ పాండవచరిత్ర. ప్రపంచమంతటా పరివ్యాప్తమైన ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమానికి జాతీయ భారతదేశం చేసిన సహాయము ఇది. భారతీయుల ప్రజాస్వామ్య ప్రీతికి ప్రబల ప్రత్యక్ష నిదర్శనం. తాము సర్వ స్వతంత్రులే అయితే దురాక్రమణకు ఆహుతి అవుతూవున్న చైనాకు ఎంతటి సహాయము చేయగలరో తెలుపుటకు ఇదొక చిన్న నిదర్శనము. అమెరికా, బ్రిటన్ దేశములలో ఈనాడు చైనాయెడల వగలమారి ప్రేమ, ప్రయోజనం మాలిన సానుభూతి అపారముగా వెల్లడి అవుతున్నది. సమర సామాగ్రివి,

అందునూ యుద్ధనిర్వహణమునకు అత్యంతావశ్యకమైన చమురును అమెరికా జపాన్‌కు విరివిగా ఎగుమతిచేస్తూవున్న రోజులలో, బర్మారోడ్డును బంద్‌చేసి జపాన్ యుద్ధదేవతల సంతృప్తిపరచ బ్రిటన్ ప్రయత్నిస్తూవున్న రోజులలో, భారతదేశం చైనాకు ఈ వైద్యసహాయక దళమును పంపినది. ఇందుకు బాధ్యులెవరు? ప్రోత్సాహకుడు ఎవరు? జవహరలాల్ నెహ్రూ! ఆ పండితుడు ఈనాడు ఎక్కడ ఉన్నాడు? ఇనుప కమ్ములమధ్య. ఈ స్థితికి కారకులు ఎవరు? భారతదేశ పాలకులు: బ్రిటిష్ ప్రభువులు—చైనాకు మిత్రులమని ప్రకటించుకునే ప్రముఖులు. ఆశీర్వదించి ప్రోత్సహించిన మహాత్ముడు బ్రిటిష్‌వారి ఖైదీ. చైనా సహాయక సంఘ కార్యదర్శి, ఈ కలాపానికి కావాల్సిన ధనాన్ని పోగుచేసిన జి. పి. హాతీసింగ్ ప్రస్తుతం పెరోలుమీద విడుదల అయినారు. నిధికి విరాళాలు ఇచ్చి వైద్యదళం చైనా వెళ్ళడానికి వీలుచేసిన వేలాది భారతీయులు బ్రిటిష్ పాలకుల నిర్బంధములో ఉన్నారు. ఇక ప్రాణాలను సైతం లెక్కచేయక, చైనా ప్రజలకు సహాయం చేయడమే పరమావధిగా బెట్టుకొని చైనా వెళ్ళివచ్చిన దళ నాయకులు డాక్టర్ అటాల్, సభ్యుడు డాక్టర్ ముఖర్జీ ప్రభుత్వ అతిథులుగా కారాగారంలో వున్నారు. ఇంక మిత్రరాజ్యాలలో జరిగే దుష్ప్రచారానికి, అభూత కల్పనలకు ఆద్యంతాలు అంటూ వున్నాయా? అని అనుమానం కలుగుతుంది. జవహరలాల్ నెహ్రూ, మహాత్మా గాంధీ, డాక్టర్ అటాల్, డాక్టర్ ముఖర్జీ....వీరందరూ ఫాసిజానికి మిత్రులట! ప్రజాస్వామ్యానికి ప్రబల విరోధులట। ఈ అంతులేని అసత్య ప్రచారానికి, దరి, దాపులులేని దుష్ప్రచారానికి ఈ గ్రంధం సమాధానమిచ్చుగాక!

భారతీయ వైద్య దళానికి చైనాలో ప్రభుత్వ ఉన్నతోద్యోగి మొదలూ వీరులయిన సామాన్య పౌరునివరకూ ఇచ్చిన అసాధారణ స్వాగతం భారత జాతీయ కాంగ్రెస్ ప్రాతినిధ్యాన్ని విస్పష్టంగా విదితంచేసినది. న్యూ ఢిల్లీ నిరంకుశాధికారులు, బ్రిటిష్ ప్రభుత్వ తాబేదారులు విమానయానంచేసి వాషింగ్‌టన్, న్యూయార్క్ వెళ్ళి వేదికలనెక్కి, తామే భారత ప్రతినిధులమని ఎలుగెత్తి చాటవచ్చును. కాని గాంధీ, నెహ్రూ ప్రభృతులు పంపిన ఈ అయిదుగురు వైద్యులను చైనా ప్రజలు భారత రాయబారులుగా పరిగణించినారు, స్వాగతమిచ్చి సన్మానించినారు.

వీరిద్వారానే భారతీయులు చైనా సహోదరులతోసంభాషించినారు. సౌహార్ద్రసందేశ మును పంపినారు. అనన్య సామాన్యమైన చైనా ప్రతిఘటనయెడల తమ అభిమా నాన్ని ప్రకటించినారు. నేటి స్వాతంత్ర్య పోరాటములో తమ ప్రాచీన సంబంధ బాంధవ్యాలను తిరిగి వెల్లడించి గాఢమొనర్చుకొనినారు. వైద్యులు మళ్ళా భారత దేశమునకు తిరిగివచ్చినప్పుడు భారత ప్రజావాణికి చైనా ప్రజల ప్రతిధ్వనిని పట్టుకవచ్చినారు. అచిరకాలములోనే భారతీయులు తమ స్వాతంత్ర్యాన్ని పొందె దరుగాక అనే వారి సందేశమును తెచ్చినారు. అయిదుగురిలో ఒకరు తిరిగి రాలేదు. అతడే డాక్టర్ కొట్నిస్. తనవీరోచిత మరణముద్వారా చైనా భారత దేశముల స్వేచ్ఛాజీవుల సంబంధముల గట్టిపరచినాడు.

# 2. ఆయుధములులేని వీరులు

మహా భయంకరమైన, అతి క్రూరమైన అధునిక యుద్ధాలలో కొంచానికి కొంచం మెరుగు, ఈ నిరాయుధులైన వీరుల కృషి. ఛంపడానికి గాక చావడానికి సిద్ధమై, రణరంగములోని ప్రమాదాలను నిర్లక్ష్యంచేసి ప్రాణముల రక్షించే వీరి ప్రయత్నమే పవిత్రమైనది. వైద్యులు, ఉపచారికలు, గాయపడినవారిని మోసే సేవకులు.........ఈ కరుణావాహినే, మానవుడు కేవలం ఏ ఉరాంగుటాంగ్ పరిణామాన్ని పొందక, కాస్త మంచిస్థితిలోకే మారవచ్చును అనే ఆశకు ఆధారమైనది.

గౌతమ బుద్ధుడు, యేసుక్రీస్తు, మహమ్మద్ అదిగాగల కరుణామయుల సాంప్రదాయములను తరాలవెంట ముందుకు తీసుకొనిపోతూ, క్రిమియన్ యుద్ధ ములో ఫ్లారెన్స్ నైటింగేల్ వెలిగించిన, ఆ మినుక్కు మినుక్కు మనే దీప మును పదిలంగావుంచి, సాటి మానవులయెడ మానవుడు ప్రదర్శించే క్రౌర్యాల ఫలితముగా మానవకోటి సంతనూ ఆవరించిన అంధకారములో ఆశాజ్యోతిని కొందరు నిలబెట్ట కలిగినారు.

1899 వ సంవత్సరములో బోయరు యుద్ధము భయంకరముగా జరుగుతూ

ఉన్నది. చూచి సహింపజాలవి ఒక భారతీయ బారిస్టరు ప్రాణరక్షణకు కంకణము కట్టుకొని రణభూమికి బయలుదేరే పరిచారకుల దళములో చేరినాడు. అతడే మోహనదాస్ కరంచంద్ గాంధి. తెల్లజాతుల నిరంకుశత్వానికి, ద్వేషానికి గురి అవుతున్న నల్లజాతికి చెందినవా డితడు. సాయుధమైన శ్వేతజాతి సామ్రాజ్యాన్ని సంఘటిత శాంతి ప్రతిఘటనతో ఎదుర్కొని తనజాతిని, తనదేశమును స్వాతంత్ర్య మార్గాన నడుపనున్నాడు. సహజముగా తనను, తనవారినీ, బాధలపెట్టి అవమానములపాలు చేసినవారంటే ఎవరికిగాని క్రౌర్యం, ద్వేషం ఉండవచ్చు. కాని అతడు విషపూరితమైన ఈర్ష్య, ద్వేషము, దౌర్జన్యమును మేఘములనధిగమించి, మానవత్వ పతాకను యుగయుగములుగా కాపాడిన మహానుభావుల వంశమునకు చెందినవాడు.

గాయపడినవారిని సమర భూమినుండి చికిత్సా కేంద్రములకు మోసుకు వచ్చే సేవక దళములో చేరినాడు. ప్రమాదాలతో కూడిన పని ఇది. అనేక దఫాలు ఆయనకు ప్రాణాపాయం కొద్దిలో తప్పిపోతూ వచ్చింది. ధైర్య విశ్వాసములనే ఆయుధములుగ, తనను, తనవారినీ అవమానాలపాలుచేసిన వారి ప్రాణముల రక్షించుటకు నిర్భయముగ, నిరుపమాన సాహసముతో రణరంగమునకు పోయి వస్తూవుండేవాడు.

స్వయముగా ఈ సంఘటనలను అవలోకించిన ఆంగ్లేయుడు ఒకరు గాంధీ, ఆయన దేశీయుల సేవను ఇలా ఉగ్గడించి ఉన్నారు—

"అతడు, తాను స్వయముగా ఆచరించని వాటిని ప్రబోధించడము నేను ఎన్నడూ చూచి వుండలేదు. రణరంగమునుండి నిహతులైన వారిని వైద్యకేంద్రములకు చారవేయడములో ఆయన అత్యంత ప్రధాన పాత్రవహించినాడు "సమర భూమికి సమాయత్తకండి" అన్న పిలుపు కోలెన్సో యుద్ధానికి ముందురోజు వచ్చినది. ఈ వెయ్యిమంది భారతీయులూ ఆలించి, అక్షణమే ఆయత్తమైనారు. అధికోత్సాహముతో బయలుదేరినారు. అత్యంత అవసరముగావున్న సమయములో ఛివ్‌లేవద్ద దిగి షువ్వాకనైనా గమనించక వెంటనే కొలెన్సోకు ప్రయాణమైనారు. ఆ రాత్రి అంతా నిర్విరామముగ పనిచేసినారు.

"వారారాత్రి పొందిన అనుభవం అతి విషాదకరమైనది. విదారకమైన దృశ్యముల వీక్షించుటతో హృదయాలు చెదిరిపోయినవి. గాయపడినవారి సంఖ్య చాలా ఎక్కువగా నుండెను. కొందరు సైనికుల మరణవేదన చూచేవారి మనస్సుల్లో నాటుకుపోయి హృదయాలకు హత్తుకుపోయినది. అతి భయంకరమైన తలంపుల ప్రవాహం బయలుదేరినది. ఎటుచూచినా నిహతులైన సైనికులే. కుప్పలు కుప్పలుగా పడివున్నవి శవాలు. ఇక్కడి ఈ యుద్ధములో దాదాపు నూటయాభైమంది మరణించివుంటారు. కనీసం ముప్పాతిక వెయ్యి గాయపడినవారు ఉంటారు. ఆపత్సమయమున చేసిన ఆర్తనాదంఫిని, పంపిన పిలుపు నందుకొని వెంటనే వెయ్యిమంది భారతీయులువచ్చి యూరపియనుల పక్కన, వారితో పోటీపడి, మరీ సేవచేసినారు.

"పోరాటము ముమ్మరముగావుంది. నదికి అవతలి గట్టున సైనికులు ఘోరముగా దెబ్బలు తింటున్నారు. అక్కడ సహాయపడేవారి సంఖ్య అత్యల్పం. ప్రమాదాల నిర్లక్ష్యంచేసి, ప్రాణాల లెక్కజేయక నదినిదాటి అవలివొడ్డుకుపోయి అమోఘముగా పనిచేసినారు. ఆనాడు ఆ భారతీయులు చేసిన అద్భుత సేవాత్యాగం ఫలితముగనే మన సైనికులు అనేకులు తమ ప్రాణాల దక్కించుకోకలిగినారు. ఒకవంక అవమానాల పరంపర, మరోవంక తుపాకీ కాల్పులు అయినా అలక్ష్యంచేసి ప్రశంసాత్మకముగ పనిచేసినారు. సైనికుల కృతజ్ఞత, స్తుతికి పాత్రులైనారు."

రాజకీయ వివాదములనూ, జాతి వైషమ్యములనూ అలక్ష్యించి, మానవత్వ ప్రేరణచే 1914 లో మిత్రసేనకు చెందిన, గాయపడిన సైనికులకు సహాయము చేయవలెననే ఆసక్తితో భారతీయ స్వచ్ఛంద వైద్యసహాయ దళమును సంఘటిత పరచినారు గాంధీజీ.

అప్పటికి రెండు సంవత్సరముల క్రితము బాల్కన్ యుద్ధములో చిక్కుకొని టర్కీ నానా అవస్థ పడుతూ వున్నది. టర్కీ చావుబ్రతుకులమధ్య అల్లాడుతూ ఉన్నది. ప్రత్యేక దేశముగా ఉండటమో, ఊడ్చుకు పోవటమో తేలవలసిన విషమస్థితి ఏర్పడినది. యుద్ధజ్వాలలు అన్నివైపులకు వ్యాపించినవి. వేలాది సైనికులు సకాలములో చికిత్స లేమిచే మరణించుచున్నారు. మందులిచ్చేవారు

లేరు. మందులూ లేవు. ఆరోజులలో, బ్రిటన్‌లో వైద్యవిద్య నభ్యసించిన, ముక్తార్ అహమ్మద్ అన్సారీ, టర్కీకి వైద్యదళాన్ని తీసుకువెళ్ళవలెనని సంకల్పించినాడు. వైద్యులను, ఉపచారకులను, ఔషధములను సమీకరించి వెంటనే టర్కీకి బయలుదేరినాడు. భారతదేశమునందలి మహ్మదీయులందరు అమితముగ విరాళములిచ్చినారు స్వార్థరహితసేవచే ఈ వైద్యదళము టర్కీ అభిమానమును, గౌరవమును పొందినది.

చరిత్రలో మరి ఏ ఇతర సంఘటనా యింత కలవరపెట్టలేదు. నిరపరాధులు, నిరాయుధులు అయిన అబిసీనియనులపై ఫాసిస్టు ఇటలీ 1935లో గావించిన దురాక్రమణ భారతీయులందరినీ దిగ్భ్రాంతులచేసినది. ముస్సోలిని ముష్కరతను నిరసింపనివారు లేరు. రాజకీయ చైతన్యంపొందిన భారతదేశవాణి—జాతీయ కాంగ్రెస్‌ద్వారా—ఇటలీ చర్యయెడల నిరసనమును, అబిసీనియా యెడల సానుభూతిని తెల్పుతూ పలికినది. ఇథోపియాకు వైద్యదళాన్ని పంపడానికి అనేక ప్రయత్నాలు జరిగినవి. ఏ ప్రయత్నమూ కార్యరూపము దాల్చకముందె అబిసీనియా ఆహుతి అయిపోయినది. ఫాసిస్టు మృగతృష్ణకు బలి అయిన మొదటిదేశం అబిసీనియా. నానాజాతి సమితి అసమర్థత, అగ్రరాజ్యాలు అర్థహృదయముతో అయిష్టంగా అమలు జరిపిన ఆంక్షల నిరుపయోగం ఇందుకు హెచ్చుగ కారణభూతములైనవి.

స్పెయిన్ సమరానంతరము మూడు సంవత్సరములకు ఆ అంతర్యుద్ధంనేటి మహాసంగ్రామానికి నాంది ప్రస్తావన అని ప్రపంచప్రజలు గ్రహించకలిగినారు. కాని అప్పుడే అఖిల భారత జాతీయ కాంగ్రెస్ భారతీయ అనధికార విదేశాంగ మంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వమున, రిపబ్లికన్ స్పెయిన్ యెడలా, విద్రోహ శక్తుల నాయకుడు జనరల్ ఫ్రాంకో అతనికి మద్దత్తునిస్తున్న నాజీ—ఫాసిస్టు అభిమానులయెడల తన వైఖరిని విస్పష్టముగ ప్రకటించినది. ఆ సమయములో కాంగ్రెస్ రాష్ట్రశాసన సభల ఎన్నికలలో పాల్గొంటూవున్నది. పండిట్ నెహ్రూ ఎన్నికల ప్రచారం సందర్భములో వేలాది వేదికలమీదనుంచి ఈ విషయమై అసందిగ్ధంగా కాంగ్రెస్ వైఖరిని ప్రకటించుతూ వచ్చినారు. ప్రతి ఉపన్యాసములోనూ స్పెయిన్ సంఘర్షణ ప్రధానవిషయమైనది. తరువాత

కొంతకాలమునకు డాక్టర్ అటాల్ రిపబ్లికన్‌స్పెయినుకు బయలుదేరినారు. అటాల్‌పండిట్ నెహ్రూకు కొంచెం దూరపుబంధువు. రిపబ్లికన్ స్పెయిన్‌కు భారతీయుల సానుభూతి సందేశముతో రిపబ్లికన్ సైనికులకు వైద్యసహాయం చేయవలెననే డాక్టర్ అటాల్ వెళ్ళినారు. ప్రజల సానుభూతి భారతీయ నైతికబలం రిపబ్లికన్ పక్షముననే ఉన్నాయని తెలియచేయడానికి పండిట్ నెహ్రూ స్పెయిన్ వెళ్ళినాడు.

ఇంతలోనే చైనా విషాద నాటక ప్రదర్శనము ప్రారంభమైనది. చైనా పవిత్రభూమిపై జపాన్ విషచ్ఛాయలు వ్యాపించుతూ ఉన్నవి. నాన్‌కింగ్ సంఘటన—యదార్థానికి రెండవప్రపంచ ప్రళయానికి ఉపక్రమణ—బ్రహ్మాండమైన యుద్ధముగ పరిణమించినది. ఆధునిక ఆయుధ సామగ్రి, వైరిబలంతో సరియైన సాధన సంపత్తిలేక, ఎంతో వెనుకబడి ఉండిన చైనాపై దండయాత్ర ప్రారంభించి జపాన్ ఖండ ఖండములుగ కబళించుతూ వున్నది. బ్రిటన్, అమెరికా దేశములు తమకేమీ పట్టనట్టు ఉపేక్షించి ఊరుకొన్నవి. ఆదేశాలు సామ్రాజ్య విస్తరణ సందర్భములతో సరిపోల్చి చూచుకొనినప్పుడు అవక్షతమైన చైనాపై జపాన్ జరుపుతూ వుండిన యుద్ధంలో ఆక్షేపణీయమైనట్టిగాని, అభ్యంతరమైనట్టి గాని విపరీతము ఏమీ గోచరించలేదు. కాని పరపాలన విషాదానుభవం పొందిన భారత హృదయము కలత చెందినది. భారతీయులు కలవరపడినారు. అబిసీనియా, స్పెయిన్ దేశాలయెడల ప్రకటించిన సానుభూతి హెచ్చుగ ఆదర్శానువర్తము. చైనా విషయమున ప్రకోపితమైన భావములు హెచ్చుగ వ్యక్తిపరమైనవి. విశాల ప్రపంచములో ఒకమారు మూలనవున్న దేశముకాదు చైనా. ప్రపంచ పటములో కనుపించీ కనుపించని నలుసున్నూ కాదు. మన పొరుగునే ఉన్నది. అనేక శతాబ్దములనుంచీ ఆ దేశముతో మనము చెలిమితో మెలగుతు, దేశీయులతో సమరసముగా ఉంటూ వచ్చినాము. ఆదేశములో వాణిజ్య వ్యాపార వ్యవహారముల నడిపినాము. ఉభయదేశములకుమధ్య మతముల, మతప్రవక్తల తత్వవేత్తల మారకము జరిగినది. బుద్ధుడు, అశోక చక్రవర్తి నాటినుంచి పరస్పర సంబంధములు పెంపొందుచూ వచ్చినవి. చైనా సాంఘిక రాచకీయ విప్లవము మనకు మన స్వాతంత్ర్య పోరాటములో ఉత్సాహాన్నీ, హుషారునూ ఇచ్చినది.

సన్‌యట్‌సెన్, చాంగ్‌కైషెక్, మాంట్సీటంగ్, చూటే వంటి మహిమాన్వితుల మాతృభూమి చైనా. అట్టి చైనా ప్రజలు చావో, బ్రతుకో తేల్చుకొన పోరాటమును సాగించుతూవుంటే భారతదేశము నిర్లిప్తముగ ఉపేక్షించి ఊరుకొనగలదా?

అయితే పారతంత్ర్యదేశం చేయగలిగేదేమి? అదే సర్వస్వతంత్ర భారతదేశము అయితే, ప్రత్యక్షంగా విస్పష్టంగా జపాన్‌పై యుద్ధము ప్రకటించకపోయినప్పటికీ, స్పానిష్ అంతర్యుద్ధం జరిగే రోజులలో రిపబ్లికన్ పక్షమునకు సోవియట్ రష్యా సహాయం చేసినట్లే చైనాకు భారతదేశం సహాయముచేసి వుండేది. ఆశపోతుల సంతృప్తిపరచి తమసామ్రాజ్యాన్ని సంరక్షించుకొన తలపడిన ఛాంబర్లీన్ భావపూరితమైన బ్రిటిష్ ప్రభుత్వం జపాన్ వ్యతిరేక ప్రదర్శనలంటేనే కళ్ళెర్రచేసేది. ఈ పరిస్థితుల్లో అటు చైనాకు సహాయకారిగా ఉండే విధంగానూ, ఇటు భారతదేశ సరోపకార సాంప్రదాయానికి తగ్గట్టుగానూ పండిట్ జవహరలాల్ నెహ్రూ ప్రతిభావంతమైన పథకాన్ని తయారుచేసినారు. డాక్టర్ అటాల్ నాయకత్వమున వైద్యసహాయక దళమును పంపడానికి కాంగ్రెస్ నిశ్చయించినది. స్వచ్ఛంద సేవకులకొరకు విజ్ఞప్తి చేసినారు. దళసభ్యులను నిర్ణయించుటకు ఒక ఉపసంఘమును ఏర్పాటుచేసినారు. ప్రముఖ వైద్యులు డాక్టర్ బి. సి. రాయ్, డాక్టర్ జీవరాజమెహతా ప్రభృతులు ఇందులో సభ్యులు. అవసరమైన నిధిని పోగుచేయడానికి, ఔషధములను సేకరించడానికీ ఒక ప్రత్యేక ఉపసంఘమును, హుతీసింగ్ కార్యదర్శిగా, నియమించినారు. ఎందరో భూరివిరాళముల నిచ్చినారు. ఉచితముగా ఔషధముల నిచ్చినారు సాధారణ ప్రజలుకూడా శక్తికొలదీ సహాయము చేసినారు. నాటక సినిమా ప్రదర్శనముల ఏర్పాటుచేసి ధనము పోగుచేసినారు. దళంలోచేర నుత్సాహపడుతూ ఎందరో దరఖాస్తులు పంపినారు. ఎందరినో పరీక్షించినారు. గతానుభవమునూ, శారీరక ఆరోగ్యమునూ, మామూలు విజ్ఞానమునూ గమనించి నలుగుర్ని ఎన్నిక చేసినారు. అయిదవడాక్టర్ దళాధిపతి అటల్.

డాక్టర్ ఛోల్కార్ అందరిలోకీ పెద్దవాడు. చైనాకు ప్రయాణం కట్టినప్పటికే ఆయనకు అరవై దాటినవి. వైద్యవృత్తిలో ఆరితేరిన వృద్ధమూర్తి. నాగపూరులో

ప్రథమశ్రేణికి చెందిన వైద్యులలో ఒకరు. భారత జాతీయోద్యమం అంటే అమిత అభిమానం అని ప్రతీతి. గాంధీజీ భక్తుడు. ప్రమాదాలతో కూడుకొనివున్న ఈ చైనా యాత్రకు పరోపకారబుద్ధి, సేవా తత్పరత, దేశాభిమానము ఆయనను పురికొల్పినవి. మిగిలిన ముగ్గురున్నూ ముప్పైఏదాటనివారే. కలకత్తానుంచి వచ్చిన డాక్టర్ ముఖర్జీ, షోలాపూర్‌నుంచి వచ్చిన డాక్టర్ కొట్నిస్ ఇద్దరూ బ్రహ్మచారులే. ఒక గొప్ప ఉద్యమానికి తోడ్పడగల అపూర్వ అవకాశము లభించినదని ఉత్సాహపడి బయలుదేరినారు. నాల్గవ సభ్యుడు డాక్టర్ విజయ్ కుమార్ బాసు. అదృష్టం అలా కలిసివచ్చింది కనుకనే ఇతనికి ఈ అవకాశం లభించినది. తీవ్రవాద రాజకీయములలో అభిరుచి, చైనాపైగల అభిమానం ఈ ప్రయాణమున కతనిని ప్రేరేపించినవి. అసలు నాల్గవ డాక్టర్‌గా కలకత్తా వైద్యులు రనేన్ సెన్ ఎన్నుకొనబడినారు. వారు కమ్యూనిస్టులు అని బ్రిటిష్ పోలీసులు అనుమానించినారు. అసలు అప్పటికే అనేక రాజకీయ నేరములకింద శిక్షను అనుభవించివున్నారుకూడా. ఈ కారణాలవల్ల చైనా పోవడానికి వారికి ప్రభుత్వం అనుమతి నివ్వలేదు. ఆఖరి నిమిషములో కమిటీవారు డాక్టరు బాసును ఎన్నుకొనినారు.

ఈ అయిదుగురు 1938 ఆగస్టు మాసాంతంలో బొంబాయి చేరినారు. అదే మొదటిదఫా అందరూ కలుసుకోవడము. దళమును బయలుదేర తీయడానికి తుదిప్రయత్నములు, ఏర్పాటులు చేయవలసిన బాధ్యత, భారము అంతా డాక్టర్ అటాల్‌పై బడినది. బొంబాయి పౌరులు గొప్ప వీడ్కోలు ఇచ్చినారు. బొంబాయి రాష్ట్రీ కాంగ్రెస్ కమిటీ అధ్వర్యమున బ్రహ్మాండమైన బహిరంగ సభను ఏర్పాటుచేసినారు. శ్రీమతి సరోజనీ నాయుడుగారు అధ్యక్షత వహించినారు. "మీరు నిర్వహింప పూనుకొనినపని ప్రమాదభరితమైనది మీ చైనా సహచరులతోబాటు మీరు మీ ప్రాణాలను అర్పింపవలసి వస్తుంది" అని అధ్యక్షురాలు హితోక్తుల బలికినది. నాలుగు సంవత్సరములతరువాత "చైనాలో డాక్టరు కొట్నిస్ మరణించినాడు" అన్నవార్త వచ్చినరోజున నాకు ఆనాటి మాటలు స్ఫురణకు వచ్చినవి. కాని సెప్టెంబరు 1 వ తేదీన బొంబాయి రేవును వదులుతూవున్నప్పుడు ఆ అయిదుగురి హృదయాంతరాళములందైనా ఎట్టి విషాద భావనలూ లేవు

సరిగదా ఉత్సాహంగా, ఉల్లాసంగా ఉత్తమ కార్యసాధనకు ఉద్యుక్తులై ఉవ్విళ్ళూరుతూ వున్నారు.

స్థానిక చైనా సంఘమువారు దళ సభ్యుల సత్కరించినారు. చైనా బాలురు జాతీయ గీతముల గానంచేసినారు. చైనాప్రజల, ప్రభుత్వం తరపున బొంబాయిలోని చైనా వైస్‌కాన్సల్ వీరి వీడ్కోలు సభకు హాజరైనారు. కాంగ్రెస్ తరపున శ్రీమతి సరోజినీ నాయుడుగారు రేవువద్దకువచ్చి సాగనంపినారు. బొంబయి క్రానికల్ పత్రిక సంపాదకులు సయ్యద్ అబ్దుల్లా బ్రెల్వీగారున్నూ, హుతీసింగ్ దంపతులున్నూ నావ కదిలేవరకున్నూ ఉండినారు. ప్రయాణానికి ముందు రేవువద్ద చేరిన ప్రజాబాహుళ్యములో డాక్టర్ కొట్నీస్ మిత్రులు, పరిచితులు, బంధువులు, అతనితో చదువుకొనిన వైద్యులు చాలామంది వున్నారు. వృద్ధులైన కొట్నీస్ తలితండ్రులూవచ్చి తనయుని ఆశీర్వదించి పంపినారు. స్టీమరులోకి వెళుతూ వారి పాదాలు తాకి సెలవుతీసుకుంటూ ఉండగా పుత్రుని "కడసారి" దీవించినారు.

అర్ధరాత్రివేళ స్టీమరు ఈ అయిదుగురు అసహాయశూరులతో బొంబయి రేవు వదలింది. వారితోబాటు ప్రథమ చికిత్స కుపకరించు ఒకట్రక్కు, ఒక కారు, అరవై పెట్టెల ఔషధములు, ఒక యక్స్‌రే యంత్రము వీటితో బాటుయావద్భారతజాతి శుభాశీస్సులు, సుహృద్భావము, ఆశా సందేశము, స్నేహబంధములుకూడా ప్రయాణముచేసినవి.

# 3. సాహస కార్యోపక్రమము

"నేను చైనాకు పోతూవున్నాను. కాని నా హృదయము భారతదేశములోనే వుంటుంది. హృదయాంతరంగమున చైనా, భారతదేశములు కలసి ఏకమౌతవి. చైనా ప్రజల ధైర్యసాహసములు, అంతిమ విజయములో వారి అచంచల విశ్వాసము, ప్రమాద పరిస్థితులలో క్లిష్టసమయములలో ఐక్యం కాగల అద్భుతశక్తి—వీటిలో కొంత అయినా నేను భారతదేశమునకు తిరిగి వచ్చేప్పుడు తీసుకురాగలనని ఆశించుచూ వున్నాను."

— పండిట్ జవహరలాల్ నెహ్రూ

(1939)

స్టీమరు రెండవ తరగతి గదులు గుసగుసలతో నిండిపోయినవి. "మీకు తెలుసునా?" అనీ, "ఆ అయిదుగురూ భారతీయ వైద్యులు..." అనీ, "వారు చైనా వెళుతూ వున్నారట..." అనీ, "కాదు, కాదు, వాళ్ళని పంపుతూవున్నది భారత ప్రభుత్వముకాదు. గాంధీగారి కాంగ్రెస్" అనీ, "అసలు వారినిచూచారా" అనీ, ఇంతలో "అదుగో! అదుగో!....ఇదే వస్తున్నారు" అనీ అర్ధోక్తులలో, రహస్యాలు మాట్లాడుతూ వున్నట్టు వినిపించినవి. ప్రయాణీకులలో అహంభావకులు ఏకొద్దిమందినో మినహాయించి మిగిలినవారు యావన్మందిన్నీ వీరి పరిచయం సంపాదించవలెనని తహతహలాడి పోయినారు. నెత్తినవుండిన ఆ తెల్లని గాంధీ టోపీలు వారెందరిమధ్యవున్నా వారిని ఎత్తిచూపుచున్నవి. కొద్దిసేపటిలోనే అందరూ పరిచితులైనారు. పానోన్మాదులైన పాశ్చాత్యులు కొందరు తమ ప్రాచ్య దేశాల పరిజ్ఞానమును ప్రదర్శించి వీరిపై ప్రాపకము సంపాదించవలెనని తలంచినారు. అంగనలు తమ చెంతకు వీరిని ఆకర్షింప ప్రయత్నములు చేసినారు. మన వైద్యులకు వేటిపైనా వ్యామోహము కలుగలేదు. అందరిలోనూ వారికి, ఇరువురు చైనీయుల చెలిమి కాంక్షణీయమైనది. జన్మభూమికి పోతూవున్న ఈ చైనీయులిరువురే వీరిని ఆకర్షించినారు. వారికిన్నీ భారతీయుల పరిచయ భాగ్యమును పొందవలెనను కోరిక కలిగినది. వీరిరువురిలోనూ పెద్దవాడు చోటింగ్ చీ. ప్రఖ్యాతఆర్థిక సాంఘిక శాస్త్రవేత్త. "అమరేషియా" పత్రిక సంపాదకులు. పసిఫిక్ సంబంధముల సంఘసభ్యులు. రెండవ అతడు వాంగ్. ఇంగ్లండులో ఇంజనీరుంగు చదువు పూర్తిచేసుకొని తన విజ్ఞానమును తనదేశ అభ్యుదయమునకు వినియోగించవలెనని స్వదేశమునకు పోవుచున్నాడు. ఈ భారతీయ వైద్య పంచకము, అప్పటికె ఆధునిక చైనానుగురించి ప్రసిద్ధ రచయితల గ్రంధముల చదివినారు. కాని చైనావారిద్వారా అదనంగా విషయముల తెలుసుకొనవలెనని సంకల్పము కలిగినది. డాక్టర్ చోటింగ్ చీ విజ్ఞానఖని. చైనా సమస్య లన్నింటినీ ఆమూలాగ్రముగ గ్రహించినాడు. అన్ని విషయములు తెలిసిన అతడు చెప్పే విషయములు అత్యంత ప్రయోజనకరములుగదా!

అసలు ఆదిలో అనుకొనిన ప్రకారము అంతా సవ్యముగా జరిగివుండిన పక్షములో వైద్యదళం ఇటాలియన్ నౌక "కాంటివర్డ"లో వెళ్ళవలసి వుండెను.

అప్పటికే ఫాసిస్టు ఇటలీ మిలిటరిస్టు జపాన్‌తో గాఢ మైత్రిని ఏర్పరచుకొని ఎంతో సానుభూతిని చూపుతూవున్నది. అందుచేత స్వతంత్ర చైనాకు వైద్యసామ గ్రిని సరఫరాచేయ నిరాకరించింది. చివరి నిమిషంలో వీరు బ్రిటిష్‌వారి పి అండ్ ఓ కంపెనీ నౌక "రాజ పుటానా"లో ప్రయాణం చేయవలసివచ్చినది.

కొట్నిస్, బాసు, ముఖర్జీలు ఇంతకుపూర్వము ఎన్నడూ సముద్రయానము చేసి ఉండలేదు. ఈ కొత్త అనుభవము వీరికి ఎంతో ఆనందదాయకముగ వున్నది. ఎక్కడలేని ఉత్సాహమూ కలిగినది. ప్రయాణం అసౌఖ్యముగా గానీ, కష్టముగగాని వారికి కనిపించలేదు. వీలుగావున్నప్పుడు గ్రంథాలు తిరగవేయ డమూ, ఇతర సమయములలో "పడవ" ఉపరిభాగము మీదకుపోయి అలా నిల బడి చేపల చిలిపిగంతులను, అనువిశాలసాగరమున ప్రతిఫలించే సూర్యాస్త మయ సుందర దృశ్యములను చూస్తూవుండేవారు. లేదా ఆ ఇరువురుచైనామిత్రు లతోనూ సంభాషించుతూ వుండేవారు.

కొలంబోలో వీరికి ఘనమైన స్వాగతము ఇచ్చినారు. మున్ముందు జరుగ నున్న సన్మానముల కిదే ఉపక్రమణిక. వీరు కాంటన్ చేరేవరకూ 'రాజపుటానా' తాకిన ప్రతి రేవువద్దా బ్రహ్మాండమైన సన్మానములు జరిగినవి. కొలంబో రేవులో నౌక ప్రవేశించేసరికి బాగా తెల్లవారనేలేదు. పక్షుల కిలకిలారావములు మాత్రమే వినవచ్చినవి. అయినప్పటికినీ అక్కడి చైనా, భారతసంఘముల ప్రతినిధులు, కొలంబో వాణిజ్యమండలి సభ్యులు, రెడ్‌క్రాస్ సంస్థవారూ పత్రికా విలేఖరులూ చాలామంది వచ్చినారు. కొలంబోలోని గొప్ప విశ్రాంతిభవనం—గ్రాండ్‌హోటల్ —లో వీరికి విందు ఏర్పాటు చేసినారు. విందు పూర్తికాగానే దళ సభ్యులను సింహళం రేడియో స్టేషన్‌కు తీసుకుపోయినారు. నాయకుడు డాక్టర్ అటాల్ తమ దళ ఉద్దేశ్యముల వివరించుతూ చేసిన ప్రసంగమును బ్రాడ్‌కాస్టు చేసినారు. నాటి కార్యక్రమం పెద్ద పౌరసభతో ముగింపుకు వచ్చినది. నాడే డాక్టర్ అటాల్ ప్రముఖవక్తగా పేరొందినారు.

నాలుగు దినముల ప్రయాణం పిదప నౌక పెనాంగ్ రేవును ప్రవేశించినది. అచటి భారతీయులూ, చైనా ప్రజలు అధిక సంఖ్యాకులుగ వచ్చి అఖండస్వాగత మిచ్చినారు. చైనా బాల బాలికలు, యువతీ యువకులు "చీలై" అనే చైనా

జాతీయ గీతమును మనోహరముగ, ఉత్తేజ కరముగ గానము చేసినారు. చైనా చేరిన తరువాత ఏమూలకు పోయినా మన డాక్టర్లు ఈ గీతమును వింటూనే వుండే వారు. రేవునుంచి వైభవోపేతముగా వూరేగింపుచేసి స్థానిక చైనాసంఘభవనానికి తీసుకువెళ్ళినారు. స్వాగత రచనలు, ప్రశంసా ప్రసంగాలు, సౌహార్ద్ర ప్రకటనలు అభివందనాలు అన్నీ పూర్తి అయిన తరువాత చైనా, భారత దేశముల జాతీయ పతాకాలను ఇచ్చి బహూకరించినారు. భారత జాతీయ నాయకులకు జరుగవలసిన విధముగ ఊరేగింపులు ఉత్సవాలు, సభలు, సన్మానాలు తమకు జరుగుతూవుంటే భారతీయ వైద్యులకు అంత సుఖప్రదంగా కనిపించలేదు. "మనకు ఇంతంత సన్మానాలేమిటి?" అని కొంచెం చీకాకుపడుతూ వుండేవారు. కొలంబో చేర డానికి పూర్వం ఇలాంటివన్నీ దారివెంట వస్తవని వారూహింపనైనా లేదు.

పెనాంగ్‌నుంచి సింగపూర్ చేరారు. సింగపూర్ రేవు అతి సుందరమైనది. ఠీవిగా 'రాజపుటానా' రేవులోనికి ప్రవేశించినది. నౌక పూర్తిగా ప్రవేశించినదో లేదో లంగరుపడిందో లేదో "వందేమాతరం" 'చీలై' అనే నినాదాలు మిన్నుముట్టి నవి. ఒడ్డున ఉత్సాహాతిశయంతో సభ్యులకు స్వాగతమివ్వ ఉవ్విళ్ళూరుతూవున్న జనసమూహం చైనా జాతీయ పతాకముతోబాటు భారత జాతీయ త్రివర్ణ పతాక మున్నూ ఎగురవేస్తూ నిలచివున్నారు. చైనా—భారతదేశ ఐక్యతకు చక్కని ఈ చిహ్నమును చూచి భారత వైద్యులు ఉప్పొంగిపోయినారు. నావ ఆగింది. వైద్యులు వెలుపలికి వస్తూవుండగా చైనా బాలికలు పూలమాలల వారి మెడనువైచి స్వాగతమిచ్చినారు. మోటారుకారులో ఊరేగింపుచేస్తూ వైద్యులను చైనా వాణిజ్య మండలి కార్యస్థానమునకు తీసుకొని వెళ్ళినారు. సింగపూర్ భారతీయులు విక్టోరియా స్మారక భవనములో వీరికి గొప్ప విందుచేసినారు. మరపురానిది సింగ పూర్ సన్మానం! మెడను పడిన మాలలకు మితిలేదు. అంగరకములన్నియూ తడిసి ముద్దయినవి. విక్టోరియా భవనం విందుకు రేవుకుపోయి వస్త్రముల మార్చుకురావలసి వచ్చినది. ఆ రాత్రి పన్నెండు గంటలకు "రాజపుటానా" సింగ పూర్‌ను వదులుతూవుంది. వైద్యులు కృతజ్ఞతాభావ ప్రేరితమైన తలంపులతో సెలవుతీసుకొనినారు.

వీరిని సన్మానించడం జపాన్‌వారైనా మానలేదు. దశము హాంగ్‌కాంగ్

చేరనే లేదు. మార్గమధ్యముననె అనేక యుద్ధనౌకలు, విమాన వాహక నౌకలు, జలాంతర్గాములతో "రాజపుటానా" నౌక నెదుర్కొని "అకస్మాత్తుగ అఖండ సన్మానము" నిచ్చినారు భారతీయ వైద్యదళమునకు. బ్రిటన్ జపాన్‌కు అనుకూలముగా వుండిన తటస్థదేశము. అందుచేతనే సన్మానము నిశ్శబ్దముగ సందర్శనముతోనె సమాప్తమైనది. అయినా ఈ "రాజపుటానా"లో భారతీయ వైద్యులు అయిదుగురు వున్నారనీ, వీరు తమచే గాయపరుపబడిన చైనా సైనికులకు సహాయముచేయ వెళుతూవున్నారనీ జపాన్ సైనికులు తలంచి యుండలేదు.

రెండువారముల ప్రయాణం తరువాత వీరు హాంగ్‌కాంగ్ చేరినారు. ఈ రెండు వారములలో చైనానుగురించి పఠించిన గ్రంధములవల్లా వీరితోబాటు ప్రయాణము చేస్తూవుండిన ఆ ఇరువురు చైనాదేశీయులు చెప్పిన విషయములవల్లా యుద్ధపీడిత చైనానుగురించి వివరముగా తెలుసుకో కలిగినారు. కలిసి పక్షంరోజులు ప్రయాణం చేయడమువల్ల చైనానుగురించి తెలుసుకోవడముతో బాటు ఈ అయిదుగురు వైద్యులూ ఒకరినొకరు తెలుసుకోగలిగినారు. కలిసిమెలిసి కాలక్షేపం చేయడమూ, అలవాట్లకూ, అభిరుచులకూ అనుగుణముగా సర్దుకొని వ్యవహరించడమూ బాగా అలవరుచుకొనినారు. విభిన్న ప్రవృత్తులుగల వ్యక్తులు అయిదుగురున్నూ. డాక్టర్ అటాల్ చాలా అనుభవముగలవారు. దేశదేశాలు తిరిగినవారు. రకరకాల వ్యక్తులతో వ్యవహరించినవారు. తీవ్ర వాదాభిప్రాయాలంటె అభిమానము. తీవ్రవాదుల యెడల సానుభూతి కలవారు. నాగపూర్ వైద్య పితామహులు డాక్టర్ చొల్కర్ నిఖార్సయిన గాంధి శిష్యులు. నిష్కళంకమైన కాంగ్రెస్‌వాది. ముఖర్జీ, కొట్నీస్ మంచి ఉత్సాహంగల యువకులు. అప్పుడే చైనా భాషను నేర్చుకోవడానికి ప్రారంభంచేసినారు. అటాల్ అతిగా మాట్లాడకపోయినా అతి చమత్కారంగా సంభాషణ నడపగల ప్రతిభావంతుడు అని నలుగురూ గ్రహించినారు. యుద్ధకాలపు స్పెయిన్‌లో తన అనుభవాలను గొప్ప కధకునివలె చక్కగా నివేదిస్తూవుంటే, ముమ్ముందు తామూపొందనున్న అనుభవాల వైఖరిని, స్వభావాన్ని అప్పుడే తెలుసుకోగలిగినందుకు నలువురు వైద్యులూ ఎంతో సంతోషపడినారు. చెవులు నిక్కబెట్టుకొని ఎంతో కుతూహలముతో వింటూవుండేవారు.

హాంగ్ కాంగ్‌లో చైనా ప్రభుత్వ ఉద్యోగులూ, అచటి భారతీయులూ స్వాగత మిచ్చినారు. దళసభ్యుల గౌరవార్థము అనేక విందులను ఏర్పాటుచేసినారు. భారతీయ పత్రికా సంపాదకులును, జాతీయ సేవకులునూ అయిన అమృత లాల్ సెత్ గొప్ప విందు ఏర్పాటుచేసినారు. చైనా వాణిజ్యమండలివారు ఇచ్చిన విందుకు చైనా ఆర్థికమంత్రి టి. వి. సూంగ్, చైనా రెడ్‌క్రాస్ సంఘంనాయకులు డాక్టర్ వూ, కొద్దిరోజుల క్రితమే రణరంగమునుంచి తిరిగివచ్చిన న్యూజిలాండ్ వైద్యులూ హాజరైనారు. భారతీయ వైద్యులు ఆకాంక్షించినది అవహాయ చైనా సైనికులకు సహాయముచేయగలందులకు అవకాశములనే గాని, ఇలాంటి విందు భోజనములనూ, సన్మానములను వారు ఎన్నడూ కోరియుండలేదు. అప్పటికే చైనాలోని దారుణ పరిస్థితులు వీరికి అవగాహనమైనవి. అందువల్ల వీరికి ఈ విందులూ, స్వాగతములూ కొంచెము వెగటుగా తోచినవి. అయితే తాము తలబెట్టిన కార్యము, చేయబూనిన సేవ చైనా, భారతదేశముల ఆమోదాభిమానములను పొందినదని వీటిద్వారా ప్రకటితమగుట వారికి సంతోషకారకమైనది. ఇంతకూ ఈ గౌరవం, ఈ సన్మాన పరంపరా ఇవన్నీ ఈ ఐదుగురు వైద్యులకూ జరిగినవా? ఏ భారత జాతీయ కాంగ్రెస్ తరపున, ఏ భారతజాతీయ నాయకులు మహాత్మా గాంధీ, మౌలానా అబూల్‌కలాం ఆజాద్, రవీంద్రనాధ్ టాగూర్, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రతినిధులుగా, ఏ భారతీయ ప్రజల సౌహార్ద్ర భావముల, సానుభూతి సందేశముల నందజేయు రాయబారులుగ వెళ్ళినారో వారికే ఈ గౌరవం, ఈ స్వాగతం. వారియెడలనే ఈ అభిమానము. సన్మాన సభల్లో, గౌరవార్థము జరిగిన విందులలో చైనా—భారతదేశముల ఐక్యత గాఢ సంబంధములకే హెచ్చు ప్రాధాన్యము లభించినది. దళాధిపతి డాక్టర్ అటాల్ తమ సమాధాన ప్రసంగములలో ఈ ప్రత్యేకతను, ఈ విశేషమునె పునరుద్ఘాటన చేయుచూ వచ్చిరి. అనాది సిద్ధమైన ఉభయదేశముల మైత్రి ఉభయుల స్వాతంత్ర్య పోరాటమువలన ఎలా గాఢమైనదీ వివరించుచుండిరి.

భౌగోళికముగా నైతేనేమి, చారిత్రికముగనైతే నేమి హాంగ్‌కాంగ్ చైనా భూభాగములోనిదే అయినప్పటికినీ 1938 లో కూడా బ్రిటిష్‌వారి రక్షిత నగరముగనె వున్నది. దూరప్రాచ్యమున పాశ్చాత్య సామ్రాజ్య తత్వ విజృంభణ, విస్త

రణల కిది ప్రాచీన చిహ్నము. చైనాలో రిపబ్లిక్ స్థాపన జరుగుటవలన సామ్రాజ్య తత్వ వెల్లువకు కట్టలు పడినవేగాని పూర్తిగా తొలగిపోలేదు. ఇతరంగా అతి ప్రశాంతముగ ఉండిన హాంగ్ కాంగ్‌లోనే భారతీయ వైద్యులు చైనా సమరవాయుస్పర్శామభూతిని పొందక తప్పినదికాదు. హాంగ్‌కాంగ్‌నుండి కాంటన్‌కుపోవు రైలుమార్గము జపాను విమానముల దైనిక దాడికిగురి అవుతూనేవున్నది. శత్రువారినుండి తప్పించుకొని లక్షలాది శరణాగతులు పట్టణములోనికి మహా ప్రవాహమువలె వచ్చుచున్నారు. అప్రకటితమైన శత్రుద్వేషభావం వారందరిలోనూ ప్రస్ఫుటముగనే ఉన్నది. ఇక్కడ హాంగ్‌కాంగ్‌లో బ్రిటిష్ పతాక రక్షణక్రింద జపాన్ పంచమాంగదళము ప్రవర్థమానముగ నున్నది. దంతవైద్యులుగాను, వైద్యశాస్త్రవేత్తలుగను జపాన్ పంచమాంగదళ సభ్యులు నిరభ్యంతరముగ, నిరాఘాటముగ నగరమున సంచరించుచునే వున్నారు.

ప్రభాతకాలమున భారత వైద్యులు తమ గది కిటికీవద్ద నిలబడి వీధుల్లోకి చూస్తూవున్నారు. బాలబాలికలతోసహా అందరు సైనిక శిక్షణను పొందుతూవున్నారు. అంత చిన్న పిల్లలకూ సైనికశిక్షణ ఇవ్వడంలో ఉద్దేశ్యం ఏమిటి అని ఒక ముదుసలిని ప్రశ్నించినారు. "చైనా దీర్ఘయుద్ధానికి సిద్ధమౌతున్నది" అని వృద్ధ చైనీయుడు గంభీరముగా పలికినాడు.

సెప్టెంబరు 17 వ తేదీన వైద్యదళము కాంటన్‌కు బయలుదేరినది. ఒక నదీ నౌకలో వీరు ప్రయాణము ప్రారంభించినారు. పెరల్ నదిలో నౌక నిదానంగా సాగిపోతూవున్నది. పైన నిలబడి చైనా భూభాగాన్ని అవలోకించుచున్నారు. ఇదే చైనా రిపబ్లిక్. నది వంకర వంకరగా పాము మెలికలవలె కొండకనుమలద్వారా ప్రవహించుతూ వున్నది. శతాబ్దాలుగా శాంతిప్రియులు చైనా ప్రజలు కష్టించి, చెమట రక్తములతో సాగుచేసిన ప్రియతమప్రాంతమిది. ఈ పావన భూమినుంచి పంటలు పండించినారు. వారి వారసులకు కరుణారసభరితమైన వేదాంత తత్వమును సృష్టించినారు, మనగల నాగరికతను నిర్మించినారు. అట్టి పుణ్యభూమిని నేడు విషాదచ్ఛాయలు క్రమ్మినవి. మృత్యువు, విధ్వంసక శక్తిని వెంటబెట్టుకొని మరీ వాలినది, ఈ విదారక దృశ్యములను భారమైన హృదయముతో చూచి నిట్టూర్చి ఈ అయిదుగురు చైనామిత్రులునూ ఆకాశంమీదకి దృష్టిని మరల్చినారు.

అవిగో జపాన్ విమానములు! క్రూరపక్షులవలె కొనవూపిరిలోవున్న శరీరములపై విహరించి ఎందుచేతనో ఏమీ చేయకనే తిరిగి వెళ్ళిపోయినవి.

---

# 4. తొమ్మిది – ఒకటి – ఎనిమిది

స్వతంత్రులూ, సగర్వులూ, చైనా పురుషులు
నక్షత్ర మండలమే అంగరకా అగుగాక
నిమ్నోన్నత భూదేవిని దున్నుచు
మీ కృషి ఫలితమును పొందండి
మీ పొలముల కొరకు పోరాడండి
అందుబాటులో నున్నది స్వాతంత్ర్యం
ప్రపంచశాంతిని
మానవకోటి స్థాపించాలి.
నీలిమబ్బులూ తెల్లని సూర్యుడు
ఎర్రని పొలమూ, స్ఫటికపు తెలుపు,
ఇవేసాక్షి.

ఒకప్పుడు పరిశ్రమలకు నిలయమై విపణి వీధులతో విరాజిల్లుతూ, సిరి సంపదలతో తులతూగిన దక్షిణ చైనా రాజధానీ నగరము నేడు వికృతాకారమును బొంది ప్రళయ రుద్రుని విలాసభూమిగ మారిపోయినది. రణరంగమై రుద్ర వాటికగ పరిణామమందినది. బ్రహ్మాండమైన భవనములు బాంబులకు గురియై పూర్తిగనో, లేక కొంతభాగమో సిధిలమొంది నేలవాల లేక నిలబడి వున్నవి. గోడలు ఫిరంగి గుండుదెబ్బలు తిని, తూట్లు పడినా ధిక్కరించి అసహాయ శూరులవలె అచంచలముగ నున్నవి. పాఠశాలలు, చికిత్సాలయములు నేల మట్టమై, ఆశియా ఖండమును నవనాగరికత కాలవాలముచేయ జపాన్ ప్రారంభించిన కార్యకలాపమును స్మృతికి దెచ్చుచున్నవి. అవసర సమయాలలో ఆలో

చనలకు లోటు వుండదు. ఒకవంక నిర్మూలనా కార్యక్రమము జరుగుతూ వుండగా ఆత్మ రక్షణకు స్వయం సంపోషకత్వమునకు మార్గాన్వేషణము ప్రారంభమైనది.

విమానముల నెదిరించుటకు తగిన శతఘ్నులు లేవు. విమానదాడి రక్షణ స్థానములు అపారముగానే వున్నవి. బాంబుల ప్రేలుడును నివారించుటకుమాత్రం స్థానిక చైనీయులు మంచి పన్నాగము పన్నినారు. తమ ఇండ్లపై వెదురుబద్దలతో కప్పును ఏర్పాటు చేసుకొనినారు. బాంబులు పడినా బ్రద్దలుకావు. అందుచేతనే ఇప్పటికిన్నీ కొన్ని ఇళ్ళు ఇళ్ళరూపు కలిగి వున్నవి. ఆగ్నేయ చైనాలో యుద్ధము దేశభక్త సైనిక దళములకు ప్రతికూలముగ పరిణమించినది. ఏ క్షణములోనైనా కాంటన్‌ను ఖాళీ చేయవలసి వస్తుందనీ, అసలు శత్రుసేనలకు వదులుకోవలసి రావచ్చుననికూడా వదంతులు ప్రబలముగా వున్నవి.

భారతీయు లరుదెంచిన మరుదినము—సెప్టెంబరు 18—ముక్డన్ సంఘటన సప్తమవార్షికోత్సవము. 1931 వ సంవత్సరములో ఆనాడు జపాన్ చైనాపై దురాక్రమణ ప్రారంభించినది. చైనా—జపాన్ సంగ్రామమే అయినప్పటికినీ వాస్తవానికి రెండవ ప్రపంచ సంగ్రామమున కది అంకురార్పణ యనవచ్చును. ప్రతి సంవత్సరము స్వతంత్ర చైనా అంతటా ఈ రోజు "జాతీయ పరాభవ దినము"గ పరిగణించుతూ వుంటారు. "9—1—8" అని మాత్రమె ఈరోజును చైనావారు పిలుస్తూవుంటారు. శత్రువుపై పగసాధించవలెననే పట్టుదల ప్రజల్లో బాగా కలుగవలెననీ, శత్రు సంహారమునకు యావన్మందీ ప్రతిజ్ఞబూని పనిచేయు లాగున తయారుచేయవలెననీ ఈమాదిరి వుత్సవములను జరుపుతూ వున్నారు.

ఈ ఏడాదిన్నీ "9—1—8" ఉచితరీతినె ప్రారంభమైనది. శత్రు "విహంగముల" ఆగమనమును తెలుపు విమానదాడి హెచ్చరిక జరిగినది. తరువాత చైనాలోవుండగా భారతీయ వైద్యులు ఇలాంటి హెచ్చరికలను వందలదపాలు వినివున్నారు. కాని అప్పటికి వీరికిదే ప్రథమానుభవము. అలవడిన పిమ్మట వీరికిన్నీ అలక్ష్యభావమే ఏర్పడినది. అయితే అరోజుమాత్రము నిజముగా కొంత కలవరపడినారు. పురవీధులు మామూలుగానే వున్నవి. ప్రత్యేక సంచలనము గాని, విపరీత కలవరముగాని ఏమిన్నీ కనుపించలేదు. ప్రజలు మామూలు

ప్రకారమే. ఏమీ జరుగనట్టే తమ తమ పనులపై తిరుగుతూనే వుండినారు. కాంటన్‌పై జరిగిన విమానదాడులు లెక్కను మించినవి. తలదాకా మునిగినవారికి చలిపోయినట్టే కాంటన్ ప్రజలకును విమానదాడి అంటే భయమే పోయినది. విమానాలు వస్తూవుండగా ముందుగా గమనించి జరిగిన ఈ హెచ్చరిక ఎంతో కాలము లేదు. విమానములు పట్నంమీదకు రాలేవు. అంచేత త్వరలోనే ప్రమాదము తొలగినట్లు శంఖు ఊదినారు.

భారతీయ వైద్యులు, సైనిక వైద్యులు ఒకేమాదిరి దుస్తుల ధరించి 'నగర సంకీర్తన'కు బయలుదేరినారు. ఏదుస్తులు వేసినా తలపై గాంధి టోపీ వీరి ప్రత్యేకతను తెలుపుతూనే వున్నది. ఒక అంబులెన్సుకారులో పట్టణ సంచారము ప్రారంభించినారు. ఆ కారు పక్కలు తూట్లుపడివున్నవి. వైద్యదళమునకు సంబంధించినదను గుర్తు, ఎర్రక్రాసు, కారు నెత్తినా, ప్రక్కలనా అతి ప్రముఖంగా కనుపించినా జపాన్ వైమానికులు వదలలేదు. మంచూకొ చక్రవర్తి కాలమున కాంటన్ గవర్నరును హత్యచేయుటకు 72 మంది చైనీయులు కుట్ర బన్నినారు. జపాన్ సామ్రాజ్యశక్తికి బలి అయిన ఈ జాతీయ వీరులకు 72 శిలలు నాటి స్మారక చిహ్నములుగ నెలకొల్పినారు. భారతీయ వైద్యులు మొదట అచటికి వెళ్ళినారు. ఆశిలల చెంతనూ అచటికి దాపువవున్న 14 వ సైన్యమునకు చెందిన సైనికుల సమాధులవద్దనూ, భక్తి పురస్సరముగ భారతజాతీయ కాంగ్రెస్ తరపున కుసుమగుచ్ఛములనుంచినారు. 1932 ఆగస్టు మాసమున ఈ 14 వ సైన్యమునకు చెందిన సైనికులను జపాన్ సైనికులు వధచేసినారు.

తరువాత సన్‌యెట్‌సెన్ స్మారకభవనమును చూచిరి. ఆ భవన ప్రధాన హాలునందున్న చైనా జాతీయ విప్లవ మూలపురుషులు స్వర్గీయ డాక్టర్ సన్‌యట్‌సెన్ చిత్రపటమున గౌరవభక్తి పురస్సరముగ పుష్పములనుంచిరి. చిత్రపటము సైతము జపాన్ బాంబుల చవిజూచినది. ఒకమూల కొంచెము ముక్కవోయినది. చైనా ప్రజల హృదయమున చిత్రితమైన ఆ జాతీయ నాయకుని చిత్తరువును ఎన్ని బాంబులైననూ సిధిలముచేయలేవుగదా! అనేభావం ఆచిత్ర పటమును పరికించుతూ వుండగా కలిగింది.

తొమ్మిది—ఒకటి—ఎనిమిది వార్షిక సందర్భమున నగరవీధులలో గొప్ప



డాక్టర్ సన్‌యాట్‌సెన్

పూరేగింపులు, ఉత్సవములు జరిగినవి. వీధి వీధినా సభలు జరిగినవి. పన్నెండు సంవత్సరముల క్రితము ఆరోజున చైనాను పరాభవించుచూ జపాన్ చేసిన ఘాతుకముల గురించి యువతీ యువకులు ఉద్రేకపూరితమగు ఉపన్యాసముల చేసినారు. "శత్రువుకు తగినశాస్తి చేసేవరకూ విశ్రమింపరాదు. విశ్రమింపము" అనే ప్రతినను ప్రజలస్మృతికి దెచ్చినారు. వీధి మలుపులలో యీవీరోచిత, ఉద్రేక పూరిత ఉపన్యాసములకు చైనీయుల హర్షధ్వనులు ప్రజల స్థిరసంకల్పమునకు, అద్భుత ప్రతి ఘటనాశక్తి, కార్యదక్షతకు ప్రబల నిదిర్శనములుగ తోచినవి. ఊరేగింపు సాగుతూ ఉంది. వీధులనుంచి జనవాహిని వెల్లువలై వచ్చిచేరినది. ఊరేగింపు ముగిసేసరికి 20 లక్షల చైనీయులకుపైగా చేరినారు. ఈ జన సమూహముకంటే విశేషమైనది, వినిష్టమైనదీ పైశాచిక ప్రవృత్తిగల జపాన్ సేనల విజృంభణమును చైనా దేశభక్తి దళములు, జాతీయసేన ఎంత అద్భుతముగ, జయ ప్రదముగ ప్రతి ఘటించుచున్నారో చక్కగా తెలిపే వ్యంగ్య చిత్రములతో అలంకరింపబడిన శకటములబారులు ఉత్సవానికి శోభను, ప్రత్యేకతను ప్రసాదించినవి. సంధ్యవేళ క్రమంగా గతించిపోతూ, చీకటిఛాయలు క్రమ్ముకురాగా నలుమూలలనుంచీ కాగడాలు తీసుకొని చైనాబాలురు సిద్ధమైనారు. అమరమగు దేశభక్తికి, అచంచలమగు దీక్షకు ఆశాజ్యోతులవలె అవతరించి ఉత్సవ ప్రకాశమును అతిశయింపచేసినారు. చైనా జాతీయగీతములతోబాటు, ఇతర జాతీయ గీతికలను గానముచేసినారు. వేలాది కంఠధ్వనులు వినవచ్చినవి నిర్లక్ష్యంగా శత్రువును సవాల్‌చేస్తూ చైనా జాతికంతకూ కదనరంగమునకు పిలుపువలె విన వచ్చినది. 'చీలై! చీలై!' లేవండి! లేవండి! పరాక్రమ శూరులారా, దేశభక్తాగ్రేసరులారా లేవండి! కన్‌ఫ్యూషియన్ వంశీయులారా లేవండి! వీరుల్లారా, విద్యార్థులారా, పారిశ్రామికులారా ఒక్కుమ్మడిగ నడుములుబిగించి శత్రువును ప్రతి ఘటింపలేవండి. క్రూరశత్రువు మీ పావనజన్మభూమిని ఆక్రమించినాడు. మీ దేశము ప్రమాదమందున్నది. మీ గృహములగూల్చినాడు. పంటల మంట కలిపినాడు. మీ తల్లుల పరాభవించినాడు. మీ కుమార్తెల, మీ అక్కచెల్లెండ్ర అవమానముల పాలుచేసినాడు. లేవండి! కవులూ, కళాభిజ్ఞులూ, కదనరంగమునకు కదలండి. మీ దేశస్వాతంత్ర్యమును అపహరింప నుద్యుక్తుడై ఉన్న

శత్రువును సంహరింప సన్నద్ధులుకండి! లెండి, మేల్కొనండి; పగతురబరిమార్చి జాతీయగౌరవమును, దేశస్వాతంత్ర్యమును కాపాడండి!"

హృదయమును కదల్చివేసే అనుభవము ఇది. ఊరేగింపులు, సభలు ముగిసినతరువాతకూడా ఆ నిర్జనవీధులు ఆ జాతీయగీతముల, నినాదముల ప్రతిధ్వనించుచునే ఉన్నవి. భారతీయ ఆగంతుకులు ఈ '9-1-8' అనుభవం మరపురాని విధాన పొందినారు.

---

# 5. సన్‌యట్‌సెన్ సతి

"సూంగ్ వంశ మకుటమున ప్రకాశించు రత్నము చాంగ్ సతి. అయితే సన్ సతి తదితరములు అన్నీ, దాగిన కుసుమము; సుందరమై ప్రకాశించు పింగాణీ తునక; తాత్విక, ఆధ్యాత్మిక శక్తికి మూలము; పశ్చాద్భాగమున ప్రదీపజ్వాలగల ఛాయ."

—జాన్‌గంథర్ (ఇన్‌సైడ్ ఏషియా)

అల్పశరీరమైనా అతిలావణ్యమై, అతి సాధారణనల్లని గవునులో మహా అందముగా ఉంటుంది సన్‌యట్‌సెన్ సతి. తప్పులేని స్వచ్ఛమైన ఆంగ్లమున-కొంచెం అమెరికన్ ఉచ్చారణ ఉన్నా-చక్కగా ప్రసంగింపగలదు సుంగ్‌చింగ్-లింగ్. డాక్టర్ సనయట్‌సెన్ వితంతు వీమె. కాంటన్ రేవువద్ద నౌక లంగరు వేయగానే భారతవైద్య దళమునకు స్వాగతము ఇవ్వడానికి నౌకలోకి వచ్చినదీమె. తలవని తలంపుగా భారతవైద్యులకు సంప్రాప్తమైన ఈ అసాధారణ గౌరవము సంతోష ప్రదమైన అనుభూతి. ఆధునిక చైనాలో అసమాన ప్రాపకము గల అపూర్వవ్యక్తి ఈమె. విశ్వవిఖ్యాత సూంగ్ సోదరీత్రయములో రెండవది. చైనా ప్రధాని సతీమణి మదాంకూంగ్ కంటేచిన్నది. చాంగ్ సతి ఈమె తరువాతది. ప్రజల ప్రేమాభిమానమును, గౌరవ విశ్వాసములను చూరగొన్నది. తీవ్రవాద యువకులూ, కమ్యూనిస్టులూ ఈమె పై ప్రత్యేక అభిమానము కలిగి

ప్రవర్తించుతూ వుంటారు. ఆర్థికరాజకీయాదివిషయములలో అక్కచెల్లెండ్ర ఇరువురికంటే తీవ్రవాది. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన చాంగ్ సతి కంటేకూడా రాజకీయములలో అధిక పరిజ్ఞానము సంపాదించినది. దేశపరిపాలనమున ప్రత్యేక స్థానము కలిగిఉన్నది. క్యుమింటాంగ్ కేంద్రకార్యవర్గమున సభ్యురాలు. అనేక సంవత్సరములపాటు ఆదర్శ సంబంధమైన, వ్యక్తిగతమైన అభిప్రాయ భేదముల కారణమున, వీరినివదలి వేరే తన మార్గమును అనుసరించి పని చేయుచు వచ్చినది. తిరిగి నేడూ క్యుమింటాంగ్ వర్గముతోచేరి పనిచేయుచున్నది. తీవ్రవాద మితవాద శక్తుల, ఐక్య ప్రతి ఘటనకిది ప్రబల నిదర్శనము.

ఆమెతోబాటు పడవలోకి మదాం లియోచుంగ్‌కై. కాంటన్ కార్మికసంఘ కార్యదర్శినీ, అనేకమంది అధికార అనధికార చైనీయులూ భారతవైద్యులకు స్వాగతం ఇవ్వడానికి వచ్చినారు. అంతమందిలోనూ ఈమె ప్రత్యేకముగా కని పించుతూనే ఉన్నది. నీరసంగాఉన్నా శక్తి సామర్థ్యాలు, అసమాన ప్రతిభ ఆమె ముఖంలో ప్రకాశించుతూనే ఉన్నవి. గాఢంగా కరస్పర్శచేసేసరికి ఆమెకు 50 సంవత్సరముల వయస్సు అనిగాని, అనేక క్రాంతి కలాపములందు ఆరితేరినదని గాని భారతవైద్యులు నమ్మలేకపోయినారు. మరునాడు "9-1-8" ఉత్సవమునకు నాయకత్వమువహించి కార్యక్రమమును దిగ్విజయముగా జరుపుతూఉంటే ఆమె అజేయ చైనాకు అమరచిహ్నముగ కనిపించినది.

కాంటన్‌లో ఉన్నవారమురోజులూ వీరిని బహుమర్యాదగా, ఎంతో ఆప్యాయముగాచూచినారు. రేవువద్దనుంచి వైభవముగా వూరేగింపుచేస్తూ భారతీయులను పురమునకు తోడ్కొని పోయినారు. వీరిగౌరవార్థము అనేక విందులు ఏర్పాటు చేసినారు. సైనికోద్యోగులు రాష్ట్ర గవర్నర్‌లు, రాజ్యాంగవేత్తలు, క్యుమిం టాంగ్ ఉద్యోగులు, వైద్యులు, విద్యావేత్తలు ఈ విందులలో పాల్గొనినారు. భారత జాతీయ కాంగ్రెస్ అభివృద్ధిని ఆకాంక్షించుచూ, భారత స్వాతంత్ర్య ఉద్యమ మునకు తమ నైతికబలమును వాగ్దానముచేయుచు ప్రసంగములుచేసిరి. ఈ విందులు అన్నింటిలోకి ప్రధానమైనదీ, గుర్తుంచుకోతగినదీ కాంటన్ మేయరు ఇచ్చినవిందు. సన్ యట్ సెన్ సతి అధ్యక్షత వహించినది. భారత దేశమును గురించి, ముఖ్యంగా పండిట్ జవహర్‌లాల్ నెహ్రూనుగురించి డాక్టరు అటాల్,

మిగతా వైద్యులనూ ప్రశ్నించింది. మొట్టమొదట పండిట్ నెహ్రూను ఈమె మాస్కోలో కలుసుకొనినది. అప్పటినుంచి ఆయనపై ప్రత్యేక అభిమానం ఉంటూవుంది. భారత రాజకీయ పరిజ్ఞానమధికముగా ఉన్నట్లు అమె ప్రసంగము వల్ల ప్రకటితమైనది. భారతీయులు సాగించుతూవున్న సామ్రాజ్య ప్రతిఘటన ఉద్యమంయెడల అసందిగ్ధముగా, విస్పష్టముగా తన సానుభూతిని వెల్లడించినది. ప్రత్యేక ప్రతిభావిశేషములు, ప్రజ్ఞానుభవములుగల చైనా పడతి యీమె.

ఆమె సమయస్ఫూర్తికి, చమత్కృతికి ఆ విందులో జరిగిన ఒక సంఘటన చక్కని నిదర్శనము. చైనావారు మామూలుగా భారతీయులవలె చేతులతో విందు ఆరగించరు. ఆంగ్లేయులు స్పూన్లూ, ఫోర్కులూవాడినట్లే చైనావారు పుల్లలను వాడుదురు. చాప్‌స్టిక్స్ అంటారు ఆ పుల్లలను. భారతవైద్యులకు వాటిని ఉపయోగించడము యెలాగో తెలియలేదు. అర్థాకలితో వారు విందునుంచి విరమించుకోవలసి వస్తుందని అమె వెంటనే గ్రహించినది. బ్రిటన్‌లో విక్టోరియారాణి భారత సంస్థానాధీశ్వరుని గౌరవప్రతిష్ఠలను కాపాడినట్లే సన్ సతి భారతవైద్యుల రక్షణకు వచ్చింది. "ఆహారము నారగించుటకు భగవంతుడు మనకు చక్కని హస్తముల ప్రసాదించినాడు. వాటినే మనము ఉపయోగించుదాము" అని పుడకలను అవతలవేసి పదార్థాలను ప్రతిగ్రహించుట ప్రారంభించినది. అందరూ ఆమెను అనుసరించినారు. వికృతావస్థనుంచి తప్పించుకొని మన వైద్యులు బయటపడినారు.

సభలు, సమారాధనలూ, సప్తాహాలు....భారతీయవైద్యులకు క్షణం తీరిక చిక్కలేదు. పట్నంలోని రెండు చికిత్సాలయములనూ పరిశీలింప సంకల్పించినారు. సైనిక చికిత్సాలయము మాత్రము అన్ని హంగులూకలిగి ఆధునికముగా ఉన్నది. అవసరమగు అన్ని పరికరములూ ఉన్నవి. ఇక సన్‌యట్‌సెన్ చికిత్సాలయములో రోగులు మితిమించి ఉన్నారు. ఇందు అధికసంఖ్యాకులు విమానదాడులలో గాయపడినవారే. అవసరానికి అనుగుణ్యంగా తయారుచేసిన చైనా సామాగ్రి ఇక్కడ ప్రత్యేకముగా భారతీయులదృష్టిని ఆకర్షించినది. రోగులకు తగినట్టుగా వైద్యులులేరు. ఆసుపత్రిలో యేమూలాఖాళీలేదు. అంత మంది రోగులకు చికిత్సచేయడానికి బహుకొద్దిమంది వైద్యులుమాత్రమే ఉండినారు. ఎంతో అవస్థ పడుతున్నారు; ఎంతో ఆందోళనచెందుతూ ఉన్నారు. అందరికీ

చికిత్సచేయాలని, తక్షణం అధికంగా ఔషధములు, అదనంగా వైద్యులూ అవసరం అని భారతీయ వైద్యులు గ్రహించినారు.

"అయిదువేలమంది వైద్యులు కావాల్సిఉంటే మనం అయిదుగురము ఉన్నాము. ఎంతోమందు సామాగ్రికావాలి! మనం తెచ్చిన ఔషధములు పట్టుమని పదిమాసాలు అయినారావే" అనే బెంగపట్టుకున్నది భారతీయ వైద్యులకు. కాని యేమీ నిరుత్సాహం చెందలేదు. త్వరలోనే తామువచ్చినపనికి ఉపక్రమింప నున్నామనే భావంవారికి కొంతతృప్తి నిచ్చినది. బ్రహ్మాండమైన చైనా యుద్ధకృషికి తామూ యథోచితముగా సహాయపడగలముకదా అని తలంచి సంతసించినారు. సన్‌యట్‌సెన్ స్మారక చికిత్సాలయములోని విషాద హృదయ విదారక దృశ్యములు జపాన్ అత్యాచారములు. ఘాతుక అమానుషకృత్యములు ఎలావుంటవో తెలియచేసినవి. బాంబులకు గురియై వైద్యశాలా భవనభాగం కొంతకూలి పోయినది. అప్పుడు భూగర్భంలో గృహాలనేర్పరచి అక్కడ చికిత్సకు ఏర్పాట్లుచేసినారు. శత్రు విమానములరాకను తెలియచేస్తూ శంఖు ఊదగానే రోగులను ఆ లోపలికి తీసుకొని వెళతారు.

కాంటన్‌నుంచి బయలుదేరుటకు పూర్వమే భారతీయవైద్యులు శత్రు విమానదాడిని చవిచూచినారు. వీరిని సన్మానించుట కేర్పాటయిన ఒక బహిరంగ సభ విమానదాడి హెచ్చరికఫలితముగా సలుపుదలచేయవలసి వచ్చినది. ఆ నాడు అందరితో బాటువీరున్నూ విమానదాడి రక్షణగుహలలోకి వెళ్ళినారు. ఈ అనుభవాన్ని ఇదివరలోపొంది ఉండనందున కొంచెము కంగారు పడినమాట వాస్తవమే. పక్కనే ఉన్న చైనావారు నిబ్బరముగానూ, స్థిమితముగానూ ఉంటంచూచి కాస్త ధైర్యంతెచ్చుకొనినారు. తిరిగి బయటకువచ్చేసరికి పూర్తిగా భయముతీరింది.

ఈ విషాదఘట్టములకుతోడు వింతలు విశేషాలూకూడా లేకపోలేదు. చైనా భాషను నేర్చుకోవడానికి వీరు చేస్తున్నకృషి అంతగా ఫలించలేదు. ద్విభాషి లేకనే పట్నంలో పర్యటనము ప్రారంభించినారు. కొట్నిస్, బాసు, ముఖర్జీ— ఈ ముగ్గురున్నూకలసి ఒక చైనా హోటల్‌కు వెళ్ళినారు. వీరికి పదార్థాలను అందించవలసిఉన్న పడుచుకు ఇంగ్లీషు ఏమీరాదు. చైనా భాషను మాట్లాడడంలో ముగ్గుర్లోకీ కొట్నిస్ కొంచెంమెరుగు. అయినా చైనా భాషలో "కోడిపిల్ల"కు

ఏమంటారో అతనికి తెలియలేదు. ఆకలిమందుకుపోతూవున్నది. మార్గాంతరము లేక ఒక కాగితంమీద కోడిపిల్లబొమ్మగీసి చూపించినారు. పదార్థాలందించేపడుచు 'చాలు, ఇదా' అన్నట్లు మందహాసంచేసి గబగబా లోపలికిపోయి కాల్చినకప్పను ఒక పళ్లెములో తెచ్చినది.

సెప్టెంబరు 23 వ తేదీ తెల్లవారి ఝామున నాలుగుగంటలు అయింది. కాంటన్ పట్నం బహుప్రశాంతముగా ఉన్నది. ఏడు 'రెడ్ క్రాస్' కారులు బయలుదేరినవి. భారతీయవైద్యులు చాంగ్‌షాకు పోవాలి. వెళ్లే వెళ్లడముతో పని ప్రారంభించవలసివుంది. శత్రు విమానదాడులు ఏప్రాంతాన్నయినా ఏక్షణములో అయినా జరుగవచ్చు. ఏడుకార్లూ వెంట వెంటనే ఉండిన పక్షములో శత్రువైమానికులకు మంచిలక్ష్యం అవుతుంది. అందుచేత కారుకూ, కారుకూమధ్య అరమైలు దూరము ఉండే విధముగా ఏడుకారులూ బయలుదేరినవి.

---

# 6. చైనా తత్వము

"మార్పు ఎరుగని చైనావారు ఆఖరికి అభ్యుదయకరమైన నిర్మాణాత్మకమగు పంథాన మారుతూ ఉన్నారు గనుక ఈ యుద్ధములో గెలుపొంది తీరుతారు."

—జోవెల్ లాట్టిమూర్.

కాంటన్‌నుంచి చాంగ్షాకు 800 మైళ్లు. కొంతదూరము విశాలమైన పీఠభూములమీదుగానూ, ఆ తరువాత కొంతదూరం అనేక పర్వతాలపైకి ఎక్కి మరి కొన్ని పర్వతాలదిగి ప్రమాదకరమైన పాము మెలికల మార్గాన్ని అనుసరించి పోవాలి. ఏమాత్రం యేమరపాటుగా ఉన్నా బండి తలకిందులు కావడమే. ఆ విధముగ తలకిందులైన సామాను తీసుకుపోవు మోటారులుదారి వెంట కుప్పతిప్పలుగా పడివున్నవి. జపాన్ విమానముల విధ్వంసకచర్యల ఫలితముగ దగ్ధమైన గ్రామాలు ఇంకనూ పొగలుగక్కుతూనేవున్నవి. బాంబులకు గురియై బద్దలై

పోయిన వంతెనలు, అటవీమయమైన పర్వతాగ్రములు మధ్య మధ్య చిందులు దొక్కుతూ అతి సుందరముగ ప్రవహించుతూ ఉన్న సెలయేళ్లు, ప్రక్క ప్రక్కన వరి పొలాలు....చాంగ్షాకు వెళుతూఉన్న భారతీయవైద్యులకు కనుపించిన దృశ్యములు. నిర్విరామమైన విమానదాడులకు గురి అవుతూవున్న కాంటన్ రైలు మార్గం ఒక్కసారి ఈ రోడ్డును అనుకొని కొంతదూరమువచ్చి కొండగుహలలోకి మాయమై మరి కొంతదూరంవచ్చి ఆ తరువాత తన దారిని తాను పోతూఉంది. భారతీయవైద్యులను తీసుకు వెళుతూఉన్న ఆ ఏడుకారులూ రాత్రనక, పగలనక నడుస్తూనేవున్నవి. కళ్లల్లో వత్తులువేసుకొని ప్రమాదభరితమైన మార్గమును అతి జాగ్రత్తగా పరిశీలించుతూ, ఏ క్షణానాబండి బండికీ దూరము అరమైలుకు తగకుండాచూస్తూ ప్రయాణము చేస్తూవున్నారు.

ఈ అయిదుగురు భారతీయులతో బాటు ఒక కెనడా డాక్టరు హారిసన్, చైనా ప్రభుత్వ రవాణాశాఖ ఉద్యోగి వూ, రెడ్‌క్రాస్‌కు చెందిన చైనా వైద్యులు డాక్టర్ వాంగ్, అమెరికన్ పత్రికారచయిత్రి రుబెన్స్ కన్య ఈ ట్రక్కులలో ప్రయాణంచేస్తూవున్నారు. పీడిత చైనాకు యధాశక్తి సహాయముచేయవలెను అనే ఏకలక్ష్యము వీరినందరినీ ఒక చోటికి చేర్చినది.

సెప్టెంబరు 25 వ తేదీన వీరు చాంగ్షాచేరినారు. రాష్ట్రరాజధాని నగరం చాంగ్షా మన నాగపూర్ అంత ఉంటుంది. విస్తీర్ణములోనేగాక, ప్రాచీనతలోనూ నాగపూర్‌ను పోలిఉన్నది. వీధుల వెడల్పు చాలా తక్కువ. మన కాశీవీధులు జ్ఞాపకానికి వస్తవి. విపరీతమైన చలి. వీధులపైకూడా పందిళ్లువేసినారు, చలి బాధను తగ్గించడానికి. ఇంటిగోడలతూట్లు జపాన్ విమానములువచ్చి, విచక్షణగా ప్రతి ఇంటినీ వీక్షించి వెళ్లినట్లు ఎవరినీ అడుగవలసిన అవసరములేకనే ఆ గంతు కులకు నివేదించుచున్నవి.

వెళ్లే వెళ్లడంతోనే మన వైద్యులు పని ప్రారంభించవలసి రావడమువల్ల పట్టణములోని శిల్పవైదగ్ధ్యమును అవలోకించి ఆనందించుటకు వ్యవధే లేకపోయినది. వెనుక ఒక మాధ్యమిక పాఠశాలా భవనము ఇప్పుడు సైనిక శిక్షణ కేంద్రముగా మారిపోయినది. భారతీయ వైద్యులకు ఈ కేంద్రమును అప్పగించినారు.

స్వాగతములు, సన్మానసభలు, సంతర్పణాల కాండముగిసి అసలు కార్యక్రమమున కుపక్రమించుటతో వారికి ఎక్కడలేని ఆనందమూ కలిగినది.

చైనా 'రెడ్‌క్రాస్' సహాయకశాఖ దర్శకులు డాక్టర్ రాబర్ట్‌లిమ్ పర్యవేక్షణ కింద పని చేయవలసి ఉంది అని తెలుసుకొని భారతీయవైద్యులు ఎంతో ఉత్సాహపడినారు. సహృదయుడు, సరసుడు-వారితోకలసి పనిచేయడం అంటే చాలా సరదాగాను, ఎంతో ఖులాసాగానూ వుంటుంది. ఎడింబరో విశ్వవిద్యాలయమున ఉన్నత తరగతిలో పట్టభద్ర పరీక్షయందు ఉత్తీర్ణుడైనాడు లిమ్. యుద్ధాత్పూర్వము పిపింగ్ సంఘవైద్య కళాశాలయందు ఆచార్యుడుగా ఉండేవారు. యుద్ధకాలపు చైనాలో వైద్యసహాయక పద్ధతులనూ, సంస్థలనూ సమర్థతతో నేర్పాటుచేసినారు. ఆ పరిస్థితులలో మరొకరు ఎవరైనా, అంతటిపట్టుదల కార్యదీక్ష లేకుంటే, నిరుత్సాహముచెంది నిస్పృహకులొంగిపోయి ఏమీచేయలేక పోయేవారు. ఆయన సాధించినసాహస కార్యములు చైనాలో చరిత్రగాథలైనవి. తమ ప్రాణమును సైతము లక్ష్యముచేయక వందలకొలది చెనీయుల ప్రాణములను నాన్‌కింగ్‌ను ఖాళీచేయవలసివచ్చిన సందర్భములో, అత్యద్భుతముగ రక్షించిన విధము ఎవ్వరికైన అచ్చెరువు గొల్పకమానదు. డాక్టర్ లిన్‌యుటాంగ్ "ఎ లీఫ్ ఇన్ దిస్టారమ్" అనే నవలలో యీ అపూర్వసంఘటనను అద్భుతముగ అభివర్ణించినారు. బర్మాయుద్ధము ప్రారంభమైన రోజులలో చైనా 'ఎక్స్‌పెడిషనరీ' దళముతో 1942 సంవత్సరములో భారతదేశమునకు వచ్చినారు డాక్టర్ లిమ్.

జపాన్ యుద్ధము ప్రారంభించిన రోజులలో చైనా మొత్తంమీద 10,000 మంది రిజిస్టర్డ్ వైద్యులు ఉన్నారు. ఇందు అన్ని అర్హతలనూపొందినట్టి పూర్ణ వైద్యులు రెండువేలమంది మాత్రమే. ఈ లెక్కను ప్రతి 2,000 మంది సైనికులకూ ఒక్క వైద్యుడు వంతున ఉన్నారు. డాక్టర్ లిమ్ తన వైద్యవిద్యార్థుల నందరినీ సంఘటితపరచి వైద్యసహాయక కమీషన్‌ను ఏర్పాటుచేసినారు. ఈ కమీషను రెడ్‌క్రాస్ సంస్థకు అనుబంధముగా ఉండి పనిచేస్తూవుండేది. ఎక్కడికి అంటే అక్కడికి క్షణంముందుగా తెలిస్తే కదల్చడానికి అనుకూలముగా ఉండే ప్రత్యేక సంచారకదళములను ఏర్పరచినారు. వీరి వైద్యసహాయక కమీషన్ అయిదు అంత శ్శాఖలుగా విభాగమై ఉన్నది. మొదటిది చికిత్సాశాఖ. రెండవది

ఉపచారికశాఖ. మూడవది అంబులెన్స్‌శాఖ. నాల్గవది వ్యాధిప్రమాద నివారణశాఖ. అయిదవది ఎక్సురేశాఖ. ప్రతి ఒక్కశాఖకూ అనేక ప్రత్యేకదళాలు అంటూ ఉంటవి. చికిత్సాశాఖలో అయిదుగురు వైద్యులు కొందరు ఉపచారకులు, తదితర బృందం ఉంటూ ఉంటారు. భారతీయ వైద్యులు అయిదుగురినీ "15 వ నెంబరు చికిత్సాదళం"గా ఏర్పాటుచేసినారు. కార్యరంగంలోకి దింపడానికి పూర్వము వైద్యసహాయక కమీషన్ కార్యవిధానమును గురించి వారికి శిక్షణ ఇవ్వవలసి ఉన్నది. చికిత్సాలయముల సందర్శించి, డాక్టర్ లిమ్ ఏర్పాటుచేసిన శిక్షణ తరగతులకు హాజరుకావాలి.

సైనిక చికిత్సాలయములో పనిచేయు వైద్యుల సామర్థ్యము, వారు పొందిన చైతన్యము భారతీయవైద్యులకు బాగానచ్చినవి. వీరిలో కొందరు రోగుల అధిక సంఖ్యకు తగినట్టుగా పనిచేయుచున్నారు. 'రెడ్‌క్రాస్' శాఖకుచెంది అనేక సామానులను చేరవేసేకారులూ, రోగులను మోసే ప్రత్యేక మోటారులు చాలా ఉన్నవి. ఇందులో అధికభాగము చైనా అభిమానులు అర్పించినవే. అలాంటి వాటిపై దాతలపేర్లు స్పష్టముగా ఉన్నవి భారత జాతీయ కాంగ్రెస్ పంపినకారూ, ట్రక్కూ ఈ సమూహములో చేరినవి. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అని వాటిపై వ్రాసినారు.

కారులో చాంగ్షా వూరువెలుపలకి వెళుతూవుండగా విమానదాడి హెచ్చరిక వినవచ్చింది. అమాంతము కారువదలి కందకాల్లో దూరినారు. పరిస్థితులు ఎలా ఉన్నాయో చూచిపోదామని వచ్చిన విమానాలు గనుక బాంబులు వేయకుండానే వెళ్ళిపోయినవి. ఆ కందకములలో కూర్చునివుండగా కొత్తవాటి పక్కనే పాత కందకాలు కనిపించేసరికి వైద్యులకు కొంచెం ఆశ్చర్యం కలిగింది. పక్కనున్న వారిని ప్రశ్నించినారు. 1930 వ సంవత్సరములో జాతీయ-కమ్యూనిస్టు సేనల సంఘర్షణనాటివి అని చెప్పినారు. ఆ రోజులలో ఇచట ప్రజ్వరిల్లిన సాంఘిక విప్లవమును చైనా జాతీయప్రభుత్వము బ్రిటిష్, అమెరికన్ సహాయముతో అణచి వేసినారు. నదీ మధ్యలోవుండి బ్రిటిష్, అమెరికన్ ఫిరంగినౌకలు నగరముపై కాల్పులు సాగించినవి.

చాంగ్షాలో వీరు తిలకించినవాటి అన్నింటిలోనూ ఒక అంబులెన్సు సేవకు స్మారకార్థము ఏర్పాటుచేయబడిన బహిరంగ సభ ముఖ్యమైనది. సమరాంగణమున గాయపడి ఒక చైనా సైనికుని లేవదీస్తూ ఉండగా తుపాకీగుండు ఒకటి ఇతని శిరోభాగమున పడినది. ప్రయత్నమును మానలేదు. ప్రాణముల చిక్కబట్టుకొని ఆ గాయపడిన సైనికుని సురక్షితస్థానమునకు చేర్చి ప్రాణములవదలినాడు. ఇతనికి పదహారు, పదిహేడేళ్ళకు మించివుండవు. ఈ స్మారక సభకు హాజరైన ఆ యువకుని తండ్రి మొక్కవోని ధైర్యంతో అతి గంభీరముగా ప్రసంగించుచు "నాకు ఇంకా పదిమంది పుత్రులున్నా హృదయపూర్వకముగ, సంతోషముతో దేశమునకు అర్పించుతాను." అని చేసిన ఉపన్యాసము ఉద్దీపకముగానున్నది. ఈ తండ్రీ—తనయులందు ప్రతిఫలించిన చైనా ప్రజల తత్వము దేశపతనమును నివారించడమేగాక, అంతిమ విజయమును భద్రమొనర్చినది. ఈ తత్వమే భారతీయ వైద్యుల సందర్శింపవచ్చిన చైనా బాలబాలికలలోనూ గోచరమవుతూ ఉన్నది. పదిహేను సంవత్సరములకు లోబడినవారే వీరందరూ. భారత సద్భావ రాయబారులతో సంభాషించవలెననే కుతూహలముతో వెంట ఒక ద్విభాషిని తీసుకువచ్చినారు. వీరందరూ గ్రామ గ్రామాలకూ వెళ్ళి అరువేలమైళ్ళు పర్యటనం చేసి స్వాతంత్రోద్యమ ప్రచారముచేసి ప్రజల ప్రతిఘటనోన్ముఖులచేసి తమ జాతీయ గీతాగానముద్వారా జాతీయ తత్వమును ప్రకోపింపచేసి ప్రతిఘటన శక్తుల సంఘటితపరచినారు. ఈ బృందం నాయకుడు పద్నాలుగు సంవత్సరముల 'యువకుడు'. చైనా సైనికులకు సహాయముచేయ వైద్యదళమును పంపిన భారతీయులకు, వైద్యులకు కృతజ్ఞత తెల్పుతూ ఉపన్యసించినాడు. భారతదేశము గురించి అనేక ప్రశ్నలు అడిగినారు. తమదేశ రక్షణకు తలితండ్రులను, ఇల్లు వాకిళ్ళను వదలి తిరుగుతూ ఉన్న వీరు నవచైనా ప్రతినిధులుకారా!

---

# 7. నరక మార్గము

"యుద్ధము, ఫిరంగిగుండ్లు, టాంకులు, తుపాకులు మొదలైనవి భీతిని కలిగించుటలేదు. విమానములనుంచి వర్షించే బాంబులు, సంఘర్షణలు, ఆయుధముల తాకిడివలన కలుగు ధ్వని, అనుక్షణము ప్రత్యక్షమవుతూవుండే మృత్యుదేవత—ఇవిగూడ భయావహములుగావు. నాగరికత ప్రారంభమైన నాటినుంచీ యుద్ధములలో మానవులు సాటిమానవుల చిత్రవధ చేయడము జరుగుతూనేవున్నది. కాని, వికటాట్టహాసముచేస్తూ పసిపాపలపై కెగురవేసి వారిప్రాణముల తృణప్రాయముగ నెంచి కత్తుల కొనలను పట్టుకొని, తమ నైపుణ్యమును ప్రదర్శించుచూ సైనికులు క్రీడా వినోదములుగ పరిగణించుట మానవసృష్టి మొదలు నేటివరకూ మానవనేత్రములు చూచి ఉండలేదు. ఈ భయం అంతా మానవునిచూచే! ఒక జాతివారు సాటి జాతివారికి చేయగల ఈ పైశాచిక కృత్యముల జనితమే ఈ భీతావహము:"

—లిన్ యు టాంగ్ (ఎలీఫ్ ఇన్ ది స్టారమ్)

హాంకౌకు పోయే మార్గములో చాంగ్షా ఒక ఘట్టము మాత్రమే. యుద్ధకాలమున తాత్కాలికముగా ఏర్పాటైన చైనా రాజధాని హాంకౌ. రెడ్‌క్రాస్ రవాణాశాఖ అధిపతి విలియం వూతో సెప్టెంబరు 29 వ తేదీన (1938) భారతీయ వైద్యబృందము— "15 వ చికిత్సాదళము"—బయలుదేరినది. ఈశాన్యముగా వీరుచేసిన నాలుగువందల మైళ్ళ ప్రయాణము వాస్తవిక పరిస్థితుల దాపుకు తెచ్చినది. బల్లకట్టుమీద నదినిదాటి మధ్యాహ్నానికి చుంగ్‌మెన్ పట్టణమును చేరుకొనినారు. బాంబులకు బలిఅయిపోయిన భవనములనుండి బయలుదేరిన పొగలు దూరానికి దృగ్గోచరమైనవి. ఇంచుమించుగ ప్రతి ఇల్లూ నేలకూలినది. ఏ కొద్దిభవంతులో అలా నిలబడి కాలుతూవున్నవి. వీధిపక్కన కుప్పలుగా పడివున్న శవములు కుళ్ళిపోయి దుర్గంధ భరితమైన వాయువుల ప్రసరింపచేయుచున్నవి. గడచిన 72 గంటలూ విధీవిరామంలేక శత్రు విమానాలు దాడి జరుపుతూనే వున్నవి. వీరచటికి చేరడానికి ఒక అర్ధగంటకు పూర్వమే ప్రచండమైన దాడి జరిగినది. కనీసము 200 మంది మరణించి వుంటారు. ఒక వందమంది గాయపడివుంటారు. నగరము నిర్జనంగా లేకున్నా మామూలు జనాభా కలిగివున్నట్టు కనిపించలేదు. క్షుదార్తులైన

,పజలూ, శల్యావస్థయందున్న కుక్కలు వీధులవెంట మృత్యుచ్ఛాయలవలె తిరుగుతూ ఉన్నవి. కొందరు 'రెడ్ క్రాస్' సభ్యులు అప్పటికీ అక్కడవుండినారు. గాయపడినవారందరికీ చికిత్సచేయ శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. చేయవలసిన పని ఎంతోవుంది. చేసేవారు ఎందరో లేరు. చైనాలో ఇలాంటి పట్టణములు కనీసము ఒక వంద అయినా వుంటవి. చుంగ్‌యన్ విషాదావస్థే చైనా విషాదావస్థకు చిహ్నము.

సెప్టెంబరు మాసం ముగుస్తోంది. యుద్ధ గమనము దేశభక్త దళములకు ఏమీ అనుకూలముగా లేకపోగా ప్రతికూలముగా పరిణమించినది. జపాన్ సాయుధ దళములు కోస్తా నగరముల నాక్రమించి లోపలి భాగమును చెరుచుచున్నవి. కట్టువడని వారిపురోగమనము ఆందోళనకరముగా ఉన్నది. హాంకాం—కాంటన్ పట్టణముల ముట్టడి ప్రారంభమైనది. రవాణా ఏర్పాటులు మామూలుగానే అసంతృప్తికరముగా ఉన్నవి. అందుకు తగ్గట్టు కాంటన్—చాంగ్షా—హాంకాం రైలుమార్గాన్ని నిరంతరము బాంబుచేస్తూ రవాణాసమస్యను మరింత క్లిష్ట మొనర్చినారు. ఈ రంగములో ఏ పట్టణంగానీ చాంగ్‌యెన్‌కు ఏమీ తీసిపోదు. అపారమైన యంత్ర పరికరములతో జపాన్ సైనికరథం యథేచ్ఛగా యాంగ్‌ట్సీ ప్రక్కగా జైత్రయాత్ర సాగించుతూ వున్నది. చైనా సేనలు అనేకప్రాంతములలో అపార నష్టమునుపొంది వెనక్కు మరలవలసి వచ్చింది.

వైద్యబృందం శకటమునకు సారథ్యంవహించిన చైనా వాని ఏమరపాటువల్ల అందరూ దారితప్పినారు. ఇంచుమించు రణరంగము దాపునకు వెళ్ళినారు. అందువల్లనే చైనా సేనల ఉపసంహార కార్యక్రమ విషాదమును కళ్ళారా చూడకలిగినారు. ఈ దారి యమలోకమునకు రాజమార్గమువలె ఉన్నది. రోడ్డువెంట దెబ్బలు తినిన, అంగవిహీనులైన సైనికులు ప్రవాహముగా వస్తున్నారు. శరీరములు మట్టికొట్టుకొని వున్నవి. అందరూ అలసిపోయినారు. అనేకులు రక్తక్షీణతవల్ల పాలిపోయి వున్నారు. ఎందరికో, ఎన్నో రోజులుగా తిండిలేదు. దారి పక్కనవున్న పోలాలలోని కంకులను కోసుకు తింటానికి ప్రయత్నిస్తున్నారు. గాయములనుంచి ప్రవహించే రక్తాన్ని ఆపడానికి తమసైనిక దుస్తులను చించి కట్టు కట్టుకొనినారు. అడుగుతీసి అడుగువేయడానికి అసక్తులుగావున్న వారు ఎందరో వైద్యబృందా

నికి కనుపించినారు. మరణము తప్ప మార్గాంతరములేదు. క్షుద్బాధ కొందరిని ఉన్మాదుల చేసినది. భారతీయ వైద్యబృందంవున్న ట్రక్కు కనుపించేసరికి తుపాకులు చూపి బండి ఆపి అన్నం కావాలని అడిగారు. తీరా ఆపి, లోపల ఎవరు ఉందీ తెలుసుకునేసరికి తలవంపులైనవి. తమ ప్రవర్తనకు సిగ్గుపడి క్షమాపణ వేడుకొనినారు. అప్రయత్నముగ కళ్ళవెంట నీరు కారినది. ఇట్టి విషాదదృశ్యమును భారతీయులు ఇంతకుముం దెన్నడూ చూడలేదు. ఇకముందు చూడబోరు. బండి ముందుకు సాగినది. బాంబు ప్రేలుడు ఫలితముగా ముక్కలు చెక్కలైన మానవ శరీరములు కనిపించినవి. తరువాత తరువాత జపాన్ సైనికుల అమానుష చర్యల ఫలితములను అనేకముగా చూచినారు. దారుణసంఘర్షణలు, అతి సాహసమైన గొరిల్లా ప్రతిఘటన, రణరంగమున కివతల అర్ధమైలు దూరములో సైనికుల గాయములనుండి బయలుదేరిన రక్త ప్రవాహము—ఇలాంటి అనుభవములు భారతీయ వైద్యులకు అసంఖ్యాకముగ కలిగినవి. అయినా ఈనాడు వారిక్కడ చూచిన విషాద దృశ్యం వారి మనోవీధినుండి ఎన్నటికినీ అదృశ్యముగాదు.

ఎలాంటి దీక్షవున్నా, ఎంత సత్సంకల్పమైనా ఈ పరిస్థితులలో చేయకలిగింది ఏమీలేదు. అయినా అడుగడుక్కూ ఆగి గాయపడినవారికి ఏదో చికిత్స చేస్తూనే వచ్చారు. ఔషధములు దగ్గరలేవు. సాధన సామగ్రి అంతా మరో బండిలో వుండిపోయినది. వున్నంతలో ఏదో చేస్తూవున్నారు. మరికొంచెంముందుకు వెళ్ళేసరికి మరఫిరంగుల మార్మోతలు వినవచ్చినవి. అంతవరకూ తప్పుదారిని అనుసరించి ప్రయాణముచేస్తూ వున్నట్టు తెలియనేలేదు. గాఢాంధకారమున గంటల తరబడి ప్రయాణము చేసినారు. సైనిక శకటములు ఊపిరి తిరక్కుండా కిందకీ పైకీ తిరుగుతూనే వున్నవి. సమరభూమిని సమీపించినారు. అడ్డువచ్చిన వాగు దాటి అవతలిఒడ్డు చేరినారు. ధూమశకటములధ్వని వినవచ్చినది. ఆ సమీపములోనే బ్రహ్మాండమైన సైనిక సంచలనం ఉన్నట్టు గ్రహించినారు. ఆ చీకటిలో తమ మోటారు ఏదో తెలుసుకొనగోరి చేతవున్న 'టార్చిలైటును' ప్రయోగించగా, అంతవరకూ అపరబుద్ధునివలె అతి శాంతముగావున్న దళనాయకుడు చర్రుమన్నాడు. అతి ఆగ్రహంగా "వోయ్ మందబుద్ధీ! ఆ దీపం మూసివేస్తావా లేదా?" అని కేకవేసినాడు. శత్రు సేనలకు చాలా సమీపములోవున్నట్టు అప్పుడు

అందరూ గ్రహించినారు. బాను అవ్యక్తంవల్ల ఆ క్షణంలో వేలకొద్దీ చైనీయులు శత్రు ఫిరంగులకు ఆహుతి కావలసింది.

రాత్రి 10-30 గంటలకు మొదటిబండి వూచంగ్ చేరినది. యాంగ్‌ట్సీకి యాంగ్ నదిని దాటి హాంకౌ వెళ్ళినారు. హాంకౌ ఆధునిక నగరహంగులు కలిగి ఉన్నది. మంచి వసతి గృహములు, విశ్రాంతి భవనములు, రకరకాల వస్తుసము దాయములతో కళకళలాడే దుకాణములువున్నవి. దారివెంట చూచిన విషాదదృశ్య ములకూ ఇచటి విలాసదృశ్యములకూ, వేడికలకూ ఎక్కడా పోలికేలేదు. వీధులు క్రిక్కిరిసి వున్నవి. పట్టణ ముట్టడి జరుగుతూవుందనిగానీ, అనతికాలములో ఆ నగరమును ఖాళీచేయవలసివస్తుందనిగానీ ఎవ్వరూ అనుకుంటూ వునట్టే లేదు. ఎవర్ని చూడబోయినా "పట్టణాన్ని ఖాళీ చేయవలసివస్తే" అనిగాక "పట్టణమును ఖాళీచేయువేళ" అనే ప్రసంగించుతూవున్నట్టు కనిపిస్తుంది. అలాంటి అసాధారణ సందిగ్ధపరిస్థితులలో నగరం అతిమామూలుగానేవున్నది. నాలుగుపక్కలా పరికించి చూస్తే యుద్ధ సామీప్యచిహ్నములు గోచరించకపోవడంలేదు. అనేక భవనములు శిధిలమైనవి. మరికొన్ని అనేక దెబ్బలు తిన్నా శత్రువును ధిక్కరిస్తూ ధీమాగా నిలబడి వున్నవి. అధికారులు, విద్యార్థులు, వ్యాపారులు ఖరీదైన, నాణ్యమైన దుస్తులను ధరించి వీధులలో తిరుగుతూవున్నారు. పక్కపక్కనే గుడ్డ ముక్క లతో మానాన్ని సంరక్షించుకొని అంటుకుపోయిన డొక్కలతో దేహయాత్ర సాగిస్తూవున్న బీదప్రజలు అసంఖ్యాకముగావున్నారు. వందలమైళ్ళు నడిచి ఇక్కడకు చేరుకొన్నారు. గ్రామాలను, పొలాలను, ఇళ్ళను, తమ సర్వస్వమునూ వదలి ప్రాణాలను రక్షించుకొనడానికి, శత్రువశమైన కోస్తా పట్టణములవదలి దేశ మధ్యకు చేరినారు. ఇలాంటి సంఘటనలు చరిత్రలో ఉండబోవు. వీరందరూ ఆ యమలోక యాత్రామార్గమును చూచివచ్చినవారే ఆ నిస్సహాయత, నిస్పృహ వారి వదనములలో కనుపించుతూనే వున్నవి

హాంకౌలో కనుపించిన మందహాసముల మరుగునవున్న విషాద అవస్థ భారతీయ వైద్యులకు అచటి "64 వ బేస్" ఆసుపత్రిలో బాగా తెలియవచ్చినది. యుద్ధమునకు పూర్వం, పట్టణము జపాన్ అధీనములోవుండగా జపాన్‌వైద్యులు ఏర్పాటుచేసిన చికిత్సాలయము ఇది. 200 రోగులకుగాను ఏర్పాటు అయిన

ఈ చికిత్సాలయములో ఇప్పుడు 1500 మందికి ఏర్పాటుచేసినారు. మంచములు లేవు. పక్కలు అంతకుముందే లేవు. గడ్డిచాపలు పరచి రోగుల నందరినీ పరుండబెట్టినారు. పట్టణము మరోమూలనేవున్న వైద్యశాలలోనూ పరిస్థితులు ఇదే విధముగా ఉన్నవి. 2500 మంది రోగులు ఉన్నారు ఇక్కడ వైద్యులు తగినంత మంది లేరు. ఔషధములూ అంతంతమాత్రముగనే వున్నవి. కష్టకాలమున అత్యవసరముగావున్న సమయములో ఔషధములతో వచ్చిన భారతీయవైద్యులకు అందరూ కృతజ్ఞత తెలిపినారు. అక్టోబరు మొదటితేదీన పని ప్రారంభించినారు. రెండు ముఠాలుగా చీలి రెండు ఆసుపత్రులలోనూ పనిచేస్తూవచ్చినారు. కొట్నిస్ ముఖర్జీలు ఒకచోటా, చోల్కర్, బాసు మరోచోటా పనిచేస్తూవుంటే డాక్టర్ అటాల్ అవసరమునుబట్టి అక్కడా, ఇక్కడాకూడా పనిచేస్తూ వున్నారు.



5 గురు డాక్టర్లు

హాంకౌలో చైనా వైద్యులతోనూ, జావానుంచి వచ్చిన ఉపచారకులతోనూ కలసి సూర్యోదయాది సూర్యాస్తమయమువరకూపనిచేస్తూనే వున్నారు. వ్యాధులు ముదిరి ప్రమాదకరంగా పరిణమించినవి. ఇలాంటి వైపరీత్యమును విషమస్థితిని వీరిలో ఎవ్వరూ ఇంతకుపూర్వము ఎన్నడూ చూచివుండలేదు. కాళ్ళూ, చేతులూ పోయినవారు, ముఖములు దొక్కుపోయినవారు, ఊపిరితిత్తులలోనూ పొత్తికడుపుల్లోనూ బాంబు ముక్కలు ఇరుక్కుపోయినవారు ఎందరో ఉన్నారు. ఎంతో ఓర్పుతో మౌనంగా ఇంత బాధనూ అనుభవించుతూ వున్నారు. ఫలప్రదముగా చికిత్స జరిపినా, తాత్కాలికోపశమనము కలిగించినా ఎంతో కృతజ్ఞతను ప్రకటించేవారు.

వీరు హాంకౌలో వున్నరోజులలో శత్రువిమానములు ఎన్నో దాడులు జరిపి

వవి. అప్పటికే బాగా అలవాటుపడినందున వీరున్నూ తోటి చైనావారివలెనే ధైర్యము మును చిక్కబట్టి ఎంతటి ప్రమాదమునైనా తాత్వికదృష్టితో తిలకింపగతూ వచ్చినారు. రణరంగమునుంచి వచ్చువార్తలు అతి అసంతృప్తికరముగా వుంటూవచ్చినవి. జపాన్ సేనావాహినులు రాజధానిమీదకు పట్టుదలతో నెట్టుకువస్తున్నవి. భారతీయ బృందములోని యువక వైద్యులు సమరభూమికిపోయి యుద్ధమును గమనింప సంకల్పించినారు అప్పటికే కొందరు అమెరికా, చైనా పత్రికారచయితలను రణరంగానికి తీసుకొనిపోవుటకు ఏర్పాట్లు జరిగినవి. వారితోబాటు భారతీయ వైద్యులనూ పంపడానికి నిర్ణయం జరిగింది. వీరు బయలుదేరడానికిముందే వర్తమానం పత్రికల కెక్కింది. అంతటితో అన్ని ఏర్పాటులనూ విరమించినారు. అటు పత్రికా రచయితలకూ, ఇటు వైద్యులకూ తీరని ఆశాభంగము కలిగినది. కాని చైనా వృద్ధుడొకడు గొప్పతత్వజ్ఞునివలె, మంచి అనుభవశాలివలె వీరిని ఓదారుస్తూ "కలతచెంద నవసరములేదు. విచారింపకుడు. మీరు రణరంగమునకు వెళ్ళలేకపోతే రణరంగమే మీ చెంతకు వస్తుంది" అని అతి గంభీరముగాపలికినాడు.

వాస్తవానికి అతడన్న మాటలో వ్యంగ్యంగాని, అతిశయోక్తిగాని ఏమీలేదు. కదనరంగము క్రమముగా వీరిపైపుకే వస్తూవున్నది. ఇందుకు హాంకౌలోని జీవిత విధానము ఏవిధముగానూ నిదర్శనముకాదు. ప్రజల ప్రవర్తనలో మార్పేమీ కనుపించలేదు. 'పంటల పండుగను' యధావిధిగానే జరిపినారు. రెండురోజులతరువాత "రెండు పదులు" రోజు వచ్చింది. రెండు పదులు అంటే 10 వ నెల పదవరోజు అని—అక్టోబరు 10. చైనా అంతటా జాతీయ విప్లవదినముగా పరిగణించుతారు. 1911 అక్టోబరు 10 వ తేదీన మంచూవంశం పతనమందినప్పటినుంచీ ఏటా "అక్టోబరు పది" జరుపుతూనే వున్నారు. అందరికీ సెలవురోజుగా వున్నది. చైనా జాతీయ పతాకలు వీధులను, భవనములను అలంకరించినవి, జాతీయ గీత ప్రతిధ్వని వినవస్తూవుంది. ముఖములు వికసించి ఆత్మవిశ్వాసమును ప్రకటించుచున్నవి. మార్షల్ చాంగ్ కై షేక్ సైనిక సమీక్ష చేస్తూవుండగా వేలసంఖ్యగా వచ్చినారు పౌరులు. యుద్ధభూమినుంచీ ఆశావంతమగు వర్తమానము వచ్చినది. కియాంగ్సీ ప్రాంగణములో చైనా జాతీయసేనలు రెండు శత్రుదళములను పూడ్చివేసినవి.

'పట్టణమును ఖాళీ చేయవలసిందే' అనే నిర్ణయం అలాగే వున్నది. "87 వ అనుపత్రి"ని పశ్చిమముగా ఇచియాంగ్‌కు మార్చినారు. రోజులు గడచినకొద్దీ జపాన్ సేనలు నగరాన్ని సమీపించుతూ ఉన్నట్టు వార్తలు వస్తున్నవి. ఒక్క క్షణం వ్యవధిలో పట్టణమును ఖాళీచేసి వేయడానికి సిద్ధముగా వుండవలసిందిగా చాంగ్షానుంచి వైద్యులకు టెలిఫోను వర్తమానము వచ్చినది. మూటా ముల్లే సర్దు కుంటూ వున్నారు. ఇంతలో విమానదాడి హెచ్చరిక జరిగింది. శత్రువిమానముల ప్రతిఘటించుటకు రష్యన్ ఫైటరు విమానములు ఆకాశమున కెగసినవి. వీటిని అక్కడి ప్రజలు 'సోవియట్ తేనెటీగలు" అని పిలుస్తారు. విమానదాడి హెచ్చరిక జరిగినా అనేకమంది ఈ విమానయుద్ధమును చూచేందుకు వీధుల్లోకి వచ్చినారు. సోవియట్ వైమానికుల ధైర్యసాహసములలో, శక్తిసామర్థ్యములలో అచటి ప్రజలుకు మంచి నమ్మకమువుంది. ఇదివరలో వీరు ఎన్నో జపాన్ విమానముల కూల్చినారు. ఇప్పుడున్నూ శత్రువిమానముల జయప్రదముగా ఎదుర్కొని తరిమివచ్చినారు. అంతలో తిరిగి ప్రశాంతత ఏర్పడినది. ఇతర దేశములు అన్నింటికన్నా చైనాకు సోవియట్ రష్యా ఏవిధముగా సహాయముచేస్తూవున్నదీ ఈ ఉదంతము ప్రకటించినది,

అక్టోబరు 14 నాటికి అందరూ అన్నీ సర్దుకొని ప్రయాణానికి సిద్ధమైనారు. ప్రజలు అప్పుడే ఖాళీచేయడం ప్రారంభించినారు. డాక్టరులు బయలుదేరవలసిన పడవ నిర్ణయమైన రోజున బయలుదేరలేదు. తాత్కాలికముగా వీరి ప్రయాణము వాయిదా పడినది. ఈ వ్యవధిలో వీరిని వైద్యశిక్షణకు వచ్చిన విద్యార్థులను పరీక్షింపమనినారు. రెండురోజులలో ఈ పని పూర్తి అయినది. ఈ రెండురోజుల లోనూ శత్రువిమానములు అనేక పర్యాయములువచ్చినవి. విమాన విధ్వంసక శతఘ్నులు ప్రేలినధ్వని చెవులలో గింగురుమంటూ వున్నది.

17 వ తేదీన యాంగ్‌ట్సీకి యాంగ్ నదిలో ప్రయాణము ప్రారంభించినారు. విచార హృదయములతో హాంకౌవైపు చూస్తూ పడవ పై భాగమున అలా నిలబడి పోయినారు. యుద్ధకాలపు చైనా రూపురేఖలనేగాక మనస్సు హృదయమును అవగతము చేసుకోడానికీ, అన్నింటిపీ మించి చైనాతత్వమును గ్రహించడానికి భారతీయ వైద్యబృందానికి హాంకౌ ఒక గొప్ప అవకాశమును కలిగించినది.

పతనము తప్పని ప్రధాన పట్టణము హాంకౌ! ఇక్కడే భారతీయ వైద్యులు చైనా-సోవియట్ సైన్యమునకు చెందిన ఉన్నత ఉద్యోగులను కలుసుకొనినారు. కొరియా క్రాంతికారులను, తీవ్రవాదులను, ఫాసిస్టు ప్రతికూల జపానీయులనూ కలుసుకో డానికిన్నీ వీలు చిక్కినది. ఈ సంయోగములవలన హాంకౌ మకాము భారతీయ వైద్యబృందమునకు మరువరానిదిగా పరిణమించినది. ఈ విశేషములను వివరించాలీ అంటే రెండడుగులు వెనక్కు వేయవలసి వుంటుంది.

---

# 8. భారతీయ స్వాతంత్ర్యము

ముందుకు, సోదరా, ముందుకు! ఈ దానిసత్వ శాపమును
అంత మొనర్చెదము
అగ్నిజ్వాల నెదుర్కొని, మానవకోటి స్వాతంత్ర్యం
కొరకు మరణిద్దాము
విజయగీతమును చైనా భారత దేశములు
ఏకముగా గానము చేయును
ప్రపంచమంతా ప్రతిష్ఠింతుము నూతన
స్వాతంత్ర్య పతాకమునూ.

—సాఘర్ నిజామీ.

"కామ్రేడ్స్! భారత స్వాతంత్ర్యము సిద్ధించుగాక యని ఈ విందును ఉపక్రమించుచున్నాను."

భారత వైద్యబృందము గౌరవార్థ మేర్పాటుచేయబడిన విందులలో అపూర్వమైన ఒక విందు ఈ విధముగా ప్రారంభమైనది. హాంకౌ చేరిన మూడవరోజున అచటి "ఎయిత్ రూట్ ఆర్మీ"—మొదట ఈ సైన్యమునే 'చైనా రెడ్ ఆర్మీ' అనేవారు. క్యుమింటాంగ్—కమ్యూనిస్టు సమాధానము కుదిరిన తరువాత

ఈవిధముగా పేరు మార్చినారు—కార్యాలయములో ఈ విందు జరిగినది. సైనిక ఉద్యోగులూ, కమ్యూనిస్టుపార్టీ అధికారులూ, "న్యూ చైనా ' డెయిలీ" పత్రిక సంపాదకుడూ, ఒక రష్యన్ విలేఖరి, ఒక అమెరికా పత్రికా రచయిత్రి, ఒక నాజీవ్యతిరేక జర్మన్ స్త్రీ, భారతీయ వైద్యులు అయిదుగురూ ఈ విందులో పాల్గొనినారు.

భారత స్వాతంత్ర్యము, చైనా ఐక్యత, "ఎయిత్‌రూట్ ఆర్మీ" రష్యా మొదలైన విషయముల ప్రస్తావించుచు పానీయముల గ్రోలినారు. వివిధ జాతీయ గీతముల గానము చేసినారు. చైనా జాతీయగీతము "చీలై", రష్యా వైమానికదళ గీతము, భారతజాతీయ గీతము "వందే మాతరం", "చలే, చలే" వరుసగా పాడినారు. పాటల విషయములో చైనా కమ్యూనిస్టులకు ప్రత్యేక పట్టుదలవుంది. విందుకు హాజరైనవారందరికీ వీరి ఉత్సాహము అంటువ్యాధిలాగా పాకినది. అఖరికి డాక్టర్ చోల్కర్‌కూడా పల్లవి అందుకున్నారు. హాంకౌలోని ఆ కొయ్యభవనము "ఆరు భాషల" స్వాతంత్ర్య గీతములతో ప్రతిధ్వనించి పోయినది.

పాటలు పూర్తికాగానే ప్రసంగములు ప్రారంభమైనవి. చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రచారకశాఖపెద్ద మాతృభాషలో ప్రసంగించినారు. పార్టీ అంతర్జాతీయ ప్రచారక శాఖపెద్ద ప్రసంగమును జర్మనీ భాషలోకి తర్జుమాచేయగా, అమెరికన్ రచయిత్రి అగ్నెస్ స్మెడ్లీ ఆంగ్లంలోకి తర్జుమా చేసినది.

"జపాన్ సామ్రాజ్యతత్వముపై చైనా సాగించుచున్న ఈ యుద్ధము ఒక్క చైనా కొరకేకాదు. ప్రపంచమునందలి పరాధీన ప్రజలు అందరి తరఫునా అందరి స్వాతంత్ర్యముకొరకూ యుద్ధముచేస్తూవున్నది" అని కై ఫెంగ్ అనేసరికి హర్ష ధ్వనులు మిన్ను ముట్టినవి. "చైనా ప్రజలకు, చైనా సైనికులకూ సహాయం చేయడానికి ఈ వైద్యబృందమును పంపుటద్వారా ప్రకటితమైన భారతీయుల సానుభూతి సుహృద్భావములను చైనా ఎన్నటికీ మరువదు. భారతదేశమునకు అవసరము కలిగినప్పుడు, భారతీయులకు వారి స్వాతంత్ర్య పోరాటములో మా సహాయము అవసరమైనప్పుడు, చైనా ఈ ఋణము తీర్చుకుంటుంది." అని ఫెంగ్ విస్పష్టముగా ప్రకటించినారు.

"ఎయిత్ రూట్ ఆర్మీ" సైనికోద్యోగుల ప్రధాని జనరల్ యె చీన్—

యింగ్ వింయుకు అధ్యక్షత వహించినారు. రెడ్ (కమ్యూనిస్టు) చైనా సేనానాయకులలో యీయన ప్రముఖులు. మంచి ఆరోగ్యం; చాలా ఖులాసాగా వుంటారు. వలభై సంవత్సరముల వయస్సు. ఎయిత్ రూట్ ఆర్మీ తరఫున, కాంగ్రెస్‌కూ, కాంగ్రెస్ నాయకులకూ కృతజ్ఞత తెలుపుతూ, భారత వైద్యదళమునకు స్వాగత మిచ్చినారు. చైనా ప్రజల ఐక్య ప్రతిఘటన ఫలితముగా జపాన్ సేనల పురోగమనం సంవత్సరముల పర్యంతం ఎలా ఆగిపోయినదీ వివరించి చెప్పినారు.


డాక్టర్ అటాల్

సమాధానమివ్వ డాక్టర్ అటాల్ నిలబడేసరికి హిందుస్తానీ భాషలో మాట్లాడమని కోరినారు. డాక్టర్ చోల్కార్ ఆంగ్లంలోకి తర్జుమా చేయగా, విందుకు వచ్చిన పత్రికా విలేఖరులలో ఒకరు చైనా భాషలోకి తర్జుమా చేసినారు.

హాంకౌలో వున్నరోజులలో 'ఎయిత్ రూట్ ఆర్మీ' ఉద్యోగులనూ, చైనా కమ్యూనిస్టునాయకులను కలుసుకోడానికి అనేక అవకాశములు లభించినవి. చైనాకు బయలుదేరుటకు పూర్వమే వీరినిగురించి చాలా విషయములను తెలుసుకొనినారు. ఎడ్గార్‌స్నో రచించిన 'రెడ్‌స్టార్ ఓవర్ చైనా' గ్రంథపఠనముద్వారా ఇంకా ఎక్కువ విశేషములను తెలుసుకొనినారు. పదిసంవత్సరములపాటు చైనా

కేంద్రప్రభుత్వము వీరిని అణచివేయడానికి చేసిన ప్రయత్నములను అన్నింటిని వీరు జయప్రదముగ ప్రతిఘటించినారు. అనేకవేల మైళ్ళు నడిచి పశ్చిమోత్తర రాష్ట్రము షాన్సీని చేరినారు, అక్కడ కమ్యూనిస్టు ప్రభుత్వమును ప్రతిష్ఠించినారు. కేంద్రప్రభుత్వ చర్యలు వీరికి అనేక బాధలు కలిగించినా ఈనాడు జపాన్‌ను ఎదిరించడానికిగాను ప్రారంభించిన 'ఐక్య చైనా' ఉద్యమమునకు వీరే ఆదిపురుషులు. కమ్యూనిజం అంటే అయిదుగురు వైద్యులకూ అయిదు రకాల అభిప్రాయాలు వున్నవి. అయినా చైనా కమ్యూనిస్టుల కార్యకలాపమూ, వీరిసైన్యము సాధించిన ఫలితములూ తెలుసుకోవలెననే ఉత్సాహము, కుతూహలమూ అందరికీ సమానముగానే వున్నవి. ఎయిత్‌రూట్ ఆర్మీతో కలసి పనిచేసేందుకు అవకాశములగురించి అప్పుడే ఆలోచించుతూ వున్నారు. విందు పూర్తి అయినతరువాత రాత్రి భోజనానికికూడా రావలసిందని ఎయిత్‌రూట్ ఆర్మీ ఉద్యోగి ఆహ్వానించినారు. ఈ భోజనము పూర్తిగా ప్రజాస్వామ్య పద్ధతులను అనుసరించి జరుగుతుంది. అధికారులూ, అనధికారులూ, తదితరులూ అందరూ కలసి సహపంక్తి భోజనము చేస్తారు. దీనిని 'ఎనిమిది సెంట్స్' భోజనం అంటారు. సెంట్ మన అర్ధణా విలువగా వుంటుంది. ఎయిత్‌రూట్ ఆర్మీకి చెందిన సైనికులు అందరూ బాగా ఆరోగ్యవంతులుగా వున్నారు. మంచి ప్రతిభావంతులనికూడా చెప్పవచ్చును. అందరూ చైనా రైతుకుటుంబములనుండి వచ్చినవారే. విశేషం ఏమీలేకపోయినా పదార్థాలు అన్నీ చాలా రుచికరంగాను పుష్టికరంగానూ ఉన్నాయి. భోజనాలు పూర్తి అయినతరువాత మళ్ళీ పాటలు, ప్రసంగములు జోరుగా సాగినవి.

హాంకౌలో వీరు కలుసుకొనిన ముఖ్య కమ్యూనిస్టు నాయకుడు జనరల్ చు ఎన్ లీ. ఆరితేరిన క్రాంతికారుడు. చైనాలోని ప్రముఖ కమ్యూనిస్టు నాయకత్రయమునకు చెందినవాడు. ఇతన్ని పట్టియిస్తే 80,000 డాలర్ల బహూమతి ఇస్తాము అని ఒకప్పుడు చైనా కేంద్ర ప్రభుత్వము ప్రకటించినది. ఇప్పుడితడు అదే కేంద్ర ప్రభుత్వములో రాజకీయ కోఆర్డినేషన్ శాఖకు ఉప డైరెక్టరుగా పనిచేస్తూ వున్నారు. ఐక్య ప్రతిఘటన సంతృప్తికరముగా జరుగగలందులకు వీరు ఇటు కమ్యూనిస్టుపార్టీకి అటు జాతీయ ప్రభుత్వమునకూ లైసాన్ ఉద్యోగిగాకూడా వ్యవహరించుతూ వుంటారు. ఇతన్ని కలుసుకోడానికి పూర్వమే ఈయననుగురించి



ఛుయిన్‌లి

'రెడ్‌స్టార్ ఓవర్ చైనా' గ్రంథములో భారతీయవైద్యులు చదివినారు. ఈ గ్రంథములో ఎడ్గార్‌స్నో ఈయననుగురించి ఇలా వ్రాసినారు—

"సునిశితమైన శరీరము అంత పొట్టికాదు; అంత పొడుగూ కాదు. చూపులకు కుర్రతనంగా వుంటారు—అంతటి నిడుపైన గడ్డము అతి విశాలమైన నేత్రద్వయం ఉండికూడా అదో విధమైన బిడియమూ, ప్రత్యేకమైన సౌజన్యము, అన్నింటినీ మించిన ఆత్మబలము....వీటన్నింటి కలయికవల్లా అతనిలో ఒక గొప్ప ఆకర్షణశక్తి ఇమిడివున్నది. అతడొక అపూర్వ, అసాధారణవ్యక్తి. ప్రతిభావంతుడు. విషయ పరిజ్ఞానముగల ప్రజ్ఞాశాలి. అతని మాటలకు, విశ్వాసములకూ, పరిజ్ఞానమునకూ అతని పనులు సరితూగివుంటవి. క్రాంతికారుడుగా మారిన గొప్ప పండితుడు."

ఇతన్నిగురించి భారతీయవైద్యులలో ఒకరి డైరీలో ఇలా వ్రాసివుంది— "అమిత అసహనం. మంచి చావగలమనిషి. విజ్ఞానవంతునివలె కనిపించుతాడు. తెలివితేటలుగలవాడని తెలిపే నేత్రద్వయం చైనాలో ఎవ్వరికీ ఉండనట్టి మందపాటి కనుబొమలు"

తీరుబడిలేని అమెరికన్ ప్రభుత్వోద్యోగిని ఆవరించిన వాతావరణము ఈయన గదిలో కనుపించింది. టెలిఫోన్లు మోగుతూ వుంటవి. టెలిగ్రాములువచ్చి బల్లమీద కుప్పలుగా పడుతూవుంటవి. కాగితాలు, పుస్తకాలూ, ఫైల్సూ, పటాలు బల్లనిండుగా వున్నవి. 1936 లోని ఈయన కార్యాలయానికీ ఇప్పటి కార్యాలయా

నికి పోలికే లేదు. మట్టిగోడల గుడిసె ...పాత సామాగ్రి ఆనాటి కార్యాలయం. మనిషి వేషభాషలలో అతి మామూలుగానే వుంటారు. ఇతర సైనికుల దుస్తులకూ ఇతని దుస్తులకూ ఆటే వ్యత్యాసం ఉన్నట్లు కనుపించదు. ఆయన అధికారమూ, సామర్థ్యమూ కొత్తవారికైనా గోచరించుతూనే వుంటుంది. అటు టెలిఫోనులో ఎవరితోనో సంభాషించుతూనే వున్నారు. ఇటు తనకింది ఉద్యోగులకు ఉత్తరువుల జారీచేస్తూనే వున్నారు. అక్కడకూడిన పత్రికా విలేఖరులకు యుద్ధస్థితి వివరించుతూనూ ఉన్నారు. ఇంగ్లీషు బాగావచ్చినా, అక్కడచేరిన బ్రిటిష్, అమెరికన్ పత్రికా విలేఖరులకు తన చైనా భాషలోనే తెలుపుతూ వున్నారు. తర్జుమాలో తప్పులు చెప్పినప్పుడు తనే దిద్దుతూ వున్నారుకూడా. ఇన్నీచేస్తూ భారతీయ వైద్యుల పరామర్శించడానికి వీలుచిక్కించుకున్నారు. 'ఎయిత్ రూట్ ఆర్మీ'తో వుండి పని చేయాలనే తమ సంకల్పమును తెలియచేసేసరికి ఎంతో సంతోషమును పొంది అన్ని సౌకర్యములూ కలుగచేసి వారితో పూర్తిగా సహకారము చేస్తామని చెప్పినారు.

ప్రథమ సందర్శనములోనే వీరికి ఇతనిపై అభిమానము కలిగినది. తరువాత ఒకటి రెండు దఫాలు వీరిని కలుసుకోకలిగినారు. హాంకాలో భారతీయ వైద్యబృందము గౌరవార్థము జరిగిన అనేక విందులలో ఒక విందులో వచ్చినవారందరూ మధువు సేవించి మత్తెక్కివుండగా, అందరిలోనూ అప్రమత్తుడుగా వున్నది ఇతడు ఒక్కడే!

హాంకాలో రకరకాల మనుష్యులను కలుసుకొనినారు. రెన్ యుఆన్ అధ్యక్షులు. ఆ పల్చని పొడుగాటి గడ్డము కన్‌ఫ్యూషియన్‌ను జ్ఞప్తికితెస్తూ వుంటుంది. సౌజన్యమూర్తి ఆ పితామహుడు. ఆంగ్ల పత్రికా రచయిత్రి ఫ్రెడా ఉట్లే శరీరం స్థూలంగావున్నా బుద్ధి చాలా సూక్ష్మం. మంచి బలంగా వుంటుంది. 'జపాన్స్ ఫీట్ ఆఫ్ క్లే" అనే గ్రంథంవ్రాసి నిప్పన్ ప్రమాదమునుగురించి ప్రప్రథమంగా హెచ్చరిక చేసింది. చాలా సంవత్సరములు ఆమె కమ్యూనిస్టు—కనీసం కమ్యూనిస్టుల యెడల సానుభూతి వుంది. తరువాత ఆదర్శములు, సిద్ధాంతముల విషయములో అభిప్రాయభేదములు ఏర్పడి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌నుంచి విడిపోయినది. మాస్కో అధికారులు ఈమెను 'మితవాది' అని నేరారోపణచేసి

నారు. అందుచేత చైనా కమ్యూనిస్టులు తనతో సహకారము చేయరేమో అనే భయముతో హాంకాంకు వచ్చివేసింది. కాని చైనా కమ్యూనిస్టులు ఆమెతో చాలా స్నేహంగావుంటూ ఆమె కోరిన విషయములన్నింటినీ తెలుపుతూ భారతీయ వైద్యబృందము గౌరవార్థము జరిగిన 'ఎయిత్ రూట్ ఆర్మీ' విందులన్నిటికీ ఆహ్వానించి చివరకు ఆమె గౌరవార్థముకూడా ఒక విందు ఏర్పాటు చేసినారు.

భారతీయులు కలుసుకొనిన తదితరులలో ముగ్గురు కొరియా క్రాంతికారులూ, ఒక ఫాసిస్టు వ్యతిరేక జపాన్ దేశీయుడూ వున్నారు. ఇతడు ఎయిత్ రూట్ ఆర్మీతో చేరి పనిచేస్తూ వున్నారు. ఇతడు జపనీస్ భాషలో ప్రసంగిస్తే కొరియా భాషలోకి, తరువాత చైనాభాషలోకి ఆతరువాత జర్మన్ భాషలోకి, అనంతరం ఆంగ్లంలోకి తర్జుమా చేయవలసివచ్చింది ఇతని భాషను. జాతి, వర్ణ పొలిమేరల నతిక్రమించు ఆదర్శములుండుట శుభప్రదము. సైనికవర్గముల పట్టునుంచి జపాన్‌ను విడిపించుటకుగాను ఆక్రమిత చైనాలోవున్న తన దేశీయసైనికులలో రహస్య ప్రచారమును సాగించుచూ తిరుగుబాటును ప్రోత్సహించుచున్నాడు యీ జపాన్ రచయిత. ఇతడు చైనావారిమధ్యనే కాలక్షేపం చేస్తున్నాడు. చైనావారితనిని తమ సహచరునిగానే చూస్తూవున్నారు.

అన్నావాంగ్ ఒక జర్మన్ స్త్రీ. ఒక చైనా కమ్యూనిస్టును వివాహంచేసుకొని ఇక్కడే కాలక్షేపము చేస్తూవున్నది. జర్మనీ నియంత అంటే ఎంతమంటో జపాన్ వారన్నా అంతే. ఎన్నో పర్యాయములు జపాన్ బాంబులనుంచి తప్పించుకొనినది. హాంకాలోనే భారతీయవైద్యులు ప్రథమతః సోవియట్ పౌరుని కలుసుకొనినారు రష్యన్ వార్తా సంస్థ టాస్ ఏజన్సీకి హాంకాలో మేనేజర్. ఇతని పేరు రగాఫ్. ఎప్పుడూ చాలా ఖులాసాగా వుంటాడు. భారతీయ వైద్యబృందం ఆగమనమును గురించి మాస్కోకు దీర్ఘంగా వర్తమానము పంపినాడు.

ఇచట వీరుకలుసుకొనిన భారతీయులు స్థానిక బ్రిటిష్ ప్రదేశములోని అధికారులవద్దా, వ్యాపార సంస్థలలోనూ పనిచేస్తూవున్న కొద్దిమంది సిక్కులు, అమాయకులు, అజ్ఞానులున్నూ. అయినా అత్యద్భుతముగా అతిథి సత్కారముచేసినారు. తమ మాతృభూమినుండి వచ్చిన ఆ గంతుకులచూచేసరికి పరమానందము కలిగినది. వైద్యులను తమ గురుద్వారాకు తీసుకొని వెళ్ళినారు. చిన్న సభను

ఏర్పాటుచేసినారు. డాక్టర్ అటాల్ హిందుస్తానీలో ఉపన్యాసము చేసినారు. అనేక సంవత్సరములుగా వీరు చైనాలో ఉంటూవున్నప్పటికీ చైనా అత్యద్భుత ప్రతిఘటన ప్రాముఖ్యమును తెలుసుకొనడానికి వీరికి లభించిన మొదటి అవకాశము ఇదే అయివుండాలి.

వీరందరికంటే ప్రతిభావంతురాలు, అపూర్వవ్యక్తి అమెరికా దేశస్థురాలు అగ్నెస్ స్మెడ్లీ. వైద్యబృందము హాంకౌలో దిగినరోజున ప్రప్రథమ స్వాగతం యీమెదే. హాంకౌలో ఉన్నంతకాలమూ వైద్యుల వసతులను సౌకర్యములను శ్రద్ధగా ఏర్పాటుచేస్తూ వుండేది. ఈమె జీవితగాథను గ్రంథస్తం చేయవలెనంటే ఎన్ని సంపుటములు అవుతవో తెలియదు. శ్రామికవర్గమునకుచెందిన దీమె. కాయకష్టము చేసి కడుపునింపుకునేవారు ఈమె తలితండ్రులు. స్వదేశమువదలి ఇంగ్లండ్, జర్మనీ రష్యా దేశములలో చాలకాలమువుండి ఆఖరికి సోవియట్ చైనా చేరింది.

చాలాకాలముగా ఈమెకు భారతీయ విప్లవకారుల సంపర్కము వున్నది. భారత స్వాతంత్రోద్యమముయెడల సానుభూతి ప్రకటించడమువలన భారతవైద్యులకు ఈమెమీద ప్రత్యేక అభిమానము కలిగినది. చిన్నతనములోనే కాలిఫోర్నియా విశ్వవిద్యాలయమున ఒక భారతీయుని ఉపన్యాసము ఈమె వినడము తటస్థించినది. భారతదేశమునుగురించి సాంగోపాంగముగ తెలుసుకొనవలెనను తృష్ణ ఏర్పడినది. తరువాత న్యూయార్కులో మరికొందరు భారతీయులను కలుసుకొని, భారత సమస్యనుగురించి ఎక్కువగా తెలుసుకొనినది. నాటినుంచీ ఈమె పూర్తిగా సామ్రాజ్య వ్యతిరేకవాది అయినది. 1914 లో ప్రథమప్రపంచసంగ్రామము ప్రారంభమైనపుడు భారత క్రాంతి కారుల కారాగారానికి పంపుతూవున్న బ్రిటిష్ ప్రభుత్వమును తీవ్రముగా విమర్శించినది. అలాంటిబ్రిటిష్ ప్రభుత్వమునకు తోడ్పడుతూవున్న అమెరికా ప్రభుత్వమునూ నిశిత విమర్శకు గురిచేసినది. తత్ఫలితముగా ఆమెకే కారాగారవాసము సంప్రాప్తమైనది. యుద్ధము ముగిసిన తరువాత యూరప్‌వెళ్ళినది. తరువాత రష్యాపోయి, అక్కడ కొంతకాలమువుండి జర్మనీ పోయినది. అక్కడే స్థిరనివాస మేర్పరచుకొనినది. విలేఖరిగా చైనా వచ్చినది. ఇంతలో జర్మనీ హిట్లర్ ప్రాపకంకిందకువచ్చి నాజీ ప్రభుత్వము ఏర్పడినది.

ఈమె చైనాలోనే ఉండిపోవడానికి నిశ్చయించుకొనినది. అప్పుడప్పుడు సోవియట్ రష్యా వెళ్ళివస్తూవుంటుంది. అమెరికా జర్మనీ దేశములలోని భారతీయ విప్లవకారులనుగురించిన అనేక వుదంతములు ఈమెకు తెలుసును. ఈమె భారతదేశమును చూడనేలేదు. అయినా భారతీయులు అంటే విశేషాభిమానము కలిగి వారిస్వాతంత్ర్య పోరాటము, తన స్వాతంత్ర్యపోరాటముగానే భావింపగలిగినది. వాస్తవముగా అత్యద్భుత వ్యక్తే.

కనుకనే భారతీయ వైద్యబృందమునకు ఈమె స్నేహితురాలు, ఆప్తురాలు, సలహాదారు అయినది. అందుచేతనే హాంకాలో ఎయిత్‌రూట్ ఆర్మీ విందు సందర్భమున భారత స్వాతంత్ర్యపు ప్రశక్తి, ప్రశంస జరిగినప్పుడు, ఈ భావముల నందుకొనుటకు భారతీయవైద్యులు గౌరవపురస్సరముగా లేచిన వారితోబాటు ఈమె కూడా నిలబడి "భారతస్వాతంత్ర్యం టోస్టును" స్వీకరించినది.

---

# 9. ప్రమాదకరమైన పండువెన్నెల

"చైనాను పాదాక్రాంతంచేయడమే జపాన్ ఏకైకమార్గము" —ప్రిన్స్ కోనోయ్.

"యుద్ధము సృష్టికి తండ్రి ; నాగరికతకు తల్లి" —జపాన్ యుద్ధశాఖాలక్ష్య ప్రకటన.

పట్టణము ఖాళీ!

దండెత్తివస్తున్న అతి క్రూరులైన శత్రుసేనలబారినుండి తప్పించుకొని ప్రాణముల రక్షించుకొనుటకు నగరములవదలి వెళ్ళిపోయే ప్రజలపాట్లు ప్రత్యక్షముగా చూచేందుకు ఇచియాంగ్ ప్రయాణము వీరికిబాగా ఉపయోగపడినది. హాంకౌ అనుభవములు ఎన్నియుగాలనాటివో అనే భావము వీరిలో అప్పుడే అంకురించినది. ఎంతో సంతోషముతో గడిపిన ఆరోజులు, ఆవేళ, భక్తిపూరితమైన ప్రదర్శనములు, శోభాయమానమైన ఆ సభలు, విందులలో వెల్లడి అయిన ఆ

ఉత్సాహోతిశయములు.... వెనుకటి జన్మకు సంబంధించినవికాదుగదా! అనే సందే హము కలిగినది. పట్టణము మొత్తముగా ప్రయాణం కట్టినది. అందిన వాహ నమునెక్కి, తట్టా బుట్టా, మూటా ముల్లెతో బయలుదేరినారు. స్థిరాస్థిని మాత్రము శత్రువుకువదలి చరాస్థినంతనూ గొడ్డుగోదతోసహా తీసుకొని ప్రజలు తరలిపోతూ వున్నారు. వైద్యబృందము ప్రయాణముచేస్తున్న నౌక మలుపుతిరిగినది. హాంకొ దృష్టిపధమునుంచి తొలగిపోతున్నది. విషాదవదనముతో విచార భరిత హృదయ ములతో అందరూ ఆఖరిదఫా ఆ నగరమునుచూచి నిట్టూర్చినారు. పట్టణము పర్వ తాగ్రములవెనుక మణిగిపోయినది. ఎన్నటికైనా తిరిగివస్తామా? రాగలమా అనే ప్రతివారూ అనుకుంటూవున్నట్లు తోచింది. కాని ఎవ్వరూ పైకి ప్రకటించలేదు. తాత్విక దృక్పధము, వుట్టుకతోనే ఏర్పడినది. చైనావారు మౌనముగా విచారమును భరించినారు. వారికి తెలియకనే కంటనీరు కారినది. ప్రయాణసౌకర్యములు కొర వడినందున ఉన్న నౌకలే ప్రజనంతనూ మోయవలసి వచ్చినవి. భారతీయ వైద్యులు ప్రయాణముచేస్తూవున్న నౌకకూడా క్రిక్కిరిసి వున్నది. నదిప్రయాణము శత్రువుకు దుస్సాధ్యము చేయవలెనను సంకల్పముతో హాంకొ ఆవలవున్న పెద్ద నౌకల నన్నింటినీ ముంచివేసినారు. అంచేత పడవలు మరీ తక్కువై పోయినవి.

స్టీమరుమీదనుంచి చూస్తే యాంగ్‌ట్సీకి యాంగ్ నది అలహాబాద్‌వద్ద గంగానదికంటే ఎక్కువ వెడల్పుగా వున్నట్లు తోచింది. నదికి దక్షిణపువొడ్డుపై కొండల చాళ్ళు తీర్చిదిద్దినట్లున్నవి. ఉత్తరపు వైపున పచ్చని పొలాలు, మధ్య మధ్యను మట్టి కుటీరములు, భారత గ్రామముల జ్ఞప్తికితెచ్చుచున్నవి. భూమి మంచి సారవంతమైనది. ఈనమోసినపైరు. మధ్యమధ్య ఆ ఇళ్ళుచూడ ముచ్చ టగా ఉన్నవి. అయిననూ సమర విషాదచ్ఛాయల వ్యాప్తికి నిదర్శనములు లేక పోలేదు. రణరంగమునుంచి వుపసంహరించుకొని వెనక్కువచ్చివేస్తున్న సైని కుల బారులు ఆ పొలాలమధ్యగా కనిపించుతూనే వున్నవి.

అత్యంత నిరుత్సాహకరమైన పరిస్థితులలో ప్రయాణముచేస్తూవున్నప్పటి కినీ, కొత్తగా కలిగిన పరిచయములు, ఏర్పడిన మిత్రబృందమువల్ల ఉత్సాహం

కొంత అయినా నిలచివుంది వీరిలో. ప్రయాణంచేస్తున్నవారిలో ప్రఖ్యాత చైనా విద్యావేత్త ప్రొఫెసర్ టావ్ ఒకరు. పార్లమెంటు సభ్యులు వీరు. చుంగ్‌కింగ్‌లో జరుగనున్న చైనా పార్లమెంటు సమావేశానికి హాజరుకావడానికి బయలుదేరినారు. నూతన విద్యావ్యాప్తి ఉద్యమమునకు మూలపురుషులు. ఈ ఉద్యమానికి "లిటిల్ మాస్టర్" అని పేరు. ఆ బట్టతల కంటిజోడువల్ల ఆయనను చూడగానే ఎవరికైనా ఆచార్యుడని స్ఫురించి తీరుతుంది. రోమను లిపిలో భారతీయ వైద్యులకు చైనా భాషను నేర్ప నారంభించినారు. ఈవిధముగా ప్రయాణకాలము సద్వినియోగమైనది. పార్లమెంటుకు నూతనముగా ఎన్నిక అయినవారున్నూ మరికొందరు ఈ పడవలో వుండినారు. తమదేశపు రాజకీయ జీవితములో ప్రారంభమైన ఈ సరికొత్త ప్రజాస్వామ్యశకము వీరినందరినీ ఆకర్షించినది. వీరు అందరూ చాలా ఉత్సాహముగా వున్నారు.

ప్రొఫెసర్‌టావ్ "లిటిల్ టీచరు" ఉద్యమమునుగురించి సాకల్యముగా తెలుసుకోవలెననే కుతూహలము భారతీయ వైద్యులందరికినీ కలిగినది. తన ఉద్యమమును వివరించి చెప్పడానికి ప్రొఫెసర్ టావ్ కూడా ఉత్సాహపడినారు. ఈ చిన్ని పంతుళ్ళు అందరూ ఇంకా చదువుకుంటూవున్న బాల బాలికలు. పది సంవత్సరములపైనా, పదిహేను సంవత్సరములకు లోపు వయస్సుగలవారే. వీరు నిరంతరం దేశాటనముచేస్తూ వుంటారు. ఆఖరుకు శత్రుశ్రేణి వెనుకభాగములోని జపాన్ ఆక్రమణకిందవున్న చైనా ప్రాంతములోనూ తమ సంచారముచేస్తూ వుంటారు. రైంతాంగమునకూ వయోజన బృందములకు పిల్లలకూ చదువుచెప్పుతూ వుంటారు. ఈ పడవలోనే ఉన్నాడు "చిన్నపంతులు" ఒకరు. భారతీయ వైద్యులు ఈ వడవలో వున్నారని తెలుసుకొని వారిని కలుసుకోడానికి వచ్చినారు. ఎంతో ఆప్యాయముగా పరామర్శించినారు. అతని తెలివి తేటలను, మాటమర్యాదలను, తనవారిని అనుసరించి తనదేశస్వాతంత్ర్యంకొరకు చేస్తున్నకృషినిచూచి అందరూ ముగ్ధులైనారు. రణరంగమున శత్రుసైనికుని ఢీకొని ఎదిరించుచున్న చైనా సైనికునికి, ధైర్యసాహసములలో దీక్ష పట్టుదలలో ఏమీ తీసిపోడు ఇతడు. జపాన్ సైనికులు తమ ఆయుధబలాధిక్యతవల్ల చెదరువాటుగా చైనా సేనలపై విజయమును సాధింపవచ్చును. కాని ఈ "లిటిల్ టీచర్"ల సైన్యమును వోడించుట

జపాన్‌వారి తరముగాదు. వీరి సమరసామాగ్రి, ఆయుధ పరికరములు ఆత్మకూ, మన సత్త్వమునకూ సంబంధించినవి.

* * *

గమ్యస్థానమును చేరడానికి నాలుగురోజులు పట్టింది. ఇచియాంగ్ ఇతర విధాల పెద్ద పట్టణము కాకపోయినా చాలా ప్రధానమైన రేవు పట్టణము. పెద్ద నౌకలు ఈ రేవునుదాటి వెళ్ళలేవు. నది పోనుపోను సన్నగిలి పెద్ద నౌకలయాన మునకు అననుకూలమవుతుంది. పాశ్చాత్య సామ్రాజ్య చిహ్నములు ఇక్కడ బాగా కనుపించుతూవున్నవి. స్టాండర్డు ఆయిల్ కంపెనీ, బ్రిటిష్ వాణిజ్యసంస్థలు, మిషనరీ కార్యాలయములతోబాటు బ్రిటిష్ సామ్రాజ్యపతాకను ధరించిన "గన్ బోట్సు" నదిలో విరివిగా కనుపించుతూ ఉన్నవి.

ఇరవై ఆరు రోజులు, అక్టోబరు 22 నుంచి నవంబరు 16 వరకూ, భార తీయవైద్యులు ఇక్కడవున్నారు. మొదటి నెంబరు బేసు ఆసుపత్రిలోనూ, 86 వ నెంబరు రెడ్‌క్రాస్ ఆస్పత్రిలోనూ వీరు పనిచేస్తూవచ్చినారు. హాంకౌలో దెబ్బలు తిని గాయపడినవారిని అందరినీ ఇక్కడకు తీసుకువచ్చేవారు. కాని అందులో చాలామంది మార్గమధ్యమున మరణించేవారు. హాంకౌనుంచి గాయపడినవారిని తీసుకువస్తున్న రెడ్‌క్రాస్ నౌకల నెన్నింటినో శత్రువిమానములు ముంచివేసినవి. నౌకలు బద్దలైనందున నదిలోపడి చావుబ్రతుకులమధ్య కొట్టుకుంటూవున్న నిస్స హాయ సైనికులు సైతము జపాన్ వైమానికుల ఫిరంగి కాల్పులకు లక్ష్యమైనారు. హాంకౌలోని ఎయిత్‌రూట్ అర్మీకి చెందినవారు ప్రయాణముచేస్తూవున్న నౌక శత్రుచర్యల ఫలితముగా మునిగిపోయినది. నలభైమంది చనిపోయినారు. బ్రతికి బయటపడినవారు, మరోమార్గమును అనుసరించి ఇచియాంగ్ మీదుగా చాంగ్షా చేరినారు. వీరు ఇచియాంగ్ చేరినరోజునే కాంటన్ శత్రువశమైనట్లు వార్తలు వచ్చినవి. హంకౌపై ఒకేరోజున నాలుగు పర్యాయములు శత్రువిమానములు దాడి చేసినవనీ, పట్టణము ఏక్షణమైనా పడిపోవచ్చుననీ ఒక చైనా వైమానికుడు వర్త మానము తెచ్చినాడు. జపాన్ సేనలు క్రమముగా జయప్రదముగా చైనాలోపలి భాగమునకు పురోగమించుచున్నవి. ఇచియాంగ్‌నూ త్వరలోనే ఖాళీచేయవలసిన పరిస్థితులు ఏర్పడవచ్చు.

ఆద్యంతములులేని ఆందోళన. ఏక్షణములో ఏమి జరుగుతుందో! రక రకాల వదంతులు ప్రబలినవి. ఏ నిమిషమైనా వూరువదలి వెళ్ళమని ఉత్తరువులు రావచ్చు అనే అభిప్రాయములో ప్రజలందరూ వుండటమువలన కొంత కంగారు బయలుదేరినది. పొద్దుకూకినదిమొదలు చలిబాధ భరింప అశక్యం అవుతూవుంది. విపరీతమైన మంచు, వర్షం, దారుణమైన చలి. ఉత్తరదిక్కుగా పోయినకొద్దీ చలి అధికమౌతూవుంటుంది. "ఎయిత్‌రూట్ ఆర్మీ"తో సియాన్‌లో పనిచేయడము ఎలా వుంటుందో భారతీయ వైద్యులు ఇచట పరిస్థితులనుబట్టి ఊహించుకోగలిగి నారు. ప్రోత్సాహకరమగు డాక్టర్ అటాల్ నాయకత్వమున పంచభూతములనూ ప్రతిఘటించి పనిచేయడానికి భారతీయ వైద్యులు నలుగురూ తయారు అవుతూ వున్నారు. ప్రతిసాయంత్రమూ ఎనిమిది కొట్టేవరకూ—నాలుగు గంటల పర్యంతము—కొంతదూరము నడవటమూ, కొండలు ఎక్కి- దిగటమూ ప్రారం భించినారు. ఒకరోజు విపరీతముగా వర్షిస్తూవుంది. అయినా పదిమైళ్ళదూరము పోయి చప్పగా తడిసివచ్చినారు. పూర్తిగా అలసిపోయినా ఒక ఘనకార్యంచేసినా మనే చైతన్యం సంతృప్తి నిచ్చినది.

నవంబరు ప్రారంభం సరికి ఇచియాంగ్‌కూడా జపాన్ విమానముల అందుబాటులోకి వచ్చినది. పంచభూతములు సైతము శత్రువుతోచేరి పోయినవి. వెన్నెల రాత్రులు. మంచుకూడా పడడములేదు. నవంబరు 3 జపాన్ చక్రవర్తి పుట్టినరోజు. అనేక చైనా నగరములపై విమానదాడులు జరిపి నిప్పన్ పుత్రులు తమ సార్వభౌముని జన్మదినోత్సవమును జరిపినారు. ఆనాడు ఎందుచేతనో ఇచి యాంగ్‌ను వదలివేసినారు. మరునాడు ఒక గస్తీ విమానమువచ్చి పరిస్థితులు చూచి వెళ్ళిపోయినది. 24 గంటలు అయినా గడవకముందే తొమ్మిది బాంబరు విమానములు వచ్చినవి. భారతవైద్యులు చికిత్సచేస్తూ వైద్యశాలలో ఉన్నారు. రోగులతోబాటు వీరున్నూ భూగర్భ రక్షణాలకు వెళ్ళినారు. బాంబుల ప్రేలుడు విమాన విధ్వంసక శతఘ్నుల ఝుంకారములు స్పష్టముగా వినిపించినవి. ఉన్న ట్టుండి కొత్తరకం కీచుశబ్దము వినవచ్చింది. ఏదో కొత్తరకంబాంబు ప్రేలుడువల్ల ఉత్పన్నమైన శబ్దం. ప్రాణనష్టము ఏమీలేదు. బాంబులు విస్తారముగా వూరు వెలు పలపడినవి. విమానకేంద్రము సమీపములో మాత్రము పగుళ్ళిచ్చినది. ఆ విమా

నాశ్రయ విధ్వంసనమే శత్రువిమానముల లక్ష్యము అయివుంటుంది.

నవంబరు 7. కార్తీక పౌర్ణమి! ఈ "దుష్టపక్షుల" గుంపు మరొకటి వచ్చినది. గతరాత్రి జరిపినదాడి ఫలితములు సంతృప్తికరముగా లేవని కాబోలు నేటిరాత్రి పట్టుదలగా మరీ కిందకువచ్చి కసికొద్దీ బాంబులు వేసినవి. ఈ దాడి వల్ల చాలామంది గాయపడినారు. అనేక భవనములు దెబ్బతిన్నవి. మామూలు దీపాలు ఆర్పి చీకటి చేయవచ్చునేగాని. పూర్ణిమ చంద్రుని మూసివేయడం మానవ మాత్రులకు సాధ్యమా?

హాంకాతో పూర్తిగా సంబంధం పోవడము, తరచు జపాన్ విమానములు రావడము ప్రజలలో భయము ఎక్కువకావడానికి కారణమైనవి. అప్పుడే చాలా మంది చుంగ్‌కింగ్‌కు ప్రయాణం కట్టినారు. నిస్పృహవాదులు కొందరు చైనాసేన పతనం గురించి వదంతులు బయలుదేర తీసినారు. పరిస్థితుల గుర్తించి ప్రభుత్వ అధికారులు వెంటనే చాంగ్‌కైషేక్ సంతకముతో ప్రజలకు ధైర్యం చెప్పు కర పత్రములను విమానములనుంచి వెదజల్లినారు. "తాత్కాలికముగ పరాజయములు ప్రాప్తింపవచ్చును. కాని అంతిమ విజయము మనదే. ఆ గట్టి నమ్మకముతో ప్రజలూ, ప్రభుత్వమూ ఈ దీర్ఘ యుద్ధమును సాగించుతూవున్నారు" అని ఈ కర పత్రములో విస్పష్టంగా ప్రకటించినారు. దీని ఫలితముగా ప్రజలలో కొంతధైర్యం కలిగిందేగాని, పట్టణమును ఖాళీచేయడము జరుగుతూనే వున్నది. చుంగ్‌కింగ్‌కు బయలుదేరవలసిందిగా భారతీయ వైద్యబృందమునకూ ఉత్తరువులు వచ్చినవి. పడవకోసరం కనిపెట్టుకొని వున్నారు.

అంతులేని ఆ విమానదాడులు ప్రజలను అధైర్యపరచవలసింది, సహజంగా. కాని విమానదాడులు ఎక్కువైనకొద్దీ ప్రజల ధైర్యమూ హెచ్చుతూ వున్నది. మొదటి రెండుమూడుసారులతో భయము తీరిపోయినది. తరువాత అలవాటై పోయినది. భారతవైద్యులు ఇచియాంగ్‌ను వదలినరోజుకు ప్రజలు బాగా అలవాటుపడి ఒకేవిధమైన నిర్లక్ష్యభావంతో ఈ విమానదాడులను ఎదుర్కొంటూ వున్నారు. రానురాను రక్షణస్థానాలకు వెళ్ళడముకూడా మానివేసినారు. ఒకవంక బాంబులు ధారగా పడుతూవున్నవి. మరోపక్కన ఒక రేడియో వద్ద కూర్చొని ప్రశాంతముగా ప్రజలు వింటూవున్నారు. అనేక పర్యాయములు

ప్రయత్నించగా ఆరోజు భారతీయ బ్రాడ్ కాస్టింగ్ స్టేషను చిక్కినది. ఆ వంగ గానమును వీనుల విందుగా వింటున్న భారతీయులపై జపాన్ బాంబులు ఏమీ పనిచేయలేదు.

వీరి సంతోషమును అతిశయింపచేసే మరోసంఘటన—ప్రయాణం హడావిడిలో మందులు సర్దుతూవుంటే ఒక పెద్ద పెట్టె కనిపించింది. ఆకారం అనుమానకారణమైంది. వెంటనే ఊడదీసినారు. ఇందులో ఒక గ్రామఫోనువుంది. ఆత్రంగా బయటకుతీసినారు. పెట్టె అడుగున ఒక చిన్న కాగితంముక్క కనిపించింది. బాగుగా తెలిసిన సంతకం వుంది ఆ కాగితంపేలికమీద. భారతీయవైద్య బృందానికి పండిట్ నెహ్రూ ఇంగ్లండునుంచి పంపిన కానుక ఈ గ్రామఫోను. ఇంతకాలం గమనించకపోయినందుకు చాలా విచారపడినారు. అయినా అనుకోకుండా, తలవని తలంపుగా సంప్రాప్తించినందుకు బ్రహ్మానంద భరితులైనారు. ఆ ఆనందములో వారికి గంటలుకూడా తెలియలేదు. ఆరాత్రి నిద్దురపోలేదు. ప్లేట్లువింటూ కూర్చున్నారు. నెహ్రూ దూరదృష్టి, ఔదార్యం వీరిని కదల్చివేసినది.

నవంబరు 16 వ తేదీన ఒక 'లాంచి'లో చుంగ్ కింగ్‌కు బయలుదేరినారు. ఇద్దరు చైనాప్రభుత్వ ఉద్యోగులూ, ఎనమండుగురు నార్వేదేశపు మిషనరీలు వీరివెంట బయలుదేరినారు. నార్వీయన్‌లు ఎనిమిదిమందిలోనూ ఆరుగురు స్త్రీలు. వీరి ప్రియులు చైనాలో వుండిపోయినారు. ఆరుగురికీ నిశ్చితార్థాలు జరిగినవి. వివాహంకోసమే ఇక్కడికి వచ్చినారు. "నార్వీజియన్ వధువులు" అని వీరిని పిలిచేవారు. యుద్ధజ్వాలలు, ప్రాణభీతితో పట్నముల ఖాళీ చేయడము, విమానదాడి ప్రమాదం, ఇన్నింటిమధ్యా "ఈ ప్రేమ, పరిణయగాధలు" ప్రపంచములో ప్రేమ, వాత్సల్యము, మానవత్వమూ, జీవిత విలాసములు అంతరించిపోలేదని జ్ఞాపకము చేస్తూవున్నవి.

---

# 10. చుంగ్‌కింగ్‌పై మెరుపు యుద్ధం

"ఈ చైనా ప్రజనుగురించి ఏమనుకోవాలి ? ఏ పాశ్చాత్య దేశానికీ సాగించుటకు సహనము చాలనట్టి సమరమును వీరు సాగించుచున్నారు. అది గౌరవప్రదమైన శాంతికాకుంటే వారికి శాంతి అవుసరములేదు. వారు విజయమును పొందకపోతే వారింతకాలమూ సాగించిన యుద్ధమేగాక, వేటికొరకు యుద్ధముచేస్తూ ఉన్నారో అవికూడ నిర్మూలనమై పోతవి. ఆ సర్వస్వమే మనకు తెలిసినంతవరకు నాగరికత. అన్నింటికంటే అద్భుతమైనది ఏమిటీ అంటే వీరు ప్రాణాలకు తెగించి పోరాడుతూవుండికూడా ఎంతోముందుకు చూస్తూ ఉన్నారు."

— డి. యఫ్. కరకా (ఛంగ్ కింగ్ డైరీ)

నదీ ప్రవాహము చాలా ప్రమాదకరముగా వుంటుంది. ఎంతో మెలకువతో ఎంతో జాగ్రత్తగా నడుపుకుపోవాలి 'లాంచి'ని. తాబేటి నడకని 'లాంచి' గంటకు మూడుమైళ్ళకు మించి పోవడములేదు.

ఆకాశమునకు అట్టులుజాచివున్న పర్వతశ్రేణుల మధ్యగా శరవేగముతో ప్రవహిస్తూవున్నది నది. ఆ 'మేరు' పర్వతములమధ్యను ప్రయాణంచేస్తూవుంటే మానవునికి ఒకవిధమైన అల్పజ్ఞతా భావము కలుగుతుంది. మలుపులు తిరిగే ముందు లాంచి కూతవేస్తుంది. మనోహరంగా ప్రతిధ్వనిస్తుంది యీ కూత. చైనావారు ఈ ధ్వనిని "గాలిపెట్టె ధ్వని" అని అంటారు. చైనావారు భలే చమత్కారముగా పేర్లు పెడతారు.

అలాగే ఒకరోజు గడిచింది. ఆ ఎత్తుకొండలూ గతించినవి. చిన్నగుట్టలు ప్రారంభం అయినవి. ఇక్కడ్నుంచీ ఈ నదిని "జెకువాన్" అంటారు—నాలుగు నదులు అని అర్థం. చైనాదేశం మొత్తముమీద ఇంతపెద్ద రాష్ట్రము వేరొకటి లేదనిపిస్తుంది. జనసమర్దంకూడా అధికముగా వుంటుంది. నదికి రెండుపైపులా చిన్నచిన్న పల్లెలు వున్నవి. అక్కడక్కడ పట్టణములూ వున్నవి. తారురోడ్లు, విద్యుచ్ఛక్తి, నారింజతోటలు, నానావిధ ఫలవృక్షములతో విరాజిల్లు వుద్యానవనములు, అందమైన భవనములు కొల్లలుగా వున్నవి. ఈ శోభస్కరమైన ప్రాంత

ముపై యుద్ధమేఘము లింకనూ కమ్ముకొనలేదు. కాని ఆ భ్రమ ఎంతోకాలం వుండదు. ఆ కొత్తగా ఏర్పాటు అయిన సైనిక చికిత్సాలయములు, వాటిపైనున్న "రెడ్‌క్రాస్" గుర్తులూ, హాంకౌ, ఇచియాంగ్‌నుంచి వస్తున్న సైనిక సమూహములనూ చూడగానే ఆ భావం కాస్తా తొలిగిపోతుంది.

తరువాత రెండురోజుల ప్రయాణములోనూ ఫల వృక్షములతోపులూ, కూరగాయల మళ్ళు, ఇంకా ఎక్కువగా కనిపించినవి. వీటితోబాటు గగనవీధులలో వీరవిహారం చేస్తూవున్న విమానములు, నదిలో గస్తీ తిరుగుతూవున్న "గన్‌బోట్సు" యుద్ధసామీప్యమును స్ఫురణకు తీసుకొని వచ్చుచున్నవి. అయితే ఈ విమానములూ, గన్‌బోట్సూ చైనావారివే. భారతీయ వైద్యబృందమునకు హస్త విన్యాసములతో స్వాగతమిచ్చినారు.

చలి విపరీతముగా వున్నది. వేళ్ళు కొంకర్లుపోయి అవయవములు స్వాధీనముతప్పినట్లున్నది. మంచు, ఆ రమణీయక దృశ్యములు పోయి పర్వతములు, అడవులు తిరిగి తలెత్తినవి. అతి గంభీరముగా, కూతవేస్తూ లాంచి ఆ పొగ మంచును చీల్చుకొని, మంచుమాదిరిగావున్న ఆ నది జలమును పాయలుచేస్తూ ముందుకు సాగుతూవున్నది.

ఆరవనాడు లాంచీ గమ్యస్థానముచేరినది. లాంచీ దక్షిణపు వొడ్డు తాకినది. చుంగ్‌కింగ్ మేయరు, డాక్టర్‌మీ, జనరలిస్మో తరపున ఒక సైనికోద్యోగి, శాంతినికేతనమునందలి 'చైనా భవనం' ఆచార్యులు టాన్‌యాన్ షాన్, స్థానిక బౌద్ధ సంఘ అధ్యక్షులు, కొందరు కెన్‌డా మిషనరీలు రేవువద్ద వీరికి స్వాగతమిచ్చినారు. చాలా ఘనమైన స్వాగతము! విదేశీయుల వసతికిగాను ప్రత్యేకముగావున్న ప్రభుత్వ భవనములో ఏర్పాట్లు చేస్తామని చాంగ్‌కైషేక్ ప్రతినిధి వైద్యులకు విన్నవించినారు. నగరములో నివాసస్థలమునకు ఇబ్బంది ఎక్కువగా వున్న విషయము తమకు తెలుసుననీ, అందుచేత ప్రభుత్వ అతిధి భవనమును ఆక్రమించి అధికారులను ఇబ్బందిపెట్టుట తమకు ఇష్టములేదనీ డాక్టర్ అటాల్ మనవిచేసినారు.

తమతో ఇచియాంగ్‌నుంచి వస్తూవున్న తోటిప్రయాణీకులవద్ద సెలవుతీసుకొని ప్రభుత్వ లాంచిలో నదికి ఆవలిదరిని వున్న రాజధానికి బయలుదేరినారు.

లాంచీనుంచి దిగుతూ వుండగానే అంతులేని పడికట్ల వరుస కనిపించినది. యుద్ధకాలపు చైనా రాజధానీ నగరము చుంగ్‌కింగ్‌లో ఇలాంటి మెట్లను ఎన్నింటినో ఎక్కి దిగవలసివుంది. ఒక్కసారి ఒడలు విరుచుకొని ప్రయాణబడలిక తీర్చుకొని పట్టణములోకి బయలుదేరినారు.

* * *

కోస్తాకు 1500 మైళ్ళు దూరముగా, జెకువాన్ పర్వతములమధ్య యాంగ్‌ట్సీ, కియలింగ్ నదుల సంగమస్థానమున వున్నది చంగ్‌కింగ్. నాలుగు వేల సంవత్సరములనుంచీ ఇదొక నగరస్థానము. యుద్ధముప్రారంభమై హాంకౌను ఖాళీచేసేవరకు ఈ పర్వత గుహ్వరము అఖండ చైనా రాజధానీ నగరము కాగలదనీ, కానున్నదనీ ఎన్నడూ ఎవ్వరూ అనుకోలేదు. పెకింగ్, నాన్‌కింగ్‌లాంటి ఆధునిక నగరములకు ఇది వారసురాలు కాగలదని ఎవరు ఊహించినారు? యుద్ధ పరిస్థితులవల్ల దేశజీవిత కేంద్రము క్రమముగా పశ్చిమమునకు మళ్ళుతూవున్నది. కేవలం రాజధానీ నగరముల మార్పులవలన ఏర్పడినదికాదు. ఇంతవరకూ ఎంతో వెనుకబడివున్న ప్రాంతములు నేడు చైతన్యంపొంది నూతన ఉత్సాహముతో జాతీయ జీవనమున పాల్గొనుచున్నవి. కొన్ని సంవత్సరములు తూర్పు సముద్ర ప్రాంతము ఉత్తరమున పెకింగ్‌నుంచి దక్షిణాన కాంటన్ వరకూ అటు రాజ్యాంగ వ్యవహారములలోనేగాక, ఇటు పరిశ్రమలు, వ్యాపారము, వృత్తి, విద్య, సంస్కృతి—ఇత్యాది విషయములలోనూ గుత్తకు తీసుకొనినట్లు వుండేది. జపాన్ దండయాత్ర ప్రారంభముతో రేవు పట్టణములలో వుంటూవచ్చిన పెద్దలు పశ్చిమ ప్రాంతాలకు పరుగులెత్తవలసి వచ్చింది. విశ్వవిద్యాలయములు అమాంతం లేచినవి. కోస్తాకు బాగా దూరముగావున్న గ్రామములలో తిరిగి ఏర్పడినవి. పాలకులూ, పారిశ్రామికులూ, విద్యార్థులూ, వ్యాపారస్థులూ అందరూ మకాములు మార్చివేసినారు. తమదేశ విస్తీర్ణమును, అపారసంపదను మొదటిదఫా చూచినారు. భౌతికముగానూ, తాత్వికముగాను తన్నుతా తెలుసుకొనజరుగు ప్రయత్నములకు చిహ్నమూ, కేంద్రమూ చుంగ్ కింగ్ అని చెప్పవచ్చును.

పట్టణములో విపరీతమైన సంచలనము కనుపించుతుంది. ప్రభుత్వాధికారులు, క్యుమింటాంగ్ ఉద్యోగులూ సపరివారముగా తరలి రావడముతోబాటు

తూర్పు గ్రామములనుంచి అధికంగా కాందిశీకులుకూడా వచ్చివేయడముతో వీధులు క్రిక్కిరిసినట్లున్నవి. ఇళ్ళు తక్కువైనవి. ఆమెరికా పద్ధతులను అనుసరించి, తాత్కాలిక వుపయోగంకొరకు తయారవుతూవున్న ఇండ్ల సంఖ్య పెరిగిపోతూవుంది. రోమ్ నగరమువలెనే చుంగ్‌కింగ్‌కూడా పర్వతములమధ్య నిర్మింపబడివుంది. అందువల్ల పట్టణములో ఏ ప్రాంతానికి వెళ్ళవలసినా ఎన్నో మెట్లు ఎక్కడమూ, దిగడమూ జరుగుతుంది. సామాన్య ప్రజకు వాహనసౌకర్యాలు లేవు. అధికారులూ, ధనాఢ్యులు మాత్రము డోలీలలో తిరుగుతూవుంటారు. వీధులు వెడల్పులేవు. దుకాణములతో క్రిక్కిరిసి వున్నవి. అన్నివస్తువులూ అంగట్లోవున్నా అందరికీ అందుబాటులోమాత్రం లేవు విపరీతమైన ధరలు. హాంకౌలోవలె అధిక సైనిక సంచలనము లేదనేగాని, నెలవుమీదవచ్చిన సైనిక ఉద్యోగులు, సైనికులూ అడప దడపా కనబడుతూనే వున్నారు. గోడలమీది ప్రచారక పోస్టర్లు చూడ ముచ్చటగానున్నవి. సభలేనా! సమావేశాలేనా! ఊరేగింపులేనా! ఉత్సవములేనా!

తీవ్రవాద రాజకియములవ్యాప్తి హెచ్చుగానే వున్నది. విద్యావంతులలో తీవ్రవాద ధోరణి, ఎక్కువగా, వున్నట్టుతోస్తుంది. పుస్తకముల దుకాణములు చూచినా అదే అభిప్రాయము కలుగుతుంది. సోషలిస్టు, కమ్యూనిస్టు సారస్వతం బాగా చలామణి అవుతూవుంది.

* * *

చుంగ్‌కింగ్‌లోవున్న రెండు నెలలలోనూ ప్రభుత్వాధికారులనూ, క్యుమింటాంగ్ ప్రముఖులనూ చాలామందిని మన వైద్యులు కలుసుకొనినారు. చాంగ్‌కైషేక్‌ను కలుసుకోవడంమాత్రం సాధ్యంకాలేదు. అందుకు యిరుపక్షములవారూ విచారించినారు. హాంకౌ పతనము వల్ల కొత్తగా ఏర్పడిన ప్రమాదమునకు తగినట్లు ప్రత్యేక రక్షణ శ్రేణుల సంఘటిత పరచడములో ఛాంగ్‌కైషేక్ నిమగ్నమై ఉన్నారు. సందర్శనమునకు ఒక తేదీ నిర్ణయం అయింది. కాని ఒకరొన్నకరు కలుసుకోడానికి పూర్వమే డాక్టర్‌లకు యెనాన్‌నుంచి అవసరంగా పిలుపువచ్చినది. తమ సంయోగమునకు అవాంతరమేర్పడినందుకు విచారము తెలుపుతూ, రెడ్ క్రాస్‌వారు ఏర్పాటుచేసిన కార్యక్రమమును కొనసాగింపవలసిందని చాంగ్ ఛార

తీయ వైద్యులకు సందేశముపంపినారు. లాంఛనప్రాయమైన, సద్భావసూచకమైన, సౌజన్య చిహ్నమైన ఈ సంయోగంకంటే చైనా అధిపతికి గాయపడిన తన సైనికుల క్షేమము ఎక్కువ ముఖ్యముకదా!

మదాం చాంగ్‌కైషేక్‌ను మాత్రము కలుసుకొనినారు. నవజీవనోద్యమము ఆధ్వర్యమున సంవత్సరాది సాయంకాలము జరిగిన విందు ఈ సంయోగమునకు వీలుచేసినది. భారతీయ వైద్యులకు ఆమె హృదయపూర్వకముగ స్వాగతమొసగినది. అనంతరము వైద్యదళమును పంపినందుకు భారత జాతీయ కాంగ్రెస్‌కూ, భారతీయులకూ చైనా కృతజ్ఞతను వెల్లడిచేయుచు ప్రసంగించినది. ఎంతో డస్సినట్లు కన్పించినది ఆమె. క్షణం తీరికవుండదు. తనదేశ భవిష్యత్తునుగురించి నిరంతరాందోళనలోనున్నదామె. ఈ విషయములను తెలుసుకొనినవారికి ఆమె స్థితి ఆశ్చర్యకరము కాజాలదు. నాడామె ధరించిన అసాధారణ నీలివర్ణపు చైనా గవునులో ఎంతో అందముగా ఆమె కనుపించినది. ఆమె సహజలావణ్యమును అతిశయింపచేయు, ముఖమును ప్రకాశవంతముచేయు ఆ మందహాసము మరుపునకు రాదు. ఆ మందహాసమును అవలోకించి ఆనందించు అదృష్టము అందరికీ పట్టదు. ఈనాటి విందులో సమానత్వమూ, సహజత్వమూ బాగా కనుపించినవి. పెద్దలలోనూ, పిన్నలలోనూ ఆమెకు అంతటి ప్రాపకం ఏర్పడటానికి కారణము తెలిసిపోయింది.

ఈ విందు సందర్భములోనే వీరు డోనాల్డ్‌నూ కలుసుకొన కలిగినారు. ఇలాంటి మనిషి వున్నాడని ఎవరుచెప్పినా నమ్మడము కష్టము. వెంట్రుకలు పూర్తిగా నరసి ముగ్గుబుట్టవలెవున్న తల. అయిదు పుష్కరాలు గడచినవి. ఆధునిక చైనా చరిత్రలో, ఈ ఆస్ట్రేలియా దేశీయుని భూమిక అత్యంత ప్రధానమైనది. చైనా నాయకులు అందరికీ అంతరంగికుడు. అందరి విశ్వాసమునూ చూరగొనినాడు. పత్రికా రచయితగా చైనావచ్చి ప్రభుత్వ నిర్వాహకులకు ప్రాపు అయినాడు. మంచూ వంశమును కూలద్రోయడానికి చైనా క్రాంతికారులకు సహాయ పడినాడు. స్వర్గీయ సన్‌యట్ సెన్‌కు ఆత్మీయుడుగా వుండినాడు. మదాంచాంగ్ తండ్రికి ఆప్తమిత్రుడు. నేడు చాంగ్ దంపతులకు అనధికారసలహాదారుడు. తోడునీడవలె వారివెంట వుంటాడు.

చుంగ్‌కింగ్‌లో దిగంగానే భారతీయ వైద్యులు చైనా ప్రముఖులలో అగ్రజుడైన ప్రెసిడెంట్ లిన్‌సెన్‌ను కలుసుకొవినారు. ప్రొఫెసర్ టాన్‌యన్‌షాన్‌తో జాతీయ ప్రభుత్వ కార్యాలయమునకు వెళ్ళినారు. ఇది పట్టణమునకు అయిదుమైళ్ళ దూరమున ఉన్నది. అఖండ చైనా ప్రభుత్వ కేంద్రకార్యాలయమే అయినా సర్వసాధారణముగానే వున్నది యీ కార్యాలయం. ఒక సైనిక ఉద్యోగి వచ్చివీరిని లోనికి తోడ్కొని వెళ్ళినాడు. సన్మానముల చావిడీ చాలా విశాలముగానేవున్నది. కాని, సామాగ్రి అంటే ఏమీలేదు. కొద్దిగా కుర్చీలుమాత్రంవున్నవి. భారతీయ వైద్యులకు వెంటనే భారతదేశ రాజప్రతినిధి డాబు, డంబమూ స్ఫురణకు వచ్చినవి. అధ్యక్షులు రావడము కొంచెము ఆలస్యమైనది. వచ్చేరావడంతోటే, తన సహజ సౌజన్యముతో, మూర్తిమంతముతో తన ఆగంతుకుల జయించినారు. పరిపూర్ణత్వమును పొందిన చైనా సంస్కృతి మూర్తీభవించిన ప్రతిభాశాలి లిన్‌సెన్. వృద్ధాప్యములోకూడా అందగానివలె కనుపించినారు. గడ్డానికి అతికివున్న ఆ నాలుగు వెంట్రుకలైనా నల్లగా లేవు. చైనా సాంప్రదాయ సిద్ధమైన గవును ధరించి అపై ఒక 'జాకెట్' వేసుకొనినారు. ప్రజ్ఞావంతుడనీ, మహనీయుడనీ, సిద్ధిబొందిన తపస్వి అనీ వారినిచూడగానే తోస్తుంది. చట్టంలేని ఆ కంటి అద్దములలోనుంచి కరుణా రసభరితమైన కనులతో అతిధుల అవలోకించినారు. ప్రొఫెసర్ టాన్ యాన్ షాన్ సహాయముతో భారతీయవైద్యుల పరామర్శించినారు. మహాత్మా గాంధీ, పండిట్ నెహ్రూల యోగక్షేమముల అడుగుతూ సంభాషణ ప్రారంభించినారు. అనేక శతాబ్దములుగా వుంటూవున్న చైనా, భారతదేశముల రాజకీయ సాంస్కృతిక సంబంధముల ప్రస్తావించినారు. ముచ్చట ముగిసి బయటికి వస్తూండగా ఒక మహానుభావునితో, ఒక అపూర్వ వ్యక్తితో సంభాషించితిమనే భావం భారతీయ వైద్యులందరికీ కలిగింది.

భారతీయ వైద్యులు తాయ్‌చిటోనూ ఇక్కడే కలుసుకొనినారు. క్యుమింటాంగ్ రాజకీయవేత్తలలో వీరు మొదటి రకమునకు చెందినవారు. వీరున్నూ ఎంతో అప్యాయముగా మాట్లాడినారు. ప్రతివిషయముమీదా వీరికి ప్రత్యేక అభిప్రాయములు వున్నవి. "ప్రతి దేశమునకూ, ఆదేశ పరిస్థితులకు, అవసరములకు తగినట్టు జీవితతత్వం ఒకటి వుంటుంది. చైనాకు అవసరమైనది అటు ధన

స్వామికమూ కాదు, ఇటు సాంఘికవాదమూ కాదు. డాక్టర్ సన్ యట్ సెన్ నిర్వచించిన, ప్రబోధించిన "త్రిసిద్ధాంతములు" అని వీరు చైనా స్థితిగతులను తెలిపినారు.

వైద్యబృందము గౌరవార్థము జరిగిన విందులు అసంఖ్యాకములు. కేంద్ర రాజకీయ సంఘమువారు ఏర్పాటు చేసిన విందుకు ప్రభుత్వ ఉన్నత ఉద్యోగులు అందరూ హాజరైనారు. క్యూమింటాంగ్ కేంద్ర కార్యవర్గమువారి విందులో భారతీయ వైద్యులు చైనా ప్రభుత్వ ఆరోగ్యశాఖామంత్రి యఫ్. సి. యెన్‌ను కలుసుకొనినారు. చైనా—భారత సంఘమువారూ, బౌద్ధ సంఘమువారూ సంయుక్తముగా సనాతన విందు ఒకటి ఏర్పాటుచేసినారు. మాంస, మద్యములు నిషిద్ధములు. రకరకాల కూరగాయలతో మాంసాహారము మాదిరే పాకశాస్త్ర ప్రవీణులు తయారు చేసినారు.

* * *

పనిపాటలు లేకుండా, విందులుకుడుస్తూ ఎంతకాలం ఇలా కాలక్షేపం చేయడము అనే భావము వైద్యులకు కలిగినది. ఏదో ఒక రంగమునకుపోయి తమ పని ప్రారంభించవలెనని ఆతురపడుతూవున్న కొద్దీ ప్రయాణము ఆలస్యమవుతూ వున్నది. కాలయాపనం కష్టమైనది. సినిమా చూద్దామని బయలుదేరినారు. "రేపు యుద్ధమువస్తే" అనే సోవియట్ చలనచిత్రమును చూచినారు. పూర్తిగా నాజీ వ్యతిరేక చిత్రము. ఎవరేగాని రష్యాపై దురాక్రమణ ప్రారంభించినప్పుడు ఎలా శత్రువును ఎదిరించి హతమార్చవలసిందీ ఈ చిత్రములో చూపించినారు. రానున్న నాటకమునకు ఎలాంటి నాందీ ప్రస్తావన!

హాంకౌలో పరిచితులైన "ఎయిత్‌రూట్ ఆర్మీ" ఉద్యోగులనూ "న్యూ చైనా డెయిలీ" సంపాదకులను తిరిగి చుంగ్‌కింగ్‌లో కలుసుకొనినారు. వీరితోబాటు బయలుదేరిన మరికొందరు మార్గమధ్యంలో మరణించిన విషాద గాధను తెలుసుకొనినారు. "న్యూ చైనా డెయిలీ" యాజమాన్యమున వీరుల స్మరించడానికి గొప్ప సభ ఏర్పాటుచేసినారు. జాతీయ కాంగ్రెస్ తరఫున, భారత ప్రజానీకము తరఫున ఈ వీరుల గౌరవించుటకు భారతీయ వైద్యులు పుష్పచయముల తీసుకొని వెళ్ళినారు. కమ్యూనిస్టులూ, తీవ్రవాద విద్యావేత్తలు అనేకమంది సభకు హాజరైనారు.

సభాస్థలిలో సన్‌యెట్ సెన్ చిత్రపటము ప్రధానస్థానమును అలంకరించినది. చైనా జాతీయ పతాకమూ, క్యుమింటాంగ్ పతాకములు మాత్రమే ప్రతిష్ఠితమైనవి. ఎర్రజెండా ఎక్కడా కనుపించలేదు. చైనా కమ్యూనిస్టులు జాతీయపతాకమువే తమదిగా భావించినారు. సభ మూడుగంటలసేపు జరిగినది. చాలామంది ఉపన్యాసాలు చేసినారు. జపాన్ ఫాసిస్టు వ్యతిరేక బాలిక, కొరియ విప్లవకారుడు, అమెరికా పత్రికా విలేఖరికూడా ఉపన్యసించినారు. భారత వైద్యబృందము తరపున డాక్టర్ బాసు మాట్లాడినారు, చైనా భారతదేశముల బంధించుచున్న భ్రాతృభావ ప్రసక్తి రాగానే సభికుల హర్షధ్వనులు మిన్నుముట్టినవి.

* * *

ఒకరోజు సమీప పర్వతములకు వెళ్ళినారు. దారిలో కొందరు విద్యార్థులు తటస్థించినారు. ప్రభుత్వం ఇస్తూవున్న ఉచిత వేతనముతో యీ విద్యార్థులు కేంద్ర విశ్వవిద్యాలయములో విద్య నభ్యసించుతూ వున్నారు. వీరి స్వరాష్ట్రం సింకియాంగ్. ఇటు కాశ్మీర్, అటు రష్యా పొలిమేరలు అనుకొనివున్నది. రాష్ట్రి నైసర్గిక పరిస్థితి ప్రమాదకరమైనది. అనేక రాజ్యాలు సింకియాంగ్‌పై కన్నువేసినవి. మొన్న మొన్నటివరకూ, అంతర్జాతీయ రాజ్యాంగ తంత్రములకూ, కుట్రలకూ ఆలవాలమై వుండేది. ఈ రాష్ట్రీయులందరూ మహమ్మదీయులే. బ్రిటన్ అదుపు, ఆజ్ఞలలోవుండే పద్ధతిమీద 'స్వతంత్ర' సింకియాంగ్‌ను ఏర్పాటు చేయడానికి ఒకప్పుడు ప్రయత్నాలు జరిగినవి. మహమ్మదీయమతం పుచ్చుకొనివ ఒక ఆంగ్లేయుడ్ని—ఇతనిపేరు ఖలీద్ షెల్‌డ్రిక్—సుల్తాన్‌గాకూడా విశ్చయించినారు. కాని, ఈరోజున ఈ రాష్ట్రప్రజలు అందరూ చైనా కేంద్రప్రభుత్వమునకు లోబడివున్నారు. దేశభక్తిలో ఈ సికియాంగ్ విద్యార్థులు ఏ ఇతర చైనా విద్యార్థులకూ తీసిపోరు. వీరిలో చాలామంది ధారాళముగా 'హిందుస్తానీ' మాట్లాడగలరు. అనేకదఫాలు కాశ్మీర్, పంజాబ్‌వెళ్ళి వచ్చినామనికూడా వీరు చెప్పినారు.

చుంగ్‌కింగ్‌లో భారతీయ వైద్యులకు తటస్థపడిన ఒక్క భారతీయుడూ వైద్యవృత్తినే అనుసరించుతూవున్నాడు. పెషావర్ హకీమ్ ఇతను. నేత్ర వైద్యుడు. మంచి ఖాతా వున్నది. చాలాకాలమునుంచీ ఇతను చైనాలో ఉంటు

న్నాడు. షాంఘైలో వృత్తిని ప్రారంభించి ప్రజలతోబాటు ఆ పట్నంవదలి హాంకౌవచ్చి, అక్కడ్నుంచి చుంగ్ కింగ్ చేరినాడు.

* * *

అన్యదేశీయులైనా, చైనాలో వున్నంతకాలమూ చైనా పేరుతోనే వ్యవహరించాలి. భాష రాకపోయినా తమ "విజిటింగ్‌కార్డు"మీద చైనా లిపితో తమ చైనా పేరును వ్రాసివుంచాలి. చైనాపేరు పెట్టుకొననివారికి అధికార పత్రాలమీదగానీ, కోర్టుకాగితాలమీదగానీ, దస్తావేజులు వగైరామీదగానీ సంతకంచేసే అర్హత వుండదు. ప్రొఫెసర్ టాన్ యాన్ షాన్ సలహాను అనుసరించి అయిదుగురు వైద్యులున్నూ చైనా పేరులు ధరించినారు. డాక్టర్ అటాల్ అనే ఏహె (చైనా భాషలో శాంతి—కలహం) చోల్కర్ చోకై హె (చైనాభాషలో మేకాబల్ల) కొట్నిస్ కోదేహూ (చైనాభాషలో కాదగిన కలము) ముఖర్జీ ముఖేహూ (చైనాభాషలో శిల్పము) డాక్టర్ బాసు బాసుహూ (చైనాభాషలో భావన)గా మారిపోయినారు. 'హూ' అంటే చైనా అనీ, పుష్పం అనీకూడా చైనాభాషలో వాడుక. చైనా యెడల వీరికిగల గాఢాభిమానం తెలియగలందులకు పేరు చివర 'హూ' అని చేర్చినారు.

* * *

అనుకున్న ప్రకారము ప్రయాణము ఎన్నిరోజులకూ కుదరనందువల్ల స్థానిక చికిత్సాలయములలోనే పని ప్రారంభించినారు. ఇచటి రెండు వైద్యశాలలను మంచి సమర్థతతో నిర్వహిస్తున్నారు. రోగులు అందరూ మామూలువ్యాధిగ్రస్తులే. సాధారణ పౌరులు. అందుచేత వీటిలోనూ భారతీయ వైద్యులకు చేతినిండా పని దొరకలేదు.

ఇంతలో విమానదాడులు ప్రారంభమైనవి. జపాన్ వైమానికదళం హాంకౌలో విమానాశ్రయములు ఏర్పాటుచేసికొనినందువల్లా, శత్రుసేనలు వడమరగా ఇంకా ముందుకు సాగివచ్చినందుననూ జపాన్ భారీ విమానములువచ్చి చుంగ్‌కింగ్‌పై దాడి చేయసాగినవి. పరిపాలనా యంత్రమును తారుమారు చేయవలెనని, ప్రజలకు బెదరపెట్టి నిస్పృహా నిరాశాభావముల వ్యాపింపచేయవలెననే ఈ దాడులను ప్రారంభించినారు. విమానదాడి రక్షణస్థావరములు ఇంకా

ఏర్పాటు కాలేదు. అందువల్లనే ప్రతి విమానదాడీ విశేష జననష్టమును సాధించ కలుగుతూ వున్నది.

జనవరి 15 చలి అమితంగా వున్నా, సూర్యుడు బాగా ప్రకాశిస్తూనే వున్నాడు. వారంరోజులనుంచీ వున్న పొగమంచు పూర్తిగా తొలగిపోయింది. అందరూ భలే ఖులాసాగా వున్నారు. చైనా కొత్తరాజధానినిచూచి పోవడానికి జపాన్ సామ్రాజ్య వైమానిక దళమునకూ ఆదేరోజు ముహూర్తం కుదిరింది. ఇంతటి ఉపద్రవమైన విమానదాడినీ భారతీయ వైద్యులు అనుభవించి వుండలేదు. మెరుపుయుద్ధం మాదిరిగా వున్నది. కేవలం ప్రజలను భయపెట్టాలని, మన స్థయిర్యమును చెదరగొట్టవలెననే జపాన్‌వారు ఈ విమానదాడి జరిపినారు. ఆ సమయంలో భారతీయ వైద్యులు ఒక హోటల్‌లో వున్నారు. వీరి కళ్ళ ఎదుటనే ఈ విషాద నాటకప్రదర్శనము జరుగుతూవున్నది. వింతధ్వనితో పైనుంచి బాంబుల పతనం. ఇంతలో ప్రేలినధ్వని. భవనాలు కూలిపోతూవున్న మోత. విమాన విధ్వంసక శతఘ్నుల గర్జనలు, శత్రువిమానములను ఎదుర్కొనడానికి తివ్వున పైకెగిరిన చైనా విమానాల శబ్దం. క్షణంలో మరతుపాకుల టపటపలు! హోటల్ భవనం దాపున బాంబుపడినప్పుడల్లా దద్దరిల్లి పోతూవున్నది. యువతులు 'కెవ్వు' మని కేకలువేస్తున్నారు. ప్రతివానిహృదయమూ అవిసిపోయినది. పైకి మాత్రం గంభీరంగా వున్నారు.

ఉన్నట్లుండి బాంబుపడిన ధ్వని వినవచ్చేది. చెవులు బ్రద్దలౌతవా అన్నంత మోతలో బ్రద్దలయ్యేది. పునాదుల పర్యంతం హోటల్ భవనం కదిలిపోయింది. కిటికీ తలుపులకు రెక్కలువచ్చినవా అన్నట్లు అమాంతం వూడి అందరినీ దాటుకొనిపోయి ఎక్కడో పడేవి. బల్లమీదవున్న గ్లాసులూ కప్పులూ కాళ్ళువచ్చి కదలినట్లు కిందికి దూకినవి. కప్పునుంచి, గోడలనుంచి సిమెంటు బెతికలు హూతాతులైన సైనికులవలె కిందపడుతూ వున్నవి. ఆ విశాలప్రపంచం చాలనట్టు వీధిలో రేగినదుమ్మూ, ఆకాశమునంతా ఆవహించినా తృప్తిచెందని పొగలు ఎవరో వెంటబడి తరుముకువస్తున్నట్టు లోపల జొరబడినవి. దుర్గంధం! భరింప నలవిగాని చెడువాసన! ఇంతలో వాన వెలిసిన నిశ్శబ్దం. శత్రువిమానాలు వెళ్ళినవని శంఖారావము. అందరూ వీధులలోకి వచ్చినారు. రోడ్డు అవతలవైపున వున్న

ఆ ఆరు అంతస్థుల భవనమూ అణగారివుంది. పొగలురేగుతూ వున్నవి. కొంచెం గాలివాలుగావుండి ఆ బాంబు మరో 20 గజాలు ఇవతలగా పడివుంటే ఆనాటి విషాద సంఘటనను నివేదింపగలవారే ఎవ్వరూ వుండేవారుకారు. ఈ మాటలను అనుకుంటూవుంటే కడుపు దేవినట్లు వుంటుంది.

పనిచేయవలసివున్న సమయంలో, ప్రజల ప్రాణాలు రక్షింపవలసివుండగా వైద్యులు ఆత్మపరిశీలనకు గడంగకూడదు. అసలు మొదట్నుంచీ వైద్యులకు ఇలాంటి శిక్షణేవుంటుంది. క్షణంలో ఆ కూలిన భవంతివద్దకు వెళ్ళినారు. ఆ రాళ్ళ కుప్పలు, ఆ బూడిద అడుగున సజీవంగా పడివున్నవారు ఎవరైనా వున్నారేమో అని ఏ. ఆర్. పి. దళంవారు సాగించుతూవున్న ప్రయత్నాలకు తోడ్పడినారు. హృదయ విదారకదృశ్యం, పగటివేళ అవడంవల్ల పనివారంతా ఫాక్టరీలకు వెళ్ళి వున్నారు. స్త్రీలు, పిల్లలుమాత్రమే ఇంటిపట్టునవుండినారు. ఆ ఒక్క బాంబువల్ల 200 ప్రాణములు ఎగిరిపోయినవి. వికలమైన కళేబరములు చిందరవందరగా పడివున్నాయి. అన్నింటికన్నా దారుణదృశ్యం కడుపు తరుక్కుపోయే సంఘటన— తల్లి ఒడిలోవుండి పాలు కుడుస్తూవుంది పసిపాప. తల్లీ పిల్లా అదేస్థితిలోవున్నారు. కాని ప్రాణంమాత్రం పోయినది. ఊపిరి సలుపక ఉశ్వాస నిశ్వాసలు ఆగిపోయినవి. తల్లీ పిల్లా ఏకకాలంలో తనువులు చాలించినారు!

గాయాలుపడినవారందరినీ చికిత్సాలయములకు తీసుకొనిపోయినారు. రాత్రి ఎంతో పొద్దుపోయినదాకా చికిత్సచేయుచునే వుండినారు. కాంటన్, హాంకౌ, ఇచియాంగ్‌లో భారతీయ వైద్యులు విమానదాడి అనుభవముల పొందినారు. కాని ఇంతటి ఘోరమును వీరు ఈ మూడు పట్టణములలో ఎక్కడా చూచివుండలేదు. రక్తస్రవంతిలో, అగ్నిజ్వాలల్లో భారతీయ వైద్యులకు మొదటి స్నానము పూర్తి అయినది.

*  *  *

మృత్యునీడను జీవితము నూతన అర్థమును పొందుతుంది. ప్రమాదములు ఎక్కువైనకొద్దీ జీవించవలెననే వాంఛ గాఢమౌతుంది. "ఏమైతే కానీ" అనే చైనా వైమానికుల ధోరణి భారతీయ వైద్యులకు ఈ విమానదాడి అనంతరము బాగా అర్థమైనది. మరుక్షణంలో శత్రువిమానాల ప్రతిఘటించు ప్రయత్నమున ప్రాణాలు

కోల్పోవలసి వస్తుందేమో అనే జ్ఞానం వుండికూడా ఈ క్షణంలో చైనా వైమానికులు హోటల్స్‌లో ఆనందిస్తున్నారు. జీవిత పరిమాణం బహు కొద్ది. బ్రతికి వున్నంతకాలమూ బాగా అనుభవించవలెనని. ఒక్క చుంగ్‌కింగ్‌లోనేగాదు. యుద్ధ పీడిత దేశములన్నింటిలోనూ కోట్లకొలది ప్రజలు ఈ కర్మసిద్ధాంతమునకు బద్ధులై జీవితములు గడుపుచున్నారు.

* * *

చైనా ఆధునిక నాటక ప్రదర్శనమును చూడవలెననే కాంక్ష భారతీయ వైద్యులకు కలిగినది. డాక్టర్ వాంగ్‌తో కలసి "అయిదు సంవత్సరాలక్రితం షాంగై" అనే నాటక ప్రదర్శనమునకు హాజరైనారు. రాత్రి ఎనిమిదిగంటల నుంచి ఉదయం ఒంటిగంటవరకూ జరిగినది. పరిమితి మినహా భారతీయ నాటక ప్రదర్శనములకూ, రంగస్థలికీ చైనా నాటకప్రదర్శనములకూ ఎలాంటి సామ్యమూలేదు. సెట్టింగులు చాలా వాస్తవికముగా వున్నవి. షాంగై లోని కార్మిక నివాసములకు చెందిన రెండు అంతస్థుల భవనములో ఒకభాగము నాటి నాటకరంగము. అందుచేత నాటకములోని ప్రధాన భూమికల నడక, వారి సమస్యలు ప్రకటితము కావడముతోబాటు, పరిసర కుటుంబముల పరిస్థితులూ, క్లిష్టమైన జాతీయ స్థితి, పరిణామముకూడా ప్రేక్షకులకు తెలియ వీలవుతుంది.

సంభాషణలు తెలియనివారికైనా కథ తేలిగ్గా అర్థం అవుతుంది. సంభాషణలూ చమత్కారంగానూ, సమర్థులైనవారి లేఖన ఫలితములనీ, చైనీయుల హర్షధ్వనులవల్ల తెలిసినది. నాటక వస్తువు చాలా సామాన్యమైనది. ఇద్దరు మిత్రులు వున్నారు. అందులో ఒకరికి వివాహము అయినది. ఈ దంపతులకు ఒక ఆడ శిశువున్నది. వివాహితుడైన మిత్రుడు భార్యా బిడ్డను వదలి మంచూరియా వెళ్ళవలసి వస్తుంది. తన మిత్రుని రక్షణలో ఇరువురినీ వదలి వెళ్ళిపోతాడు. అక్కడ జపాన్ సైనికులకు ఖైదీగా దొరికిపోతాడు. అతన్నిగురించి అయిదు సంవత్సరములు ఏమీ తెలియరాదు. మరణించి వుంటాడని అతని అర్ధాంగి అంతరంగిక మిత్రుడూ భావించుతారు. అయిదు సంవత్సరముల సాంగత్యం ప్రేమ పరిణామమును పొందినది. భార్యాభర్తలవలె జీవించ నారంభించినారు. ఇంతలో

మొదటి అతను తిరిగివస్తాడు. తన భార్య, తన మిత్రునితో సుఖంగా కాపరం చేస్తూవుంటం కళ్ళారా చూస్తాడు. వారి సుఖజీవనానికి ఆటంకం కలిగింపరాదని నిశ్చయించుకుంటాడు. వారిని కలుసుకొనకనే వెళ్ళిపోతాడు. శత్రువును ప్రతిఘటింప సైన్యంలో చేరినాడు. అభినయము అత్యద్భుతముగా వున్నది. ఆదినుంచి అంతంవరకూ జపాన్ వ్యతిరేక ప్రచారం జరుగుతూనే వున్నది.

*　　　*　　　*

చైనాలోని విషాద వ్యవస్థకు మనవైద్యులు అలవాటుపడేటందుకు ప్రయత్నిస్తూ వున్నారు. ఇంతలో పిడుగువంటి వార్త వచ్చింది: సాయంకాలం వాహ్యాళినుంచి తిరిగి వచ్చేసరికి బల్లమీద ఉత్తరాలు కుప్పగా పడివున్నాయి. మాతృదేశంనుంచి వచ్చిన ఈ సందేశముల చూచి పరమానంద భరితులైనారు. ఎవరి జాబులు వారు తీసుకొనినారు. కొంతసేపు నలుగురు వైద్యులూ అయిదవ వారిని గురించి మరచిపోయినారు. కొంతసేపటికి విచారవదనంతో మౌనముగా కుంపటిప్రక్కన కూర్చున్న కొట్నిస్‌ను చూచినారు. కన్నీరు కాలువలుగట్టి ప్రవహిస్తూ వున్నది. తన తండ్రి తనువును చాలించినాడని క్లుప్తంగా రెండు ముక్కలు చెప్పినాడు.

కొంతసేపైన తరువాత అసలు వృత్తాంతమును తెలుసుకొనినారు. ఆనాడు బొంబయిరేవువద్ద తన పాదాలకు మ్రొక్కిన తనయుని ఆశీర్వదించుతూవుండగా తాముచూచిన పెద్ద కొట్నిస్ (డాక్టర్ కొట్నిస్ తండ్రి) షోలాపూర్ మిల్లులో ఒక గుమాస్తా నౌకరీ చేస్తూవున్నారు. తన కుమారుడ్ని బొంబాయి పంపి వైద్య విద్య చెప్పించినారు. ఈ కొడుకు చదువుకొరకు అప్పుచేసినారు. అప్పు భారమై పోయినది. కొడుకు విద్య పూర్తిచేసుకొని వైద్యవృత్తిని ప్రారంభించితే ఇంత అప్పునూ సునాయాసముగ తీర్చివేయగలడని ఆశించినారు. కాని ద్వారకనాధ్ వైద్యబృందముతో చైనాకువెళ్ళ నిశ్చయించుకొనినాడు. తండ్రి కూడదు అనలేదు. ఇంతటి ఉత్కృష్ట కార్యమును నిర్వహింప తన కొడుకు ఎన్నిక అయినందులకు గర్వించినారు. కొడుకు చైనా వెళ్ళిపోయినాడు. అప్పు అభివృద్ధి అవుతూనే వున్నది తీర్చే మార్గము గోచరించలేదు. ఆత్మహత్య చేసుకొనినారు.

అత్యంత విచారకరమైన గాధ. కుమారునికి యీ సంఘటన పరిణామం ఊహకు అందినది. మిగతా నలుగురు వైద్యులూ కొట్నీస్‌ను ఇండియాకు వెళ్ళవలసిందిగా సలహా ఇచ్చినారు. తల్లీ, సోదరిని ఓదార్చమనినారు. ఎంతటి ధైర్యశాలినైనా కుంగతీసే ఆ దుఃఖమును దిగమ్రింగి తన తత్వమును నిరూపించుకొనినాడు—"నేను ఇప్పుడు తిరిగి ఇండియాకు వెళ్ళలేను. కాంగ్రెస్ నన్ను ఇచటికి పంపినది. కనీసము ఒక్క సంవత్సరమైనా చైనాలో పనిచేయనిది ఇండియాకు రామని మనం అందరమూ ఖరారునామా సంతకం చేసినాము. నా తండ్రి అత్యద్భుతమైన త్యాగముచేసినారు. ఇంక నేను చేయవలసినదీ, చేయతగినదీ వారికి ప్రియతమమైన ఉద్యమంకొరకు నా జీవిత సర్వస్వమునూ అర్పించడమే" అని ధీర వచనముల బలికినాడు.

నాటినుంచి డాక్టర్ కొట్నీస్‌ను ఒక్కటే భావన ఆవహించినది. వీలైనంత వరకు, సాధ్యమైనంతవరకు చైనా ప్రజలలో చేరిపోయి వారి జీవితములో తన జీవితమును మేళవింపచేయ సంకల్పించినారు. ఇంకా ఎక్కువగా సేవచేయగలందులకు వారి భాష నేర్చుకొన ప్రారంభించినారు. వారి ఆచార వ్యవహారముల అలవరచుకొనుచున్నారు. 1939 జనవరి 22 వ తేదీన వైద్యబృందము యునాన్‌కు బయలుదేరగా డాక్టర్ కొట్నీస్ ముఖము అకస్మాత్తుగా వికసించినది. నూతన ఉత్సాహం, ఉద్రేకము అతనిలో గోచరించినవి. సంతోష సమయము. విజయసిద్ధిని బొందగల సుదినము ఆసన్నమగుచున్నట్లు అతను భావించినారు. తన తండ్రి అడుగులననుసరించి తన మృత్యువు కొరకు ముందుకుచూస్తున్నాడా!

---

# 11. అద్భుతమైన "అలే"

"పని చేయలేక పోవడము ఒక్కటే పరాజయము"

— మార్షల్ చాంగ్ కైషేక్.

"ఎంచేతనో కాని చైనాలో ఎవ్వరూ ఆశను వదులుకోరు. అంతా పోయింది అనే భావన కలగంగానే ఇలాంటిదేదో మహాద్భుత సంఘటన కనుపిస్తుంది. ఈ బ్రహ్మాండమైన జాతిలో నివురు కప్పివున్న, అచంచలమైన విశేష జవసత్వం గుర్తుకు వస్తుంది."

— నిమ్ వేల్స్ (చైనా బిల్డ్స్‌ఫర్ డెమోక్రసి)

"ఇప్పటికీ ఎంతో సాధించిన, మున్ముందు ఇంకనూ ఎంతో సాధింపగలదనే నమ్మకమును కలిగించు అవిశిష్ట పరిశోధన....చైనా అనుభవము మనకత్యంత ప్రయోజనకరము. ఆ అనుభవము నుండి మనం ఎంతో నేర్చుకొనగలమని నా గట్టి నమ్మకము."

— జవహర్‌లాల్ నెహ్రూ ("చైనా బిల్డ్స్‌ఫర్ డెమోక్రసీ" ఉపోద్ఘాతంనుంచి)

•

చుంగ్‌కింగ్‌పై ఆనాటి విమానదాడి మరణభీతికంటే మహా భయంకరమైనది. విచ్చల విడిగా విమానాలు ఆకాశంలో విహరిస్తూ బాంబులు విసరడంచేత ఎప్పుడు, ఎక్కడ బాంబు పడుతుందో ఏమీ తెలియలేదు. ఒక లక్ష్యం అంటూ వైమానికులకు ఏమీలేదు. క్షణందాటితే ఏమి జరుగుతుందో ఎవ్వరికీ తెలియదు. బ్రతికి ఇతరుల బ్రతుకు చూస్తామో ? లేక బాంబులకు బలి అయిపోతామో ? తెలియదు. ఈ జీవన్మరణముల సందిగ్ధ వ్యవస్థలో ప్రతి ఒక్కరూ ఎన్నిమారులో మరణించి వుంటారు. బలుసాకైనా తిని బ్రతుకుదామని వాంఛించడం సహజమే. ఈ సహజ స్వాభావిక వాంఛలో అందరి అనుభవములూ, భావనలూ కలసిపోతవి.

బాంబుల వర్షము ప్రారంభమైనది. ప్రజలు ప్రాణరక్షణకు పరుగులెత్తుచున్నారు. దాదాపు రెండువందలమంది భారతీయ వైద్యులుండిన హోటలు భవన

ములో జొరబడినారు. భయభ్రాంతులై ప్రాణములను పిడికెట్లో పట్టుకొని, పెద వులు కదల్చక మూల కూర్చొనినవారు కొందరు, శూన్యమును చూస్తూవున్నట్లు, భావరహితమైన దృక్కులతో నిలబడివున్నవారు మరికొందరు. అంతవరకూ పదార్థాల సేవించుతూ వున్నవారు అప్రయత్నముగా చేతులలోని చాప్‌స్టిక్స్ (ఇంగ్లీషువారి ఫోర్కులకూ, స్పూనులకూ చైనావారి ప్రత్యామ్నాయం)ను వదలినారు. పళ్ళెములలోని పదార్థములు చల్లారిపోయినవి. తమదిక్కు చూచేవారులేక దిగులుపడి బల్లలమీద అలాగే వుండిపోయినవి పళ్ళెములు. ఆ సందిగ్ధ సమయంలో, ప్రళయతాండవాన్ని ప్రత్యక్షముగా చూస్తూవుండగా తిండిమీదకి ధ్యాస ఎలాపోతుంది ?

అందరిలోనూ, పీరెత్తిన నిమ్మవలె, నిశ్చలముగా తనచుట్టూ ఏమి జరుగుతూవున్నదీ గుర్తించనట్టు, పదార్థముల పొదుపుచేస్తూవున్న పెద్దమనిషి ఒక్కడు కనుపించినాడు. విపరీతంగావుంది ! అందరిదృష్టినీ ఆకర్షించిన ఈ అద్భుత వ్యక్తే 'అలే'. చేతిలో బొంబయి క్రానికల్ పత్రిక వున్నది. మధ్యవయస్కుడు. యూరపియన్ పద్ధతిని దుస్తుల ధరించివున్నాడు. తింటూనే మధ్యమధ్య పత్రిక చదువుతూ వున్నాడు.

ఈ చోద్యం భారతీయ వైద్యులనూ ఆకర్షించినది. ఆ బల్లదగ్గరకు వెళ్ళినారు. అతడు తన పనిమానివేసి ఒకసారి పరీక్షగా పత్రికచూచి, వీరినిచూచారు. మళ్ళా పత్రికను చూచి మందహాసంచేసి "కూర్చోండి" అన్నాడు. "నాపేరు రెవీ అలే. మీరు భారతదేశమునుంచి వచ్చిన వైద్యులు అనుకుంటాను. దయచేయండి" అని ఎంతో అప్యాయంగా అన్నారు. ఆ క్రానికల్ పత్రికలో అప్పుడే భారతీయ వైద్యబృందం ఛాయా చిత్రములను చూచినారు. అందుకు సంబంధించిన వార్తలను చదివినారు. అందుచేతనే వీరిని అంతవేగిరం పోల్చగలిగినారు. "ఇరవై గజాల దూరంలో రోడ్డు అవతలే అలా బాంబులు పడుతూవుంటే మీరిలా ఇక్కడ కూర్చోవడం కొంచెం విపరీతముగా కనుపించింది" అని భారతీయవైద్యులు అన్నారు. "ఇంత మేలురకం విందును, రుచికరమైన పదార్థములను వృథాచేస్తే ఏమి ప్రయోజనం ? నేను మరణించవలసివస్తే క్షుద్బాధా విర

హితుడనై, సంతుష్టుడనై చనిపోవడము మంచిది!" అని తడవుకోకుండా వెంటనే జవాబు చెప్పినారు.

'అలే' సంయోగం వీరికీవిధంగా సంప్రాప్తించినది. తరువాత వీరిని గురించి వైద్యబృందం వివరముగా తెలుసుకొనినారు. జన్మభూమి న్యూజిలాండ్. చైనా మాతృభూమి అయినది. తన జీవితమును, తన సర్వస్వమును చైనాప్రజల క్షేమముకొరకు అర్పించినారు. ఈ అపూర్వ, ఆశ్చర్యకరమగు వ్యక్తినిగురించీ, అతడు సృష్టించి, పెంచి, పోషించి, పెద్దచేసిన చైనా పారిశ్రామిక సంస్థలను గురించీ భారతీయ వైద్యులు అనతికాలములోనే ఆమూలాగ్రముగా తెలుసుకొనినారు.

గత ప్రపంచసంగ్రామమున మిత్రరాజ్యముల తరపున యీయన పోరాడినారు. యుద్ధం ముగిసిన తరువాత యుద్ధ లక్ష్యాలకూ, శాంతి ఆచరణకూ వుండిన వ్యత్యాసం అతని విభ్రమమునకు కారణమైనది. గొప్ప సంపర్కమును పొందినవి వీరి లక్ష్యములు. మంచి పట్టుదలగల వ్యక్తి. సాంఘిక న్యాయమునకు సంబంధించిన ప్రతి విషయములోనూ ఆసక్తి అధికముగా వున్నది. అభివృద్ధి కరమగు, అభ్యుదయభావములు వీరికి వారసత్వరీత్యా సంక్రమించిన స్థిరాస్థి! తండ్రి బడిపంతులు. సహకారపద్ధతులపై సాగు విధానము వారి అభిమానవిషయము. ఇక తల్లి న్యూజిలాండులో స్త్రీలకు వోటింగ్ హక్కు కావాలని తీవ్రాందోళన ప్రారంభించి, నిర్వహించిన ప్రథమ స్త్రీ. యుద్ధము ముగిసినతరువాత మేకల పెంపకం ప్రారంభించి ఒక "ఫారమ్" (మేకల వేనవేలు పెంచు దొడ్డి) ను ఏర్పాటుచేయ ప్రయత్నించినారు. లాభసాటిగానేవున్నా, కొంతకాలం అయిన తరువాత మొత్తం తెగనమ్మి చైనాకు బయలుదేరినారు. చైనాలో ప్రారంభమైన ఈనవ విప్లవం విషయం తెలుసుకోవాలనే జిజ్ఞాస పట్టుకొనినది. చైనావచ్చి షాంఘై పురపాలక సంఘములో యంత్రాగారముల ఇన్‌స్పెక్టరు ఉద్యోగమును సంపాదించినారు. ఉద్యోగములో చేరేసరికి చైనా విప్లవ లక్ష్యాలయెడల వీరికి అభిమానం కలిగినది. చైనా రాజకీయ సేవకులతోనూ, అరక్షిత నిరక్షర ప్రజలతోనూ సంపర్కం కలిగినది. వీరి అభ్యుదయంకొరకు కృషి చేయాలని కృతనిశ్చయులైనారు. యంత్రాగారముల తనిఖీ సందర్భములలో కార్మికుల అల్ప

వేతనములు, వారి దుర్భర జీవిత పరిస్థితులనూ ప్రత్యక్షముగా తెలుసుకొనినా ప్రమాదముల నివారించుటకు ఎలాంటి పరికరములూ లేవు. పరిహార పద్ధతీ లేదు. భీమా పద్ధతీ లేదు. చికిత్సా సౌకర్యములు మృగ్యం. తమ ప్రాపకమును, అధికారమును వినియోగించి చైనా పారిశ్రామిక కార్మికుల స్థితిని చాలావరకు బాగు చేసినారు. సమ్మెలు జరిగినప్పుడు మధ్యవర్తిగావుండి కార్మికులకు కొంతమేలు చేస్తూవుండేవారు. వీటి ఫలితముగా షాంఘైలోని కార్మిక కుటుంబములకు వీరిపై ప్రత్యేక అభిమానము ఏర్పడినది. గౌరవంగా, భక్తితో చూస్తూవుండేవారు. యంత్రాలయ యజమానులున్నూ వీరి ఋజువర్తనం, ధార్మికబుద్ధి, నిష్పక్షపాత విధానమూచూచి భయపడేవారు. ప్రతిసంవత్సరం చివరను తమ సెలవును చైనా గ్రామాల సంచారమునకు వినియోగించేవారు. గ్రామ పరిశ్రమల పరిశోధించినారు. గ్రామీణుల భాషను నేర్చుకొనినారు. ఆచారముల అలవర్చుకొనినారు. చైనా ప్రజలలో ఒకరైపోయినారు. 1928—29 లో సంభవించిని సుయన్ క్షామము లోనూ 1931 లో వచ్చిన యాంగ్ట్సీ వరదలలోనూ నష్టపడిన, బాధలపాలైన ప్రజలకు ఎంతో సహాయముచేసినారు. ఆ సందర్భములలో తలితండ్రుల కోల్పోయిన ఇరువురు చైనా బాలురను చేరదీసి తన స్వంత కుమారులవలె పెంచుతూవచ్చినారు. దీనితో వీరు పూర్తిగా చైనీయులై పోయినారు.

యుద్ధకాలపు చైనా పునర్నిర్మాణంగురించి 1938 ఆగస్టులో వీరికొక భావన తట్టినది. అమెరికన్, చైనీస్ మిత్రులతో చర్చించి దేశమంతట పారిశ్రామిక సహకార సంస్థలను (ఇండస్ట్రియల్ కో ఆపరేటివ్స్) స్థాపించడానికి ఒక నక్షా తయారుచేసినారు. ఆలోచన రావడమే ఆలస్యం. వెంటనే ఆచరణలోకి రావలసిందే వీరి విషయములో. చైనా ఇంజనీర్ల కృషి ప్రభుత్వ సహాయములతో పథకము ప్రత్యక్షరూపమును బొందినది.

(1) వీరి నక్షా లక్ష్యములు మూడు. పారిశ్రామికముగ చైనా స్వయంపోషకము కావాలి. జపాన్ దిగ్బంధనమువల్లా, జపాన్ అధీన ప్రాంతములనుంచి చవుక సరుకు దిగుమతి కావడమూ ఇందుకు అంతరాయములైనవి. యుద్ధ పరిస్థితులు పెద్ద యంత్రాలను తెప్పించుటకు అనుకూలముగా లేవు. అందుచేత

వున్న సాధన సంపత్తితోటే పని ప్రారంభంచేసి ఫలితములను సాధించ వలసి వచ్చినది.

(2) జపాన్ బాంబులకు అందని ప్రాంతములలో పెద్ద పరిశ్రమలను నెల కొల్పవలసి వున్నది. ఒక ప్రాంతమునుంచి మరొకప్రాంతమునకు క్షణంలో కదల్పడానికి అనుకూలముగా యంత్రములను ఏర్పాటు చేయవలసి వున్నది.

(3) లక్షలాది నిరక్షతులకు, ఆశ్రితులకు, కాందిశీకులకు, తలితండ్రులు లేని బాల బాలికలకు, యుద్ధమువలన వితంతువులైన వనితలకు మంచి ప్రమాణము గల జీవితమును ఏర్పాటుచేయవలయును.

గ్రామములలో సహకార పద్ధతిపైన పరిశ్రమల నభివృద్ధిచేయుటద్వారా అలే, వారి అనుచరులూ ఇంకా ఏదో మహోన్నత లక్ష్యమును సాధించవలెనను కొనినారు. దైనందిన వ్యవహారములలోని ఈ సహకారము చైనా ప్రజకు ప్రజా స్వామిక విధానమున మంచి అనుభవమును, పరిజ్ఞానమును లభింపచేస్తుందను కొనినారు. అంతేగాదు. ఆత్మ విశ్వాసము, స్వశక్తిపై ఆధారపడివుంటమూ, ఎంత పనినైనా సరే చేయడానికి ఉత్సాహులు కావడము, చైతన్యంపొందిన దేశ భక్తులవలె శత్రువును ఎదుర్కొనకలగడమూకూడా చైనా ప్రజలకు ఈ సహకార పద్ధతివల్ల సాధ్యమౌతుందని ఆశించినారు.

భారతీయ వైద్యబృందముతో వీరున్నూ చుంగ్‌కింగ్‌నుంచి యెనాన్‌కు బయలుదేరినారు. 'అలే'ను గురించిన్నీ, వారి కృషినిగురించిన్నీ ఇంకా ఎక్కువగా తెలుసుకొనడానికి భారతీయ వైద్యులకు అవకాశము కలిగినది. హాంకాలో 1938 జులైలో పారిశ్రామిక సహకార సంస్థల కేంద్రమును స్థాపించినారు. హాంకౌ శత్రుసేనలకు అందుబాటులోకి వస్తూవున్నదనే అనుమానం తగలగానే సంస్థను మొత్తముగా మార్చివేసినారు మరోచోటికి. భారతీయ వైద్యులు హాంకౌ రావడానికి కొద్దిరోజులక్రితం ఈపనిఅంతా జరిగినది. ఒక వెయ్యిమంది రక్షణ రహితులను, యంత్రసామాగ్రినీ పశ్చిమోత్తర ప్రాంతమునకు మార్చివేసి అక్కడ ఒక కార్యస్థానమును ఏర్పాటుచేసినారు. ఈ కో ఆపరేటివ్‌స్‌కు అప్పు లను ఏర్పాటు చేయడానికి కాంటన్ వెళ్ళినారు. హూనాన్, క్యాంగ్సీల్లో వీటి శాఖ లను నెలకొల్పినారు. అనేకదఫాలు అతి చాకచక్యంగా జపాన్ బాంబులను

తప్పించుకొని చుంగ్‌కింగ్ చేరినారు. తిరిగి ఇప్పుడు భారతీయవైద్యులతో పశ్చిమోత్తర ప్రాంతమునకు బయలుదేరినారు. స్వచ్ఛమైన చైనా భాష మాట్లాడుతారు. అందుచేత భారతీయ వైద్యుల యునాన్ యాత్ర సుకరమైనది. పడవ సరంగులకు, కారు డ్రైవర్లకు ఎలా చెప్పాలో అలా చెప్పి ప్రయాణం సుఖప్రదం చేసినారు.

యునాన్ యాత్రికులు చుంగ్‌కింగ్‌నుంచి బయలుదేరిన తరువాత మూడు రకముల ప్రమాదములను ఎదుర్కొవలసివుంటుంది. అవి ముందుగానే యాత్రికులకు హెచ్చరిక చేసినారు.

రహదారి యేమీ బాగుండదు. అసలు కొంతదూరం రోడ్డు అంటూ ఏమీ వుండదు. శత్రువిమానములు ఈ దారిమీద నిరంతరం దాడులు చేస్తూనే వుంటవి. సియాన్‌ను శత్రుసేనలు ఆక్రమించివేస్తే యెనాన్‌లో వుండిపోయిన భారతీయ వైద్యులకు అటు ఇండియాతోనూ, ఇటు చుంగ్‌కింగ్‌తోనూకూడా సంబంధం తెగిపోతుంది. ఈ మూడు ప్రమాదములనూ ఎదుర్కొనడానికి సిద్ధపడి భారతీయ వైద్యులు బయలుదేరవలసివున్నది.

పోరాటము యెనాన్‌లోనే ముమ్మరంగా వున్నది. అక్కడే వైద్యసహాయం అత్యంతావశ్యకము. ఈ రంగములోనే "ఎయిత్ రూట్ ఆర్మీ", కమ్యూనిస్టు గెరిల్లాలూ యుద్ధము సాగించుతూ వున్నారు. ఎన్ని ప్రతిబంధకములు ఏర్పడినా, ఎన్ని ప్రమాదములను ఎదుర్కొనవలసివచ్చినా యెనాన్‌కు బయలుదేరి వెళ్ళడానికే వీరు నిశ్చయించుకొనినారు.

చుంగ్‌కింగ్‌నుంచి నైకియాంగ్ వెళ్ళినారు. అక్కడ డాక్టర్ కొట్నీస్ మిత్రులు డాక్టర్ హాంగ్‌ను భారతీయవైద్యులు కలుసుకొనినారు. ఇతడు ప్రభుత్వోద్యోగంలోవున్న చెరుకుటెక్నాలజిస్ట్. ఇదివరలో ఇండియావచ్చి చెరుకుపంట పరిశీలన సాగించినారు. నైకియాంగ్ ఆవల అంతా చెరుకుపంటలే. ప్రయాణం చేస్తూవుంటేనే పర్వతములమీద వరిపొలాలు, చెరుకుతోటలు విరివిగా కనిపిస్తూ వుంటవి. రోడ్డు పొడవునా, అతి సారవంతమైన భూభాగములలో ఇదొకటి. అయినా రైతుల దారిద్ర్యం దుర్భరంగా వున్నది. వారి పేదరికం భయానక

ముగా వున్నది. ప్రకృతి సంపద ఫలితాలను అన్నిటినీ భూస్వాములే అనుభవించుతూ వున్నారు.

రెండు రోజులు ప్రయాణముచేసి జెకువాన్ రాష్ట్రి రాజధాని చెంగ్టూను చేరినారు. ఇది అతిప్రాచీన నగరం. వెడల్పులేని వీధులు. పట్నం మహా అపరిశుభ్రముగా ఉంటుంది. దాదాపు రెండులక్షలమంది ఇక్కడ నివసించుతూవున్నారు. వూరు వెలుపల పశ్చిమ చైనా విశ్వవిద్యాలయం ఏర్పాటుచేసినారు. కోస్తా ప్రాంతములనుంచి వచ్చిన అనేక కళాశాలలకూ, విశ్వవిద్యాలయములకూ జీవి ఇది. అమెరికన్ మిషనరీలు స్థాపించిన నాన్‌కింగ్ విశ్వవిద్యాలయమునూ ఈ విశ్వవిద్యాలయములోనే చెర్చినారు. వందలకొలది మైళ్ళు నడిచి విద్యార్థులూ, అధ్యాపకులున్నూ తమ పరిశోధనాలయాల సైతం కదుల్చుకు వచ్చినారు యిచ్చటికి.

భారతవైద్యులు ఇక్కడే నాలుగురోజులు వుండవలసి వచ్చినది. నూతనముగా స్థాపితమైన పారిశ్రామిక సహకార సంస్థలను పరిశీలించుటలో 'రవీ అలే' నిమగ్నులై పోయినారు. ఇక్కడి సంస్థలు అన్నీ నూలు తీయడమూ, బట్టలు నేయడము మాత్రమే ప్రస్తుతం జరుపుతూవున్నవి గంట గడిచినకొద్దీ చలి ఎక్కువ అవుతూవున్నది. భారతీయ వైద్యులు అదనముగావున్న గుడ్డలను కొనుక్కోవలసివచ్చినది.

చెంగ్టూనుంచి ప్రయాణం మరీ కష్టమైనది. రోడ్డు ఏమీ బాగులేదు. గోతులు, విపరీతమైన మెరక పల్లాలు. వెడల్పు ఏమీ లేదు. కొండలమీదుగ ప్రయాణం. బండి ఎటు కొంచెం వొత్తిగిలినా గల్లంతే. చలి పైనబడి పీకుతూ వున్నట్లు బాధగా వున్నది. ఒకటి రెండు వున్ని గుడ్డలు కప్పుకున్నా చలి ఆగడం లేదు. బయలుదేరిన నాటి రాత్రి ఒక రైతుయింట మకాముచేసినారు. చుట్టూ గోడలున్నాయి గాని పైన కప్పులేదు. అంత చలిలోనూ, అతని ఆతిధ్యంలో వెచ్చదనం కనిపించినది. ఇండియానుగురించి అతను ఎన్నడూ వినివుండలేదు. బుద్ధభగవానుని జన్మభూమి ఇండియా అని 'రవి అలే' ఆ రైతుకు చెప్పినాడు. కాని అతడు నమ్మలేదు. "బుద్ధుడు చైనాలోనే పుట్టివుండాలి. గౌతముడు నూటికి నూరుపాళ్లు చైనీయుడు" అని ఎంతో వాదించినాడు ఆ రైతు.

తెల్లవారింది. గాలి మరీ దారుణముగా వున్నది. చలిబాధ ఎక్కువైనది. మార్గమూ సరిగా లేదు. అలాగే జూకన్ రాష్ట్రమునువదలి షాన్సీరాష్ట్రమును ప్రవేశించినారు. పత్తి మూటల మోసుకుపోతూవున్న ఒంటెల సమూహాలు వీరికి ఎదురైనవి. రోడ్డుమీది మార్గసూచికలు చైనా రష్యా బాషలలో వున్నాయి. రష్యా భాషలోకూడా ఎందుకు వ్రాసినారు అని మరొకర్ని అడుగవలసిన అవుసరం లేకనే వారికి సమాధానము తెలిసినది. పెట్రోలు, మందుసామాగ్రిని తీసుకొని రష్యన్ ట్రక్కులు ఎదురుగా వస్తూవున్నవి.

ఆ రాత్రి హాంచంగ్‌లో గడిపినారు. ఇది ఒకప్పుడు హాన్ చక్రవర్తుల రాజధాని. ఇక్కడా అనేక "కో ఆపరేటివ్"లు పనిచేస్తూవున్నవి. మరికొన్ని సంస్థలను స్థాపించుటకు ప్రయత్నములు జరుగుతూవున్నవి. 'సిమోసుయిపో'లో 'అలే' ఏర్పాటుచేసిన ఈ సంస్థలు అత్యద్భుతంగా పనిచేస్తూవున్నవి. ఇతరప్రాంతములలోని సంస్థలు కొనుగోలు వస్తుసామాగ్రని తయారుచేస్తూవుండగా ఇక్కడి సంస్థలు ఆయుధ సామాగ్రని ఉత్పత్తిచేస్తూ వున్నవి. భారతదేశంలోని పశ్చిమోత్తర రాష్ట్రములోని కొండజాతులవారి తుపాకీ ఫాక్టరీలను పోలివున్నవి ఇవి. వేషభాషలలోగాని, ఆచార వ్యవహారములలోగాని ఇచటివారికీ, ఇతర ప్రాంతీయులకూ ఏమీ తేడాలేదు. ఈ సంస్థల్లో పనిచేసే కార్మికులు భారతీయ వైద్యులకు విందు ఏర్పాటు చేసినారు. భారతదేశమునుగురించి అనేక ప్రశ్నలు అడిగినారు.

అనతి కాలముననే ఈ సంస్థలు సాధించిన అద్భుత ఫలితములు ప్రతియంత్రాగారములోనూ కనిపించుతూనే వున్నవి. కార్మికులు ఎంతో కష్టపడి పనిచేస్తారు. తెలివి తేటలు గలవారు. ఆత్మబలం, విశ్వాసం కలిగి స్వయకృషిపైననే ఆధారపడి వుంటున్నారు. ఇతర పేద చైనావారందరికంటే ఎంతో పరిశుభ్రముగా ఉంటున్నారు. అందరూ నిష్కల్మష దేశభక్తులు. ప్రాంతీయ సాంఘిక పునర్నిర్మాణమునకు ఈ పారిశ్రామిక కేంద్రములు మూలములు. పనిపాటలవారి కృషి, శ్రద్ధ ఫలితముగ, వయోజన విద్యాలయములూ, గ్రంధాలయములూ, చికిత్సా కేంద్రములూ ఏర్పడినవి. యంత్రాలయముల, విక్రయశాలల గోడలపై ఉద్రేకపూరితమగు నినాదములు కొట్టవచ్చినట్లున్నాయి.

"పారిశ్రామిక సహకార సంస్థలు, వాస్తవంగా, పనిచేయువారి దుకాణములు."

"జపాన్ బహిష్కరణ కివి మార్గములు."

"పరిశ్రమే ఆరోగ్యం. ఆరోగ్యం అంటే ఎక్కువకృషి. మనసంఘములో కష్టపడి పనిచేసేవారికే తిండి."

"ఒకదఫా విమానదాడి జరిగి విధ్వంసమైతే ఒకదఫా నిర్మించుతాము. పది పర్యాయములు జరిగితే పది పర్యాయములు నిర్మాణము చేస్తాము."

లూంగై రైల్వేకొసను పావుచీవద్ద పశ్చిమోత్తర ప్రాంతానికి కేంద్రమును ఏర్పాటుచేస్తూవున్నారు. సైనికులకు పాదరక్షలు, అంగరకములు, ఉన్ని జంపఖానాలూ, సబ్బులు, ఇతర వస్తువులు మొదలైన వాటిని ఉత్పత్తిచేయు కేంద్రములు ఇదివరకె ఏర్పడివున్నవి. సంతృప్తికరముగ ఉత్పత్తి సాగుతూవున్నది. ఈ "చైనాఇండస్ట్రియల్ కో ఆపరేటివ్స్" (సి. ఐ. సి.)కు ప్రత్యేకముగ విద్యాలయములు, బోధన తరగతులు, స్టోర్లూ, క్లబ్బులు వున్నవి. స్థానిక మేజస్ట్రేటు వాంగ్ ఫెంగ్ జూ కృషి ఫలితముగ ఇచ్చటి పారిశ్రామిక సహకార సంస్థలు (సి. ఐ. సి.) బాగా అభివృద్ధి చెందినవి. వాంగ్ మంచూరియావాసి. జపాన్ దండయాత్ర తరువాత ఆ దేశమును వదలివచ్చినారు. జపాన్‌వారంటే మంట. "మన ప్రాచీన ప్రాంతముల చేరువరకూ పోరాడండి" అనే మంచూరియా వారందరికీ వీరి సందేశము. భారతీయ వైద్యుల విషయమై వీరు ప్రత్యేక శ్రద్ధ తీసుకొనినారు. భారతీయుల ఆగమన సందర్భమున ప్రత్యేకముగ విందు ఏర్పాటుచేసినారు. బ్రహ్మాండమైన పౌర సభ జరిపినారు. సైనికులూ, కార్మికులూ దాదాపు అయిదువేలమంది హాజరైనారు. ఇది ముస్లిం ప్రాంతం. అంచేత డాక్టర్ అటాల్ ఖురాన్‌నుంచి చదువుతూ చైనా ముస్లిం ప్రజల గాఢ దేశభక్తిని కొనియాడినారు.

* * *

కారుల్లో పెట్రోలు అయిపోయినది. అంచేత సియాన్‌కు రైలులో బయలుదేరినారు. ఇంకనూ చైనావారివశం తప్పని కొద్ది రైలుమార్గములలో ఇదొకటి. రైలుపెట్టె బాహ్యభాగం తుపాకి తూటవల్ల వికారంగావున్నదేగాని లోపల అంతా

బాగానే వున్నది. ప్రొద్దుగ్రుంకే సమయమునకు షాన్సీ రాజధాని సియాన్‌ను చేరినారు. ఇచట సైనిక సంచలనము చాలా ఎక్కువగా వున్నది.

1937 లో సియాన్ ప్రపంచఖ్యాతి గాంచినది. ఈ ఖ్యాతి చైనా చరిత్రలో ఆచంద్రార్కం అలా నిలబడిపోతుంది. చాంగ్ కై షెక్‌నూ, వారి సైనిక బృందమునూ కమ్యూనిస్టులు ఇక్కడనే ఖైదుచేసినారు. కమ్యూనిస్టులపై కయ్యాన్ని మాని, జపాన్‌పై ఐక్య సంఘటిత ప్రతిఘటనను ప్రారంభింప చాంగ్ అంగీకరించినారు. నేడు భారతీయ వైద్యులున్న వసతి గృహములోనే చాంగ్ సైనికోద్యోగులు కమ్యూనిస్టుల ఖైదీలుగా వుండిపోయినారు. కమ్యూనిస్టు సేనాని చాంగ్ సూలియాంగ్ వేసిన ఈ ఎత్తు ఫలితముగానే యెనాన్—చుంగ్‌కింగ్ సమాధానం కుదిరి జపాన్‌పై సంయుక్త, ఐక్య ప్రతిఘటన ప్రారంభమైనది.

యెనాన్‌కు ఇక్కణ్ణుంచే బయలుదేరాలి. ఉత్తరమున జరుగు గెరిల్లా యుద్ధప్రాంతమునకూ ఇక్కడనుంచే దారి. అందుచేతనే ఎయిత్‌రూట్ ఆర్మీవారు ఇచట ఒక "సంపర్క కార్యస్థానము" (లైసాన్ ఆఫీసు)ను ఏర్పాటుచేసినారు. సరిహద్దు రాష్ట్ర ప్రభుత్వ అధ్యక్షులు విన్‌పాయ్‌చూను భారతీయ వైద్యులు ఇక్కడనే కలుసుకొనినారు. పొడగరి. జుట్టు రజతవర్ణం, అయినా అందంగానే వుంటారు. వీరు చుంగ్‌కింగ్ వెళుతూవున్నారు. ఆరితేరిన విప్లవమూర్తి. సన్ యట్‌సెన్ సహచరుడుగ వుండి పనిచేసినారు. క్యుమింటాంగ్ సంస్థాపకులలో ఒకరు. 1927 లో చాంగ్ కై షెక్‌తో విడిపోయి, కియాంగ్సీ వెళ్ళి కమ్యూనిస్టులతో కలసిపోయేవరకూ క్యుమింటాంగ్ ముఖ్యులలో ఒకరు. ఇప్పుడు వీరికి ఉభయపక్షములలోను మంచి ప్రాపకము వుంది. ఐక్య ప్రతిఘటన ఉద్యమ నిర్వాహకులలో ప్రముఖులు. ఇటు కమ్యూనిస్టువర్గములలో గౌరవస్థానమును ఆక్రమించినప్పటికినీ ఇటు క్యుమింటాంగ్ కేంద్ర కార్యవర్గంలో ఇటీవలనే సభ్యులుగా నియమితులైనారు.

"ఎయిత్‌రూట్ ఆర్మీ" చరిత్రను సవిస్తరముగా భారతీయ వైద్యులకు నివేదించినారు—"ఈ సేన నేడు చాంగ్ కై షెక్ నాయకత్వమున కేంద్రప్రభుత్వానికి చెంది జపాన్ సేనలను ప్రతిఘటిస్తూ వున్నది. అయితే ఒక్క తేడామాత్రము వున్నది. ఈ సైన్యము, కేవలము ఒక్క చైనా స్వాతంత్ర్యం కొరకేకాక పరా

ధీన దేశములన్నింటి, ముఖ్యముగా తూర్పు దేశముల విముక్తి, సంపూర్ణస్వాతంత్ర్యంకొరకు పోరాడుతూవున్నది. అందువల్ల ఈ సైన్యము అన్ని సామ్రాజ్య శక్తులకూ ప్రతికూలము. ఈ సందర్భములో అయితే మీరీ సైన్యమును భారత ప్రజల సైన్యము అనికూడా అనవచ్చును" అని లిన్ చెప్పినారు.

సియాన్‌లోని "ఎయిత్‌రూట్ ఆర్మీ" కార్యాలయములో భారతీయ వైద్యులకు విందు ఏర్పాటుచేసినారు. "జాతీయ విమోచన గది"లోనే ఈ విందు జరిగింది. క్యూమింటాంగ్—కమ్యూనిస్టుల ఒడంబడికకు పూర్వము ఈగదిని "లెనిన్ కార్నర్" అని పిలుస్తూ వుండేవారు. డాక్టర్ అటాల్ భారతస్వాతంత్ర్యోద్యమ చరిత్రను వివరించుచూ ఉపన్యాసము చేసినారు. ఉపన్యాసము తరువాత పాటలు ప్రారంభమైనవి. అందరూ తమ తమ జాతీయ విప్లవ గీతములు గానముచేసినారు. భారతీయ వైద్యులున్నూ పాడవలసివచ్చినది. ఒక చైనా బాలకవి భారతీయ వైద్యులకు స్వాగతం ఇస్తూ కొన్ని పాటలు పాడినారు, గెరిల్లా పాట ఒకటి పాడినారు. అంతా జపాన్ వ్యతిరేక ప్రచారమే. అ పాట భావము ఇలావున్నది—

"తినతిండి లేదు మాకు
అయినా జపాన్ సేనల ప్రతిఘటిస్తాం
పరుండ పంచయినా లేదు
అయినా జపాన్ సేనల ప్రతిఘటిస్తాం."

తుపాకి నృత్యముతో విందు ముగిసినది. ఈ నృత్యము సరిహద్దు ప్రాంతములోని అఫ్రిడీ జాతివారి నృత్యముల జ్ఞప్తికి తెచ్చినది. నృత్యం ఆఖరిఘట్టము "జపాన్ సైనికుని హత్య"—సూచనప్రాయముగా జరిగినది.

ఇక్కడే ఒక తమాషా జరిగినది. భారతీయ వైద్యులు లిన్‌ను కలుసుకొనినప్పుడల్లా వీరి అంతరంగిక కార్యదర్శి భారతీయవైద్యులను ప్రత్యేకంగా ఆకర్షిస్తూ వుండేవారు. ఎయిత్‌రూట్ ఆర్మీ దుస్తుల ధరించి కల్తీలేని ఇంగ్లీషు ప్రసంగించేవారు. లిన్‌కూ వైద్యులకూ మధ్య ద్విభాషిగా పనిచేసినారు. ఇంతా ఆ కార్యదర్శి డాక్టర్‌లు తలంచినట్లు చైనా యువకుడు కాదని, ఎయిత్‌రూట్ ఆర్మీతో పనిచేస్తూవున్న చైనా యువతి అని కొన్ని వారములతరువాత యెనాన్‌లో తెలుసుకొనినారు.

* * *

యెనాన్‌కు వీరు బయలుదేరడానికి పూర్వము 'రవీ' పావుచీపోయి పెట్రోలు తీసుకురావలసి వున్నది. పెట్రోలువచ్చి ప్రయాణము సాగేలోపున కొన్ని విమానదాడులు జరిగినవి. ఈ సరికి విమానదాడులు వాటి ప్రాధాన్యమును కోల్పోయినవి. సియాన్ నగరమునకు 50 కిలో మీటర్ల దూరములోవున్న లింటంగ్‌కు వెళ్ళినారు. వెనుక చాంగ్‌ను బంధించిన ప్రదేశమునగల "స్మారక చిహ్నము"ను చూచినారు.

యెనాన్ వెళ్ళివచ్చిన వైద్యులను అనేకమందిని కలుసుకొనినారు. తామచట ఎదుర్కొనవలసివుండు సమస్యలనుగురించీ, అక్కడి పరిస్థితులను గురించి భారతీయ వైద్యులు వీరినుండి తెలుసుకొనినారు. అచటి పరిస్థితులను డాక్టర్ సి. సి. చాంగ్, శ్రీ కెనడా మిషనరీ వైద్యులు డాక్టర్ బ్రౌన్ వివరముగా చెప్పినారు.

ఈ పరిజ్ఞానముతో ఫిబ్రవరి 10 వ తేదీన "ఎయిట్‌రూట్ ఆర్మీ" మోటారు బండిలో భారతీయ వైద్యులు అయిదుగురున్నూ యెనాన్‌కు బయలుదేరినారు. చెంగ్టూ, సియాన్ పట్టణములలోకంటేకూడా ఇక్కడ చలి మరీ ఎక్కువగా వున్నది. ఎటుచూచినా మంచు గుట్టలు. మార్గ పరిసరములు సున్నపు బట్టీలవలె, తెల్లగా వున్నవి. ఈదారివెంట ప్రయాణము యావత్తూ ప్రమాదములతో కూడు కొని వున్నది. సింకియాంగ్‌నుంచి ఔషధములనూ, తదితర సామాగ్రినీ తీసుకొని వస్తున్న బండి బోల్తా కొట్టి ఇంకా అలాగే పడివున్నది। లోషాన్ మకాములో వీరికి ఒక సైనిక పాఠశాలలో వసతి ఏర్పాటుచేసినారు. చైనా కేంద్రప్రభుత్వ పాలనకిందవున్న ప్రాంతం సరిహద్దుమీద వున్నది లోషాన్. తెల్లవారింది. లేచే సరికి వారి నీటి సీసాలలోని నీరు యావత్తూ గడ్డకట్టుకుపోయినది. శీతలాధిక్యత వల్ల ఎక్కడి నీరూ ఇలాగే వుంటున్నది. సలసలకాగే నీరుపోస్తేగాని కారు కదల లేదు. రేడియేటర్ రిఫ్రెజరేటర్ అయి వూరుకున్నది.

కొద్దికాలం ప్రయాణం పూర్తి అయ్యేసరికే భారతీయ వైద్యబృందము సోవియట్ చైనాను ప్రవేశించెను. గ్రామాలు పేదరికమునే ప్రకటించుతూవున్నా, నవజీవంతో, కళకళలాడుతూ ప్రకాశిస్తున్నవి. ప్రతి ఇంటి గోడమీదా చైనా జాతీయ కమ్యూనిస్టు నాయకుల చిత్రాలు, జపాన్ వ్యతిరేక ప్రచారక వాక్యాలూ

క్రమసించుతూ వున్నవి. యెనాన్‌ను చేరేసరికి సూర్యాస్తమయం అయింది. అయినా విమానదాడుల ఫలితముగా పతనమైన భవనములు కనుపించకపోలేదు. ప్రపంచంలో విమానదాడులకు ఇంత ఘోరంగా గురి అయిన పట్టణము మరొకటి లేదనే చెప్పవచ్చును. చచ్చినపామును చావగొట్టినట్లుగా ఆ శిధిలాలమీదనే జపాన్ వైమానికులు తమ అమూల్య ఆయుధ సామాగ్రిని వృధాచేసుకుంటూవున్నారు. భారత వైద్యబృందము వూళ్ళో ఇంకా అడుగుపెట్టిందో లేదో పైన శత్రువిమానాలు విహరింప నారంభించినవి. విచక్షణలేక బాంబుల విసిరినవి. భారతీయ వైద్యులు నెమ్మదిగా బండిదిగి రక్షణ కందకములోకి వెళ్ళినారు.

---

# 12. యెనాన్ కమ్యూనిస్టులతో కాలక్షేపం

"యెనాన్ మార్గము చైనాయువకుల జీవితమార్గము"

—లోసున్

భారతీయ వైద్యబృందము యెనాన్‌లో తొమ్మిది మాసములు, 1939 ఫిబ్రవరి 12 వ తేదీనుంచి నవంబరు 4 వ తేదీవరకూ, వుండినారు. వీరి చైనా మకాము అంతటిలోనూ ఇక్కడి ఘట్టమే చాలా ముఖ్యమైనది. అప్రతిహతమైన చైనా ప్రతిఘటన రహస్యమును భారతీయ వైద్యులు ఇక్కడ వుండగానే గ్రహించ గలిగినారు. చైనా కమ్యూనిస్టు ప్రముఖులందరితోనూ పరిచయము కలిగినది. బాగా దోస్తీ ఏర్పడినది. అందరూ ధీరులూ, వీరులూ. ప్రతిభాశాలి, విజ్ఞాని, చారిత్రిక వ్యక్తి, కమ్యూనిస్టు అగ్రజుడు మాట్సే టంగ్‌నుకూడా కలుసుకో వీలైనది. సమరజ్వాలలమధ్య ప్రజా సంస్కృతి, ప్రజాస్వామ్య పరిపాలనా విధానము ఎలా తయారు అవుతూవున్నది ప్రత్యక్షముగ వీక్షింప కలిగినారు.

ఈ నవమాసములూ అచటివారందరివలెనే భారతీయ వైద్యులూ పర్వతగుహాల లోనే ఉంటూ వచ్చినారు. అందుకు బాగా అలవాటుపడినారు.

ఈ తొమ్మిది మాసములలోనే వైద్యబృందం విడివడింది. డాక్టర్ ఛోల్కర్‌కు అచటి శీతోష్ణ స్థితి బొత్తుగా పడిందికాదు. ఆరోగ్యం చెడిపోయే లాగా వుంటే వారు భారతదేశానికి బయలుదేరినారు. తరువాత రెండు మాసము లకు డాక్టర్ ముఖర్జీకి మూత్రకోశములో ప్రమాదకరమైన వ్యాధి బయలుదేరినది. శస్త్ర చికిత్స అవుసరమైనది. హాంగ్‌కాంగ్ వెళ్ళవలసిందిగా అందరూ సలహా ఇచ్చినారు. హాంగ్‌కాంగ్‌లో ఉండగానే ప్రపంచ ప్రళయము ప్రారంభమైంది. తిరిగి చైనా లోపలిప్రాంతములకు వెళ్ళుటకు వీలుగాకపోయినది. ఇండియాకువచ్చి బర్మారోడ్డును అనుసరించి చైనాకు తిరిగి బయలుదేరినారు. అదనముగా ఔషధ ములను సేకరించుకొని రంగూన్ చేరగా అక్కడి బ్రిటిష్ పోలీసులు అరెస్టు చేసినారు. ముఖర్జీచేసిన నేరము ఏమిటో చెప్పలేదు ! ఔషధములను స్వాధీనము చేసుకొనినారు. ముఖర్జీని ఇండియాకు పంపివేసినారుగాని, మందులు మరల చిక్కలేదు. ఆ మందులను ఏమిచేసినారో తెలియలేదు. దురాక్రమణకు గురియై అసహాయులుగావున్న చైనా ప్రజలకు వైద్యసహాయము చేయడానికి వెళుతూ వున్న వైద్యుని ఎందుకు అరెస్టుచేయవలసి వచ్చినదోకూడా తెలియదు. ఈవిధ ముగా బయలుదేరిన అయిదుగురు వైద్యులలోనూ రణరంగమునకు బయలుదేరే రోజుకు ముగ్గురు మాత్రమే ఉండిపోయినారు.

* * *

యెనాన్‌లో వీరు చేయవలసిన పని ఎంతో వున్నది. చికిత్సాశాలలను, వైద్యకళాశాలలను, క్షయరోగుల విరామాలయములను పరిశీలించవలసిందిగా అధి కారులు భారతీయ వైద్యులను కోరినారు. వర్తమాన పరిస్థితుల నివేదించి, భవి ష్యత్తులో చేయవలసిన మార్పులను సూచించవలసిందని తెలియజేసినారు. ప్రస్తుత పరిస్థితులు చాలా అసంతృప్తికరంగా ఉన్నవి. వైద్యుల సంఖ్య బహు తక్కువ. ఆ విషయం అలా వుండగా ఔషధముల కొరత దారుణముగా వున్నది. చుట్టు ప్రక్కలు మహా అపరిశుభ్రముగా వున్నవి. శస్త్ర చికిత్స యావత్తూ కేవలము నాటు సామాగ్రితోనే చేయవలసివున్నది. అవసరమైన సునిశిత శస్త్రచికిత్స

సామాగ్రి అందుబాటులో లేదు. భారత వైద్యులు తెచ్చిన సామాగ్రినంతా ఇక్క డనే ఇచ్చి వేసినారు. అత్యవసరముగా మందులు కావలసివున్న చికిత్సాలయము లకు పంపకము చేసినారు. చికిత్సాలయముల అభివృద్ధి విషయమై భారతీయ వైద్యులు చేసిన సిఫార్సులన్నింటినీ అధికారులు అమలు జరిపినారు. కేవలము యుద్ధరంగములో గాయపడివచ్చిన సైనికులకు చికిత్స చేయడానికి అనుకూల ముగా 200 పక్కలతో ఒక ప్రత్యేక ఆసుపత్రిని స్థాపించినారు. ఈ చికిత్సా కేంద్రమును 'ఎయిత్‌రూట్ ఆర్మీ ఆదర్శ చికిత్సాలయం' అని వ్యవహరించుతూ వచ్చినారు. ఈ చికిత్సాలయ నిర్వహణ భారము భారతీయ వైద్యులపైననే పడి నది. ఇతరులకు ఆదర్శప్రాయముగా వుండే విధమున ఈ కేంద్రమును భారతీయ వైద్యులు నడుపుతూ వున్నారు. పట్టణానికి పదిహేను మైళ్ళ దూరములో పర్వత గుహలలో ఏర్పాటు చేసిన ఈ ఆసుపత్రిలో డాక్టర్ అటల్, కొట్నిస్, బాసు పని చేస్తూ వుండగా, డాక్టర్ చోల్కర్, ముఖర్జీలు ఇచటికి ఎనభైమైళ్ళ దూరములో వున్న వైద్య కళాశాలలో విద్యార్థులకు వైద్యవిద్య గరుపుతూ వున్నారు. కొంత దూరము కారుమీదా, మరికొంతదూరము గుర్రాలనెక్కి వెళ్ళి ఇంకా కొంతదూ రము నడిచినగాని వైద్యకళాశాలను చేరలేరు.

చికిత్సాలయములో పని మామూలుగానే వున్నది. ప్రత్యేక సంఘటనలు అంటూ పేర్కొనదగ్గవి ఏమీలేవు. కాని వాళ్ళు ఒడలు విరుచుక పనిచేయవలసి వున్నది. ప్రాతఃకాలము ఫలహారం కాగానే, రోగులున్న గదులు అన్నీ చూచి వస్తారు. ఏరోగికి ఏమందు ఇవ్వాలో వ్రాసి కిందిపనివారికిచ్చివేస్తారు. గుహల్లో మిట్ట మధ్యాహ్నంవేళగాని వెలుతురువుండదు. అందుచేత శస్త్రచికిత్స లన్నింటినీ అప్పుడే చేస్తారు. మధ్యాహ్నం భోజనంచేసి కొంచెం విశ్రాంతితీసుకుంటారు. అప్పుడే తమ వృత్తికి సంబంధించిన గ్రంథాలను, పత్రికలనూ, రాజకీయ గ్రంథా లనూ, వార్తా పత్రికలను చదువుతూ వుంటారు. సాయంకాలము బయటనుంచి వచ్చే రోగులకు మందులు ఇస్తూవుంటారు. భారతీయ వైద్యులదగ్గర ఔషధము సేవించడానికి ఎక్కడ ఎక్కడ్నుంచో ప్రజలు వస్తూవుంటారు. భారతీయవైద్యుల పేరు యెనాన్ మారుమూలలకూ వ్యాపించినది.

వైద్య కళాశాల మొన్న మొన్నటివరకూ పాఠశాలగానే వుంటూవచ్చినది.

కేంద్ర ప్రభుత్వ సైన్యమునకూ కమ్యూనిస్టులకూ కలహములు ప్రారంభమై యుద్ధము చెలరేగినప్పుడు ఈ పాఠశాలను ప్రారంభించినారు. కమ్యూనిస్టు సైన్యము ఆచరిత్రాత్మకమైన ఆరువేలమైళ్ళ యాత్ర ప్రారంభించినప్పుడు ఈపాఠశాలకూడా సైన్యమువెంట బయలుదేరినది. యాత్ర సాగిన ఆ పదకొండు నెలలూ పాఠశాల సాగుతూనే వున్నది. యాత్ర పూర్తి అయ్యేసరికి రెండుముఠాలు విద్యాశిక్షణ పూర్తిచేసుకొని పట్టముల బొందినవి.

*　　　*　　　*

భారతీయ వైద్యులు యెనాన్‌ను ఇదివరకు ఎప్పుడూ చూచివుండలేదు సరిగదా, యీ ప్రాంతమును గురించి వివరముగా వినివుండనూలేదు. నిర్విరామముగా విమానదాడులు జరుగుతూనే వున్నవి. అందువల్ల వెనుకటి నగర గోడల మధ్య ఒక్క భవనమైనా నిలబడిలేదు. ప్రతి ఇల్లూ పొగలు గక్కుతూనే వున్నది. ప్రాచీన పట్టణములో నర సంచారము లేనేలేదు. పట్టణమును యావత్తూ ఖాళీచేసి వెళ్ళిపోయినారు. చచ్చిన గుర్రాన్ని చావగొట్టినట్టు నిర్మూలమైన నగరము మీదనే జపాన్‌వారు తమ బాంబులను వేస్తూవున్నారు. ఒకదఫా ఎన్నో విమానములువచ్చి అనేకవందల టన్నుల బాంబులను వేస్తే ఒక్క గాడిద చచ్చిపోయింది.

ఆ జీర్ణ, ప్రాచీన పట్టణ పరిసరములలోని పర్వతములలో గుహలు ఏర్పరచుకొని ప్రజలు నివసిస్తూవున్నారు. పర్వతముల వీడపట్టును కొన్ని గృహములను నిర్మించినారు. కొండలమధ్య విమానదాడి ప్రమాదం ఉండదు కనుక రెండు కొండలమధ్యా భవంతుల కట్టినారు. ఈ పర్వత నగరములో దాదాపు నలభైవేల మంది జీవించుతూవున్నారు. ప్రపంచములో ఏదేశానికీ ఇలాంటి రాజధానీ నగరము లేదనే చెప్పవచ్చును. ఈ గుహలనుంచే జపాన్ సేనల చికాకుపరిచే అద్భుత కార్యక్రమమును నిర్వహించుతూ వున్నారు. 'ఎయిత్‌రూట్ ఆర్మీ' ప్రధాన కేంద్రం ఇది. "గెరిల్లా సామ్రాజ్యానికి" రాజకీయ పాలన కేంద్రం. ఉత్తర చైనాలో సరిహద్దు ప్రభుత్వములంటూ అనేకములు వున్నవి.

సరిహద్దు ప్రాంతాలేమిటి అనే సందేహము కలుగవచ్చును. ఈ సరిహద్దు ప్రాంతముల ప్రభుత్వములగురించి ఎడ్గార్‌స్నో ఇలావ్రాసినారు—"ఇదొక అపూర్వ పద్ధతి. ఉత్తర చైనాలోని ప్రత్యేక పరిస్థితులను అనుసరించి, యుద్ధమువలన ఏర్ప

డిన అసాధారణ స్థితికి అనుగుణముగా ఈ విధానము తయారు అయినది." సియాన్ సంఘటన ఫలితముగ క్యుమింటాంగ్ కమ్యూనిస్టు ప్రభుత్వములకు రాజీ కుదిరేవరకూ ఈ ప్రాంతమంతా సోవియట్ ప్రభుత్వమును అనుసరించి రిపబ్లికన్ విధానమున పరిపాలింపబడుతూ వుండేది. ఆనాటి ఒడంబడికను అనుసరించి కమ్యూనిస్టులు తమ ప్రత్యేక స్వతంత్ర ప్రభుత్వ పద్ధతిని విసర్జించి, ఈ ప్రాంతమువంతనూ చుంగ్‌కింగ్ కేంద్ర ప్రజాస్వామ్యంలో ఒక అంగముగా చేసినారు. అయినా షాన్సీ, కాన్సూ, నింగ్షియా—ఈ మూడు రాష్ట్రములూ కమ్యూనిస్టుల పెత్తనముక్రిందనే వున్నవి. షాన్సీ—కాన్సూ—నింగ్షియా సరిహద్దు ప్రభుత్వమును వేరే ప్రత్యేకముగా ఏర్పాటుచేసినారు. సోషలిస్టు పద్ధతులను అనుసరించి పరిపాలన సాగడంలేదు. ఇది కేవలము ప్రజాస్వామిక ప్రభుత్వము. వయోజనులందరికినీ వోటుహక్కు ఉన్నది. ప్రభుత్వ సంస్థలు అన్నీ ఎన్నిక పద్ధతిని అనుసరించే ఏర్పాటు అవుతవి. ప్రజానాయకులు అందరూ కమ్యూనిస్టులే అయినా ఐక్యతా ప్రాంగణమును పదిలముగా కాపాడుతూవున్నారు. శాసన సభలో ప్రాతినిధ్యమున్నూ సమానముగా కమ్యూనిస్టులకు, క్యుమింటాంగ్ పక్షంవారికి, నిష్పక్ష నాయకులకూ ఏర్పాటు చేసినారు.

ఈ "పరిపాలనా యంత్రము"నకు యెనాన్ కేంద్రము. యెనాన్ పాలనలో ఉన్న ప్రాంత విస్తీర్ణము దాదాపు ఇంగ్లండ్ అంత వుంటుంది. ఈ రాజ్యములో హెచ్చు భాగము జపాన్ సైనికశ్రేణి వెనుకనవున్నది. కొన్ని భాగములను పూర్తిగా జయించినామని, ఆప్రాంతములన్నీ తమ పాలనక్రిందనేవున్నవని జపాన్‌వారు ప్రకటించే ప్రాంతములలో వారి అధికారము పూర్తిగా చెలామణీ గాదు. వారి సైనిక శిబిరములున్న ఆ కొద్ది ప్రాంతములో, నిరంకుశముగ సైనిక పరిపాలన సాగే ప్రాంతములలోమాత్రమే జపాన్ శాసనాలు చెల్లుబడి అవుతవి. జపాన్ సేనలు ఈ ప్రాంతమునంతనూ జయించి యుండవచ్చును. కాని ఆ ప్రాంతీయులను పాలించేదిమాత్రం ఈ సరిహద్దు ప్రభుత్వమే. ఈ ప్రభుత్వ శాసనములనే ప్రజలు పాటించుతూ వుంటారు.

షాన్సీ—కన్సూ—నింగ్షా ప్రభుత్వముగాక, సరిహద్దు ప్రభుత్వములు వేరుగా మరికొన్ని వున్నవి. ఇవన్నీకూడా ఈ "గెరిల్లా సామ్రాజ్యము"లో చేరే

వున్నవి. షాన్సీ, హూపే, చాహార్ ఈ రాష్ట్రత్రయ పొలిమేరను తాకుతూ చుట్టివున్న ప్రాంతము ఈ గెరిల్లా సామ్రాజ్యము. ఈ మూడు రాష్ట్రములనూ ఎయిత్‌రూట్ ఆర్మీ జపాన్‌వారివద్దనుంచి సమర విజయ ఫలితముగ సంపాదించి వది. షాంటంగ్ ఉత్తరదిక్కుగావున్న మరోసరిహద్దు ప్రాంతమునూ జపాన్ సేనల తరిమి ఎయిత్‌రూట్ ఆర్మీ ఆక్రమించినది. ఈ మూడు సరిహద్దు ప్రాంతముల లోనూ యెనాన్ ప్రాపకము చాలా ఎక్కువగానే వున్నది. జపాన్ ప్రతిఘటనకు ప్రజాశక్తిని, సమీకరించుటకు ఈ ప్రాంతములలో సాంఘికవాద ప్రజాసత్తాక ప్రభుత్వములను ఏర్పాటుచేసినారు.

* * *

ఈ సోవియట్ చైనాలో అగ్రగణ్యుడు, 'అగ్రజుడు' మావ్‌ట్సీటంగ్ ఉత్తర చైనాలో ఇదివరలోవున్న సోషలిస్టు ప్రభుత్వ అధ్యక్షులు. చైనా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి. చైనాకు వచ్చి వీరిని కలుసుకోవడానికి పూర్వమే భారతీయ వైద్యులు వీరినిగురించి చాలా చదివినారు. వీరినిగురించి అనేక విషయములను వినినారు. చైనా వచ్చినది మొదలుకొని వీరిని కలుసుకోవాలని ఆరాటపడుతూనే వున్నారు. యెనాన్‌లో భారతీయ వైద్యబృందానికి స్వాగతమివ్వడానికి ఏర్పాటు చేయబడిన బహిరంగ సభకు వీరూ, ఇతరకమ్యూనిస్టు ప్రముఖులున్నూ వచ్చినారు. వేషంలో మిగిలినవారివలెనే వున్నందువల్ల నాటి సభలో మావ్‌ట్సీటంగ్‌ను భారతీయవైద్యులు గుర్తించలేక పోయినారు. ఆయన ముఖం చూస్తే మంచి వడదెబ్బ తిన్నవాని మొహంవలె వాడివుంటుంది. బలిష్ఠుడేగాని


మావ్‌ట్సీటంగ్

బక్క పల్చని శరీరం. ఆనాటి సమావేశములో ఎవరో భారతీయ వైద్యులకి మూ ర్తిని చూపించినారు. అందరిల్లోనూ వీరి ఆకృతే ప్రత్యేకముగా వున్నది. చైనా వారు అందరూ సహజంగా పొట్టివారు. అక్కడున్న చైనావారందరిలోనూ పొడగరి మావ్‌ట్సేటంగ్.

కొన్నాళ్ళు గడచిన తరువాత ఆ శిధిల నగరములో భారతీయ వైద్యులు వీరిని కలుసుకొనినారు. అన్ని ఇళ్ళూ నేల మట్టమైపోగా ఒక ఇంటికి సంబంధించిన ఒక గది ఎలాగో చెక్కు చెదరక నిలబడివున్నది. యెనాన్‌వచ్చిన అతిథులందరికీ ఈ ప్రత్యేకగదిలో సన్మానంచేస్తూ వుంటారు. విశేషముగా సామాగ్రిగానీ, తదితర వస్తువులుగానీ ఏమీ లేవు. నాలుగు కుర్చీలు, పగిలిన కొన్ని బల్లలు మాత్రము వున్నాయి. అట్టహాసం చేస్తూ భారత వైద్యులకు స్వాగతము ఇచ్చినారు. ఒక ద్విభాషి సహాయముతో భారత రాజకీయములను గురించీ, దేశ స్థితిగతుల గురించీ తెలుసుకొనినారు. జాతీయకాంగ్రెస్, భారత కమ్యూనిస్టులు, మహాత్మ గాంధీ, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూల గురించి చాలా ప్రశ్నలు అడిగినారు. అప్పుడే భారతీయ వైద్యులకు స్వదేశమునుంచి పత్రికలు వచ్చినవి. ఆనాడు వచ్చిన పత్రికల్లో జపాన్ కవిపుంగవులు నగూచీకినీ రవీంద్రనాధ్ టాగూర్‌కునూ జరిగిన ఉత్తర ప్రత్యుత్తరముల పూర్తి పాఠము వెలువడినది. జపాన్ సామ్రాజ్యతత్వమును తెగడి భారతీయులు అలాంటి జపాన్ యెడల ఎలాంటి సానుభూతినీ ప్రదర్శింప జాలరూ అని రవీంద్రుడు స్పష్టముగ ప్రకటించినారు. తమకువచ్చిన పత్రికలలో కొన్నింటిని భారత వైద్యులు మావ్‌కు ఇచ్చినారు. ఇంగ్లీషు మాట్లాడకపోయినా చదివి అర్థముచేసుకొన గలరు మోవ్.

భోజనమునకు ఉండిపోవలసినదని భారతీయ వైద్యులను కోరినారు. వీరి ఆతిధ్యము ఎంతో ఆనందకరముగా వున్నది. మావ్‌కు పదార్థాలు బాగా పాకంగా వుండాలి. ఇతర పదార్థాలతోబాటు బల్లమీద ఎర్ర కారం పొడి సీసాకూడా ఒకటి వున్నది. బహు చమత్కారముగా ప్రసంగిస్తారు. కొరివి కారాన్ని కూరలమీద చల్లుతూ, భారత—చైనా ప్రజల ఐక్యతా బంధములలో ఉభయదేశములవారికీ పండుకారం ఎడల గల ప్రీతి ఒకటి అన్నారు.

యెనాన్‌లో వుండగా భారతీయ వైద్యులు వీరిని చాలా పర్యాయములు

కలుసుకొనినారు. వీరి నిరాడంబర జీవనము, ప్రతిభ, చమత్కారము భారతీయ వైద్యులకు బాగా నచ్చినవి. గుర్రపు స్వారీలో ఒకదఫా డాక్టర్ అటాల్ కిందపడి పక్క ఎముకను విరగగొట్టుకున్నారు. పెద్ద దెబ్బ తినకపోయినా బాసుకూడా ఒక సారి గుర్రంమీదనుంచి పడినారు. వీరినిచూచి మందహాసముచేస్తూ, "ఈ గుర్రాలు అన్నింటికన్నా మంచివి, ఎలాచెప్పితే అలా వినేవి, ఎప్పుడూ దగాచేయనివి, ఎక్కడికి వెళ్ళాలంటే అక్కడికి తీసుకుపోయేవి" అంటూ తవ కాళ్ళవంక చూపించినారు మావ్.

* * *

ఆగస్టు 3 వ వారములో చైనా వస్తున్నాననీ, ప్రత్యేకము యెనాన్ వచ్చి భారతీయ వైద్యదళము ఎలా పనిచేస్తూవున్నదీ ప్రత్యక్షముగాచూచి, అక్కడ మావ్‌ట్సేటంగ్‌ను, చూ‌తేను కలుసుకొన కుతూహల పడుతూ వున్నాననీ పండిట్ నెహ్రూ ఇచ్చిన తంతివార్తచూచి అందరూ పరమానంద భరితులైనారు.

రాజధానిలో గొప్ప సంచలన కారకమైనదీవార్త. ఉత్సాహముతో రాజధాని ఉడుకెత్తిపోయినది. పండిట్‌జీని ఆహ్వానిస్తూ మావ్ తంతి ఇచ్చినారు. ఉచిత రీతిని గౌరవించుటకు, ఘనమైన స్వాగతము ఇవ్వడానికి అందుకు అవసరమైన ఏర్పాటు లన్నింటినీ చేయడానికి వెంటనే ఒక పెద్ద ఆహ్వానసంఘం ఏర్పడినది. జవహార్‌లాల్ వుండగలందులకు ఒక ప్రత్యేక గుహలో ఏర్పాట్లు చేసినా . ఆ గుహకు తెల్లగా సున్నం కొట్టించినారు. శస్త్ర చికిత్సకోసరం హాంగ్‌కాంగ్‌కు వెళుతూవున్న డాక్టర్ ముఖర్జీ నెహ్రూ పండితుని చుంగ్‌కింగ్‌లోనే కలుసుకొని నారు. చుంగ్‌కింగ్‌నుంచి పండితుడు యెనాన్‌కు బయలుదేరినారు. విమానం చెంగ్టూచేరినది. అప్పటికే యూరప్ యుద్ధం ప్రారంభమైనట్లు వార్తలు వచ్చినవి. యెనాన్ ప్రయాణం విరమించుకొని వెంటనే ఇండియాకు బయలుదేరవలని వచ్చింది. యెనాన్‌లో అందరికీ ఆశాభంగము కలిగినది.

యూరపు యుద్ధము ప్రారంభం అయిన తరువాత వారమురోజుల వరకూ భారతీయ వైద్యులకు తెలియలేదు. సెప్టెంబరు 1 వ తేదీన హిట్లర్ సేనలు పోలెండ్ సరిహద్దుల నతిక్రమించితే, 7 వ తేదీన యెనాన్‌నుంచి ఈ కబురు

తీసుకొని ఒక మనిషి భారతీయవైద్యులువున్న ఆసుపత్రికి వచ్చినారు. అదే సమయములో ఎడ్గార్ స్నో—ప్రసిద్ధ గ్రంథకర్త—యెనాన్ వచ్చివున్నారు. ఈయన గౌరవార్థం మోవ్ ఒక విందు ఇచ్చినారు. ఈ విందు సందర్భములోనే భారతీయ వైద్యులు ఎడ్గార్ స్నోను కలుసుకొనినారు. క్యూమిన్‌టాంగ్ అధికారులు కొందరు, యెనాన్‌లోని రష్యన్ సలహాదారులు, తదితర ప్రముఖులు ఈ విందులో పాల్గొనినారు. ప్రధానంగా అందరూ యుద్ధముగురించే ముచ్చటించుతూ వున్నారు. భారత స్వాతంత్య్రం విషయమై బ్రిటన్ యుద్ధలక్ష్యం ఏమిటో విస్పష్టం చేయవలసిందని కాంగ్రెస్ బ్రిటిష్ ప్రభుత్వమును కోరినట్లు రేడియోలో విన్నానని మోవ్ భారతీయ వైద్యులకు చెప్పినారు.

* * *

యెనాన్‌లో భారతీయ వైద్యులు చూచిన ప్రత్యేక సంస్థలలో జపాన్ వ్యతిరేక విశ్వవిద్యాలయం ఒకటి. విద్యార్థులే స్వయముగా తయారుచేసుకొనిన గుహలలో ఈ విశ్వవిద్యాలయమును ఏర్పాటుచేసినారు. 1939 లో దాదాపు రెండు వేలమంది విద్యార్థులు ఇక్కడ తర్ఫీయతుపొందుతూ వున్నారు. సరిహద్దు ప్రాంతములలోని ఈ విద్యా కేంద్రశాఖలలో ఎనిమిదివేలమంది శిక్షణపొందుతూ వున్నారు. ఈ ప్రాంతాలు 'సోవియట్ చైనా'గా వుండిన రోజులలో ఈ విశ్వవిద్యాలయమును 'రెడ్ ఎకాడమీ' అని అంటూవుండేవారు. ఇక్కడ పక్షసభ్యులకు కమ్యూనిస్టు సిద్ధాంతములగురించి బోధనచేస్తూ వుండేవారు. క్యుమింటాంగ్—కమ్యూనిస్టు కలయికతో ఇది "జపాన్ వ్యతిరేక విశ్వవిద్యాలయము"గా మార్పు చెందినది. ఇచటి శిక్షణ విధానములోనే గాక విషయములలోనూ ఒక విసిష్టత వుంది. రాజకీయముల నభ్యసించువారు కొంతవరకు సైనిక వ్యవహారములనూ పఠించవలసి వున్నది. అదే విధముగా సైనిక విషయములను అభ్యసించువారు కొంతవరకు రాజకీయములనూ తెలుసుకొనవలసి వుంటుంది. ఇక్కడ తయారైన పట్టభద్రులు "ఎయిత్ రూట్ ఆర్మీ"లో సైనికోద్యోగులుగానో రాజకీయోద్యోగులుగానో చేరిపోతారు.

ఈ విశిష్ట, విఖ్యాత, విద్యా కేంద్రమునకు చైనా నాలుగుమూలలనుంచీ విద్యార్థులు వస్తూవుంటారు. వందల మైళ్ళు నడిస్తేగాని వివిధ ప్రాంతాల విద్యా

ర్థులు ఇక్కడికి రాలేరు. అయినా అత్యుత్సాహంతో అనేకమంది వస్తూవున్నారు వీరిలో ఎందరో తలితండ్రుల ధిక్కరించి, సుఖప్రదమైన జీవితమును వదులుకొని వచ్చినవారు వున్నారు. విద్యార్థులేగాదు, విద్యావేత్తలు, చిత్రకారులు కళాభిజ్ఞులు ఎంద రెందరో తీవ్రవాద పక్షముయెడల అభిమానము కలవారు ఇక్కడకువచ్చి ఈ సంస్కృతిలో ఒక భాగమైపోయినాడు.

అభివృద్ధి అవుతూవున్న ఈ సంస్కృతి సంచలన బాహ్యచిహ్నములలో ఒకటి "ప్రజా నాటకరంగ స్థలము". ప్రత్యేక లక్ష్యం కలిగి అభ్యుదయకరము గానూ, ప్రచారక సాధనగానూ వుంది. నూతనమే అయినా చైనా సాంప్రదాయ ములో జీర్ణమై యెనాన్‌లో ప్రజానాటకరంగం బాగా వృద్ధిపొందుతూవుంది. భారత వైద్యులు యెనాన్‌లో వుండగా ఎన్నో ప్రదర్శనములను చూచినారు. ఇందులో ఒక ప్రదర్శనము ప్రత్యేకము భారతవైద్య బృందమునుగురించే.

వైద్యబృందము యెనాన్‌లో దిగిన మరుసటిరోజునే ఈ నాటకమును ప్రద ర్శించినారు. అక్కడి విద్యార్థులే నాటకమును తయారుచేసి చక్కగా ప్రదర్శించి నారు. రణరంగమున భారతీయవైద్యులూ, చైనా ఉపచారికలూ కలసి చైనా సైని కుల ప్రాణములను రక్షించుతూవున్న ఘట్టములను బాగా చిత్రించినారు. అయితే భూమికల వేషాలలో నవ్వు పుట్టించే ఒకటి రెండు విశేషాలు వున్నవి. చైనా వారు చూచిన భారతీయులల్లా బ్రిటిష్ కార్యాలయములలోవుండే శిక్కులే. వీరికి గడ్డాలు ఉన్నవి. కనుక భారతీయులు అందరికీ గడ్డములు వుంటవని నాటక పర్యవేక్షకులభావం. అంచేతనే భారతీయ వైద్యుల పాత్రల ధరించిన విద్యార్థులు అయిదుగురున్నూ గడ్డాలు తగిలించుకొనినారు.

యెనాన్‌లో ప్రతి సాయంత్రమూ ఏదో ఒక 'కాలక్షేపం' ఉంటూనే ఉంటుంది. ఒకరోజున చైనా "బాల బాలికల సమ్మిశ్రితమైన నాట్యము"ను చూచి నారు. కమ్యూనిస్టులు, క్యూమింగ్‌టాంగ్ పక్షములవారు కలసి జపాన్‌ను ప్రతిఘ టించుతూవున్న విషయమును ప్రచారంచేయడమే ఈ 'నాట్యం' లక్ష్యం. కమ్యూ నిస్టులని తెలియగలందులకు కొందరు ఎఱ్ఱ దుస్తులను ధరించినారు. క్యూమిం టాంగ్ ప్రతినిధులని తెలియగలందులకు మరికొందరు నీలివర్ణపు దుస్తులను ధరించినారు. "భారత మిత్రులకు సుస్వాగతం" అని మరో నృత్యాన్ని ప్రదర్శించి

నారు. దేశీయ సాంప్రదాయాన్ని, ఆటు పడమటిదేశం పద్ధతులనూ మేళవించి ఒక కొత్త పక్కిని ఈ నృత్యశైలిని తయారుచేసినారు. భారతీయ నృత్యంలోని ఆ ఇంపు గొలిపే కదలిక, ఆ లయ, ఈ నృత్యములో కనుపించవు. కాని ప్రజల్లో రాజకీయ ప్రబోధం చేయడానికి ఇది బహు శక్తివంతమైన సాధనము. చైనా కమ్యూనిస్టులు నాట్యకళను సద్వినియోగం చేసినారు. జపాన్ వ్యతిరేక ప్రచారమును సాగించడానికి ప్రాచీన 'పేపింగ్' నాట్యపద్ధతినీ పునరుద్ధరించినారు. తమ లక్ష్యమునకు అనుగుణంగా మార్చినారు. చైనా వీరుల గాథలను ఉత్తేజకరముగా ఈ కొత్త విధానమున ప్రదర్శించి ప్రజలలో ఉద్రేకమును కలిగించుతూ వున్నారు.

'ఎయిత్‌రూట్ ఆర్మీ' అనేక నాటకబృందములను తయారుచేసినది. ఈ బృందములు సైనిక దళములలోనూ, సాధారణ ప్రజల్లోనూ ఈ దేశభక్తి పూరితమైన నాటకములను ప్రదర్శించి, నిరాశ, నిస్పృహ ఏర్పడకుండా ధైర్యోత్సాహముల నిలబెట్టుతూ వుంటవి.

*　　　　*　　　　*

గుర్రపుస్వారీ చేస్తూ చూయెన్‌లే తన కుడిచేతి బొమికలను విరగ్గొట్టుకున్నాడు. భారతీయ వైద్యులకు కబురంపినాడు. చికిత్స చేయడానికి తనచుట్టూ వున్నవారెవ్వరూ పనికిరారన్నాడు. ఆయన నివాస గుహకు భారతీయవైద్యులు వెళ్ళినారు. చూయెన్‌లే తమ ఎడమచేతితో వ్రాయడం అలవాటు చేసుకుంటూ వున్నాడు. యెనాన్ విశేషాల్లో మరొకటి ఆడా, మొగ అనే భేదం లేకపోవడం. ఎవరు ఎవరో తెలుసుకోడం కష్టం.

వీరు యెనాన్‌లో వుండగా అనేక విమానదాడులు జరిగినాయి. తమ గుహలలోనుంచే ఈ విమానదాడులను అవలోకించ కలిగినారు. కూలిపోయిన ఇండ్ల మీద, నిర్మానుష్యమైన నగరముమీద పడుతూవున్న బాంబులలో కొన్ని పేలడమే లేదు. మట్టి ముద్దలవలే అలాగే పడి వూరుకుంటున్నవి. కార్మికులు, కమ్మరివారూ ఈ పేలని బాంబులను సేకరించి వాటిలోని లోహములనూ, రసాయన పదార్థాలను విడదీసి జాగ్రత్తచేస్తూ వున్నారు.

డాక్టర్ అటాల్ పాకశాస్త్రంలో ప్రవీణుడు. వైద్యవృత్తిలో ఎంత సామర్థ్యం వుందో వంటలోనూ అంత సామర్థ్యము వుంది యీనకు. తరుచు భారతీయ తినుబండారములను తయారుచేస్తూ జిహ్వా చాపల్యమును సంతృప్తి పరుస్తూవుండేవారు. ఈ విషయం ఎలాగో పట్నం అంతటా వ్యాపించిపోయింది. దూరప్రాంతాలనుంచి సైతం చైనా ప్రముఖులు ఇక్కడకువచ్చి అటాల్ విందును ఆరగించి వెళుతూవుండేవారు.

ఒకరోజున భారతీయ వైద్యులు పరిసర గ్రామాలకు వాహ్యాళిగా వెళ్ళినారు. వీరినిచూచి గ్రామీయులు సాయుధులై వీరివైపు రావడం వైద్యులకు ఆశ్చర్యకారకమైనది. అయిదుగురిని అరెస్టుచేసి తమవూరికి తీసుకొనిపోయినారు. అక్కడ్నుంచి కేంద్ర కార్యాలయముతో టెలిఫోనుమీద సంప్రతించి వీరెవరో వివరములను తెలుసుకొని వీరిని వదలివేసినారు. వీరివింత శ్రమపెట్టినందుకు తేయాకు పానీయం ఇచ్చి సాగనంపినారు. శత్రువర్గాలకు చెందిన గూఢచారులని గ్రామస్థులు వీరినిచూచి అనుమానపడినారు. పైగా వీరు అయిదుగురూ ఒకే రకము దుస్తులను ధరించి వున్నందువల్ల వారికి అనుమానం మరీ ఎక్కువ అయినది. ఈ హడావిడీ అంతా చేసింది ఆ గ్రామములోని ఆత్మ రక్షక దళము వారు. జాతీయ రక్షణకు ప్రాతిపదికగా స్వయం సహాయపద్ధతిమీద ప్రతి గ్రామమునూ ఇదే పద్ధతిన "ఎయిత్‌రూట్ ఆర్మీ" వారు సంఘటిత పరచినారు. ప్రతి గ్రామంలోనూ అందరూ ఆయుధములను కలిగివున్నారు. కనుకనే జపాన్ చైనా జాతిని జయింపలేక పోయింది. జయించనూ లేదు. ఉత్తర చైనాలో జపాన్ సేనలు తరచు జయించిన ప్రాంతములను గెరిల్లా సైన్యములకు వదులుకొని వెనక్కు వెళ్ళి పోవడానికిన్నీ ఇదే కారణం.

---

కెనడా వైద్యులు బెతూన్ మరణించినారన్నవార్తను భారతీయవైద్యులు ఇక్కడే విన్నారు. అవసరానికి చేతికి 'రబ్బరు చేతులు' తొడుక్కోకుండా ఒక శస్త్రచికిత్స చేసినారు బెతూన్. అంతకుముందే ఆయన వేలిమీద చిన్న గాయం ఒకటివుంది. ఈ శస్త్ర చికిత్స ఈవిధంగా చేయడంవల్ల ఆ పుండు బ్రహ్మాండ మైనది. రక్తము విషమెక్కి బెతూన్ మరణించినారు. నిర్భయుడు. అతి సాహసి. జాతి, వర్ణ, పక్ష వివక్షతల పాటింపక మానవసేవ చేయాలనే అతను ఆజన్మాంతం అభిలషిస్తూవుండేవాడు. అప్పుడే ఎయిత్‌రూట్ ఆర్మీ అతనికి ఒక స్మారక చిహ్నాన్ని ఏర్పాటుచేస్తూవుంది.

సియాన్‌నుంచి తూర్పున టాంగ్‌క్వాన్ వరకే రైలు వెళుతుంది. రైలు మార్గానికి దాపునే శత్రుసేనలు విడిదిచేసి వున్నందువల్ల రైలుప్రయాణం ఆపైన నిషిద్ధమైనది. టంగ్‌క్వాన్‌నుంచి 80 మైళ్ళు గుర్రాలమీద వెళ్ళి వేసియాంగ్‌వద్ద తిరిగ రైలును అందుకొని ఉసియాంగ్‌ను చేరవచ్చునని వీరికి చెప్పినారు. వీరు ఎక్కిన గుర్రాలు బాగా వెళ్ళనందున లెన్సియాంగ్ చేరేసరికే అక్కడ్నుంచి రైలు వెళ్ళిపోయింది. ఆ రాత్రి అక్కడే వుండిపోవలసివచ్చింది. గోధుమలు వున్న ఒక వేగన్‌లో బిచాణా వేసినారు. ఎనభై మైళ్ళు ఏకధాటిగా స్వారిచేసినారేమో; బాగా అలిసిపోయి సొమ్మసిలి ఆ వేగన్‌లో అలాగే నిద్రపోయినారు. తమకు పన్నెండుమైళ్ళ సమీపంలోనే శత్రుసైనిక దళములు వున్నవనే విషయం అయినా వీరిని బాధించలేదు. మైమరచి నిద్రపోయినారు.

మరుసటిరోజు, మంచూ, వర్షమూ పడుతూవుండగానే రైలు బయలుదేరి మీన్‌చీ చేరింది. రైలు దిగి కంచరగాడిదలపై సామానువేసి మెల్లిగా నడక ప్రారంభించినారు. ఈ ప్రాంతములో చలి మరీ ఎక్కువగా వుంది. అయితే ఇచాంగ్‌లో బాగా అలవాటుపడివున్నందువల్ల భారతీయులను ఈ చలి ఏమీ బాధించలేదు. "ఎయిత్‌రూట్ ఆర్మీ" వారు ఈ ప్రాంతమున మంచి రహదారులను ఏర్పాటు చేసినారు. దారి పొడుగునా 15, లేక 20 మంది సైనికులతో శిబిరాలు వున్నాయి. ఇందువల్ల సైనికబృందాలు ఒకరి కొకరు సహాయంగా వుంటమేగాక గెరిల్లా దళాల వార్తలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ వుంటారు.

మిన్‌షీ ఆవల యెల్లో నదిని దాటి అవతలి వొడ్డును చేరినారు. విపరీత వ్యత్యాసంగల రెండు దృశ్యములు వీరిని ఆకర్షించినవి. ఒకటి హృదయవిదారకముగా వున్నది. మరొకటి ఉత్సాహకరంగా వున్నది. కేంద్ర ప్రభుత్వానికి చెందిన సైనికులు గాయపడి యుద్ధభూమినుంచి చికిత్సాలయములకు వస్తూవున్నారు. చూడలేనంత దారుణముగా ఉన్నది ఈ దృశ్యం. వెనక హాంకౌ సమీపములో వీరు చూచిన 'యమలోకమార్గం' మాదిరే వున్నది సైనికులు కృశించి పోయినారు; సైనిక దుస్తులు అయినా సరిగాలేవు. సైనికులు అందరూ విపరీతమైనక్షుద్బాధకులోనైవున్నారు. భారతీయ వైద్యులు వెంటనే అక్కడ "కక్కుర్తి చికిత్సా కేంద్రాన్ని" ఏర్పాటుచేసి చాలా మందికి చికిత్స చేసినారు.

జపాన్ ఆక్రమణనుండి ఈమధ్యనే వదలిన గ్రామాలలోని పరిస్థితులు మరీ ఘోరముగా వున్నాయి. ఇళ్ళు అన్నీ అగ్నిజ్వాలలకు ఆహుతి అయినవి. ప్రజలు పరిసర పర్వత ప్రాంతాలకు పోయి అక్కడే కాలక్షేపం చేస్తూవున్నారు. జపాన్ సైనికులు పోతూ పోతూ అనేకమందిని నిర్దాక్షిణ్యముగా కాల్చివేసినారు. గ్రామాల్లో శవాలూ, బొమికలు, అస్తి పంజరాలూ చెల్లా చెదరుగా పడివున్నాయి. చైనా రైతాంగమును, "జలియన్‌వాలాబాగ్‌లో డయ్యర్ చేసినట్లు," మరఫిరంగులు ప్రయోగించి చంపివేసినారు.

రణరంగమునుంచి తిరిగి వస్తూన్న ముప్పదిమంధి విద్యార్థులను వీరు ఇక్కడ కలుసుకొనినారు. "ఎయిత్‌రూట్ ఆర్మీ" ప్రచారక శాఖలో పనిచేస్తూ వున్నారు వీరందరూ. అందరి దుస్తులూ ఒకే రకముగా వున్నవి. పాతిక సంవత్సరాల పైబడినవారు ఒక్కరూ లేరు. 'సంచారక నాట్యబృందం' ఒకటి వీరివెంట వున్నది. వాయిద్య పరికరములూ, దుస్తులూ, కొన్ని గ్లాసులైట్లూకూడా వీరితో ఉన్నవి. గడచిన మూడుమాసాల్లోనూ వీరు అనేక ప్రాంతాలలో ప్రదర్శనములను ఇచ్చి వున్నారు. అలసిపోయినా ఉత్సాహంగానే ఉన్నారు.

ఎల్లోనది వొడ్డున ఒక గ్రామములో నాటక ప్రదర్శనమును ఏర్పాటుచేసినారు. దాదాపు మూడువందలమంది ప్రేక్షకులువచ్చినారు. భారతీయ వైద్యులున్నూ ప్రదర్శనమును చూచినారు. అక్కడి బౌద్ధ దేవాలయమునే నాటకశాలగా

ఉపయోగించినారు. ప్రేక్షకులుమాత్రము ఆరుబయట కూర్చొనినారు. ఆ ప్రదర్శన విషయము యావత్తూ భారతీయ వైద్యులకు సంబంధించినదే. వారికే అంకితము చేసినారు. ఆటే వ్యవధి లేకపోయినా ఈ నాటక ప్రదర్శనమును చక్కగా, సమర్థతతో నిర్వహించినారు. భారతీయులు సాగించుతూవున్న సామ్రాజ్య వ్యతిరేక పోరాటమునూ, చైనా–భారత దేశముల స్వాతంత్ర్య పోరాట పరస్పర సంబంధములనూ ఈ చిన్న నాటకములో ప్రదర్శించినారు. భారత—చైనా ప్రజల ఐక్యత కూడా చక్కగా ప్రకటిత మైనది. కొత్త ఫక్కీలో గేయముల అప్పటి కప్పుడు తయారుచేసి హృదయంగమంగా పాడినారు. జపాన్ సైనికులపై చైనా దేశభక్త దళాలు సాధించిన విజయములను పొందుపరుస్తూ అప్పటికప్పుడు వ్రాసి పాటలు పాడినారు. ఇవన్నీ బొబ్బిలికథ ఫక్కీలో వుంటవి ఇంచుమించు. తరచు చెలరేగు ప్రేక్షకుల హర్షధ్వనులవల్ల ఈ నాటికా ప్రదర్శనములు ప్రజాబాహుళ్యమును బాగా ఆకర్షించుతూ వున్నట్లు స్పష్టమైనది.

భారతీయ వైద్యబృందము చూటే కార్యాలయమునకు ఉత్తరదిక్కుగా బయలుదేరి వెళుతూవుంటే దారివెంట గెరిల్లా ప్రతిఘటనను ప్రత్యక్షంగా చూడ కలిగినారు. ఒక గ్రామములో వీరు ప్రఖ్యాత గెరిల్లాదళనాయకుడు టియాంగ్ నిలింగ్‌ను కలుసుకొనినారు. అతని వయస్సు నలభై సంవత్సరములకు లోపుగానే వుంటుంది. బహు పల్చని శరీరం. సైనికదుస్తులు, బొడ్లో దోపివున్న రివాల్వరు—అన్నీ అంగులువున్నా పెద్ద సైనికునివలె కనుపించడు. ఆ రాత్రంతా భారతీయ వైద్యులతో మాట్లాడుతునేవున్నారు. తన గ్రామంలోని ప్రజలందరికీ ఎలా సైనిక శిక్షనాన్నిచ్చిందీ సవివరముగా తెలియచేసినారు. ప్రారంభదశలో వీరికి ఆయుధములే లేవు. అర్ధరాత్రివేళ జపాన్ సైనిక శిబిరములమీద దండయాత్రలు జరిపి వారి ఆయుధములనన్నింటినీ సంపాదించినారు. అలాగే జపాన్ సేనా సరఫరా శకటముల అటకాయించి అందులోని ఆయుధములను సైతం స్వాధీనం చేసుకొని ఆయుధసంపత్తిని వృద్ధిచేసుకొనినారు. ఇప్పుడు వీరి గెరిల్లా దళానికి తగినన్ని ఆయుధములు చేకూరినవి. తన అనుచరులు రాత్రివేళ శత్రువుపై ఎలా దాడి సాగించేదీకూడా భారతీయ వైద్యులకు నివేదించినారు. శత్రుసేనల సంచలనమునుగురించి ముందుగా వీరి గూఢచారులు వార్తలు తీసుకొని

వస్తారు. తరువాత ఆ సేనలు వెళ్ళవలసిన మార్గాలను ధ్వంసంచేసివేస్తారు. శత్రుసేనల దారి తప్పించడానికి కృత్రిమ మార్గాలనుకూడా నిర్మించుతారు.

డాక్టర్లు అక్కడ్నుంచి బయలుదేరినారు. అశ్వవాహనములు ఉన్నా చలి విపరీతంగా ఉంటంవల్ల నడకే ఉష్ణజనకంగా వుంటుందని వాహనాలను విసర్జించి నారు. గుర్రాల గిట్టల తాకిడివలన ఒక వింతధ్వని బయలుదేరింది. కంచుమోత మోగుతూ వున్నట్లు తోచింది. కొండలమీది రాళ్ళు ఎత్తితే చాలా బరువుగా వున్నాయి. ఇక్కడ ఇనుము ప్రధానంగా దొరుకుతుందనీ, ఇతర లోహములూ కొద్దిగా వున్నవనీ భారతీయ వైద్యులకు విచారణమీదట తెలిసినది. పరిసర గ్రామాల ప్రజలు అవసరం కలిగినప్పుడల్లా ఈ ముక్కలను తీసుకువెళ్ళి గ్రామ కమ్మరికి ఇచ్చి తమకు కావలసిన సామాగ్రిని తయారుచేయించుకుంటూ వుంటారు. ఈ ప్రాంతాల బొగ్గు గనులున్నూ విరివిగా వున్నట్లు తెలుస్తుంది. దాదాపు ప్రతి గ్రామమునకు ఒక ప్రత్యేక బొగ్గుగని వుంది బొగ్గు మంచినాణ్యమై నదికూడా. ప్రపంచ దేశాలన్నింటికీ ఒక వంద సంవత్సరాలకు సరిపడ బొగ్గు, ఇనుము షాన్సీ రాష్ట్రములో దొరుకుతుందని ప్రతీతి. గెర్రిల్లా దళాలే నెరవేరనిస్తే. ఈ రాష్ట్రాన్ని తీసుకోవాలని జపాన్ చాలా పట్టుదలగావుంది.

చూటే కార్యాలయం చేరుకోడానికి శత్రుశ్రేణులను దాటవలసివుంది. ఈపని రాత్రిపూటే జరగాలి. ఏసమయంలోనూ ఇది అంత తేలిక అయినపని కాదు. కాని గెరిల్లాలు, ఎయిత్‌రూట్ ఆర్మీవారు ఇలాంటి సాహసకార్యాలను అతి సమర్థతతో నిర్వహించడం నేర్చుకొనినారు. పగటివేళ వైద్యులు విశ్రాంతితీసు కుంటూవుండగా, కొందరువచ్చి వీరిని తోడ్కొని వెళ్ళినారు. ఆరాత్రి ప్రయాణం చేయవలసిన మార్గాన్ని వీరికి చూపినారు. వీరిని ఒక కొండమీదకు తీసుకొని పోయినారు. పర్వతాగ్రంనుంచి కిందికిచూస్తే పర్వతలోయ బాగా కనుపించుతూ వుంది. భూత అద్దములను పెట్టుకొని చూచిన పాము మెరికలవలెవున్న రహదారి కూడా స్పష్టంగా కనుపించినది. ఆ మార్గాన ఆ క్షణంలో కొన్ని సేనా శకట ములు నడుస్తూవున్నవి. అవి శత్రుసేనలకు సంబంధించినవి. ఆ కొండమీదనుంచే భారతీయ వైద్యులకు రెండు గ్రామములను చూపించినారు. ఈ రెంటికి మధ్య ఒకమైలుదూరంవుంది. ఈ రెండుగ్రామాలలోనూ గ్రామానికి 50 మంది చొప్పున

జపాన్ సైనికులు కాపలా వున్నారు. గూఢచారులు సంపాదించిన వార్తలవల్ల ఈ వివరములు తెలిసినవి. ఈ గూఢచారులు తమ ప్రాణాలకు తెగించి శత్రు శ్రేణుల జొరబడి ఏ క్షణానికి ఆ క్షణం శత్రుసేనల కదలికను గెరిల్లా దళములకు తెలుపుతూ వుంటారు.

భారతీయులు నిలబడివున్న పర్వతం ఊర్ధ్వభాగంనుంచి ఫిరంగి మ్రోతలు వినవచ్చినవి. ఈ పర్వతములవెనుక చైనా సైనికదళములు వున్నవి. వాటిపైన ఈ ప్రయోగం! ఈ ఫిరంగి కాల్పులు వారిని ఏమీ చేయలేవని తెలిసినప్పటికి జపాన్ సైనికులు సాగించడానికి కారణములేకపోలేదు. అప్పుడప్పుడు వీరికి వొళ్ళు జల్లు మంటూ వుంటుంది. గుండెలు దడదడలాడేవి. ఆ సందర్భాల్లో ఈ ఫిరంగులను మోగిస్తూవుంటారు! ఆ నవాయితీగా చేస్తూవుండేదే ఈపని.

భారతీయ వైద్యులు ఈ శిబిరాలను దాటి వెళ్ళడం ఎలాగ? ఆ రాత్రి రెండు గెరిల్లా దళాలు ఈ రెండు శిబిరాలమీదా దాడి జరుపుతవి. శత్రుసైనికులు ఈవిధంగా పోరాటములో నిమగ్నమై మరోవైపు దృష్టి మరల్చడానికి వీలు వుండదు. అప్పుడు భారతీయ వైద్యబృందం సులభముగా ఈ శ్రేణులను దాటి వెళ్ళవచ్చును. పథకం బాగానేవుంది. కాని తీరా ఆచరణలో అంత తేలిగ్గా వుంటుందా?

గుర్రాల గిట్టల తాకిడివల్ల ధ్వని బయులుదేరుతుంది. కనుక వీరు సామాగ్రిని కొందరి తలపైవుంచి బయులుదేరినారు. పిల్లులవలె చడీ చప్పుడూ కాకుండా దాటి పోవాలి. గ్రామాల ముట్టడికి రెండు గెరిల్లాదళాలూ సిద్ధమైనవి. ఒక్కొక్క దళంలో సుశిక్షితులైన 120 మంది సైనికులు వున్నారు. ఒకదళంమాత్రం మంచి ఆయుధములతో తయారైనది. రెండవదళానికి చెందినవారు లభించిన ఆయుధాన్నల్లా తీసుకొని సిద్ధమైనారు. లోయ మొదట్లో పొంచివున్నారు. నేల మంచు మయం. వెన్నెలరాత్రి కాకున్నా నక్షత్రాల వెలుగులో దారి కనుపించు తునే వున్నది.

సరిగ్గా అర్ధరాత్రివేళ ముట్టడి ప్రారంభం అయింది. రెండుదళాలూ చీలి పోయినవి. వెంటనే తుపాకీ కాల్పుల శబ్దం వినవచ్చింది. మోతలు—మార్మోతలు; శిబిరముల ముట్టడి ముమ్మరంగా జరుగుతూవుంది. ఇందుకొరకే భారతీయ

వైద్యబృందం వేచివున్నది. వెంటనే భారతీయ వైద్యులు బయలుదేరినారు. సుర క్షితంగా లోయ ఆవల పక్కకు చేరినారు. అందరూ అదొక వింత అనుభూతిని పొందినారు. శత్రు శ్రేణులను దాటడం అంటే అంతవరకూ ఏదో మాటలతోనే ఆగింది. ఆ అత్ర సమయంలో వాస్తవమైనది.

తిరిగి మామూలుగా రహదారికి చేరినారు. శత్రుప్రమాదము దాదాపు పూర్తిగా తగ్గిపోయినది. కాని సాహసించవలసిన ఘట్టాలు ఇంకా వున్నవి. చీకట్లో దారి తప్పినారు. ఆ రాత్రంతా నడుస్తూనేవున్నారు. రెండు కొండలు ఎక్కి దిగినారు. ముప్పయి మైళ్ళ పర్యంతం నడిచి తెల్లవారి 9 గంటలకు రెజిమెంటల్ కార్యాలయం చేరినారు. మళ్ళా మామూలుగా మిత్రబృందంలో వెలిసినారు. నిశ్చింతగా కాళ్ళు జాపుకొని, సేదదీర్చుకొన వీలైంది. క్షణంలో కునుకుపట్టింది. పగలు పూర్తిగా, మైమరచి నిద్దురపోయినారు, కాని ఆమధ్యాహ్నం శత్రుసేనలు ఈ గ్రామంపై నిరంతర కాల్పులు సాగించినారనిగానీ, గ్రామాన్ని ఖాళీచేసి వెళ్ళి పోవడానికి అందరూ సిద్ధముగా ఉండవలసిందని చైనా సైనికోద్యోగులు ఉత్తరువులు చేసినారనిగానీ వీరికేమీ తెలియదు.

---

# 14. దుర్భేద్యమైన ప్రాకారం

"చైనాలో మానవ స్వాతంత్ర్యం కొరకు పోరాడినవారిలో ఇతని నామధేయం అమరత్వమును పొందినది."

—చూటేను గురించి ఎడ్గార్‌స్నో.

"సంప్రాప్తమైన సాధన సంపత్తితోనే ప్రజలు విజయవంతముగా పోరాడగలరనే గొప్ప పాఠమును నేర్చుకొన్నారు."

—జనరల్ చూటే.

ఉత్తర చైనాలోని షాన్సీ రాష్ట్రంలోని వుసియాంగ్ దాపునవున్న ఒక కుగ్రామం, ఆ గ్రామంలో మట్టిగోడల పాకా జనరల్‌చూటే కార్యస్థానం। ఇంటి

ప్రాంగణములో కర్షక వనితలు గోధుమలు బాగుచేస్తూవున్నారు. కొందరు పిండి విసురుతూ వున్నారు. భారతీయ వైద్యులు, చూ టేను కలుసుకోడానికి వెళుతూ వున్నారు, వాకిట్లో ఒక ముసలి మనిషి నిలబడి వున్నాడు. పెద్ద తల; వాడిన ముఖం; మందంగావున్న పెదవులు; పెద్దగా నవ్వుతూ వీరికి స్వాగతం ఇచ్చినాడు. ఆకృతినిబట్టిగానీ, దుస్తులను బట్టిగానీ అతడే చూ టే అని భారత వైద్యులకు స్ఫురించనేలేదు. మామూలు సైనికదుస్తులనే ధరించివున్నాడు. లోపలికి వెళ్ళిం తిరువాతగాని వీరికి తెలియలేదు, అతడె చూ టే అని.

అదొక చిన్న గది. ఆ గదిని వాడుగకుతీసుకొనినారు. అదే "ఎయిత్ర్యూట్ ఆర్మీ" కార్యస్థానం! గది గోడలకు సందులేకుండా వివిధ దేశాల పటాలు అమరి వున్నవి. ప్రధానంగా ఉత్తరచైనా, చైనా, ఆశియా, ఒక పెద్ద ప్రపంచ పటం కనుపించుతూ వున్నవి. పటాలు అన్నింటిమీదా ఏవేవో గుర్తులు ఉన్నాయి. మట్టి అరుగుకే గదిలోని సగభాగం సరిపోయింది. అరుగుకింద కుంపటి రాజుతూవుంది. ఒకే ఒక బల్ల; కొన్ని కుర్చీలుమాత్రం వున్నవి. అంతకు మించి సామాగ్రి ఏమీలేదు. మూడు సంవత్సరములుగా ఉత్తర చైనాలో శత్రువుకు ఊపిరి సలపకుండాచేస్తూ జపాన్ సేనలో సగభాగాన్ని కట్టివేసిన దేశభక్త (చైనా) సేనల సర్వసేనాని కార్యస్థానం ఇదే అంటే నమ్మడానికి వీలుగాదు. ఇతని సేన ఆయుధ సంపత్తినిచూస్తే వీరు సాధించిన విజయాలు వాస్తవమేనా అనే సందేహం కలిగితీరుతుంది. ఒక ద్విభాషిద్వారా భారతీయవైద్యులు అతనితో ముచ్చటించినారు. ఈ కొద్ది పరికరములతో అంతటి అద్భుత విజయములను ఎలా సాధించినదీ అతడు సవివరముగా నివేదించినాడు. అసమాన ఆయుధబలం గల సామ్రాజ్యదేశములనుండి వలసలు స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు గెరిల్లా యుద్ధము ఒక గొప్ప, శక్తివంతమైన సాధన మని చెప్పినాడు. అడవుల్లో, కొండల్లోనేగాక పీట భూములలో నైతం గెరిల్లా యుద్ధం ఎలా సాగించవచ్చునో భారతీయ వైద్యులకు చెప్పినాడు. 'మనుష్యకోటితో మేరు పర్వతాలను నిర్మిస్తాం' అంటూ కార్యకలాపమును పూర్తిగా వివరించి చెప్పినాడు. బాగా లోతైన కందకాలను, పాము మెలికలవలె, త్రవ్వి వుంచుతారు. ఇందువల్ల చైనా సైనికులకు ప్రాణరక్షణ: బేపర్వాగావున్న శత్రుసైనికులకు ప్రాణ నష్టం కలుగుతుంది.

చూటే మంచి పట్టుదలమనిషి. ఎంతో ఆవేశముతో మాట్లాడుతాడు. అయినా ఎంతో శాంతి, సహనములు కలిగి తండ్రివలె కనుపించుతాడు. ఎంతో ఆప్యాయంగా పలుకరిస్తాడు. తరువాత చూటేను అనేక దఫాలు భారతీయ వైద్యులు కలుసుకొనినారు. ఉద్రేకపూరితంగా ఉంటం చూచినారు గాని ఉగ్రుడై వుంటం చూడనేలేదు. ఎవరితో అయినా ఎంతో ప్రేమతో, వాత్సల్యంతో ప్రసంగిస్తాడు. ఎక్కడలేని ఓర్పునూ కనబరుస్తాడు.

భారతీయ వైద్యులు ఇక్కడకువచ్చిన కొద్దిరోజులకే చూటే 56 వ జన్మదినోత్సవం—1940, జనవరి 1 వ తేదీన—జరిగింది. ఆనాడు జరిగిన బహిరంగ సభలోనే భారతీయ వైద్యబృందానికి స్వాగతం ఇచ్చినారు. ఆనాటి చూటే ప్రసంగం విన్నవారందరికీ అతని వాగ్ధాటీ, విషయ పరిజ్ఞానం అచ్చెరువు గొల్పినవి. గొప్ప ఉపన్యాసకుడని భారతీయ వైద్యులు గమనించినారు. భారతదేశం, చైనా, సోవియట్ రష్యాలను గురించి ఆరోజున ఆయన ప్రసంగించినాడు.

వైద్యులను వారి పనిమీద పంపివేయడానికిముందు ఎయిత్‌రూట్ ఆర్మీ వివిధ శాఖల పనులను అవగాహన చేసుకోవలసిందని ఆదేశించినారు. వివిధ శాఖల ప్రముఖులు వచ్చి భారతీయ వైద్యులతో ముచ్చటించినారు. అన్నింటిలోకి విద్యాశాఖవారి కృషి భారతీయ వైద్యులకు బాగా నచ్చింది. సైన్యంలో నిరక్షరకుక్షులు ఎవ్వరూలేరు. కేవలము చదవటము వ్రాయడమేగాక వివిధ విషయములు అవగాహన చేసుకొని, స్వంతంగా ఆలోచించుకోగల సామర్థ్యం అందరికీవుంది. కొద్ది విరామం దొరికితే బహిరంగ సభలు ఏర్పాటుచేసి, స్థానిక, జాతీయ, అంతర్జాతీయ రాజకీయ వ్యవహారములపై చర్చలు జరుపుతారు. ప్రతి దళానికీ అంటుకొని ఒక చిన్న క్లబ్బు, గ్రంథాలయం, ఒక వార్తాపత్రిక వుంటవి. ఒక రంగం నుంచి మరోరంగానికి మారవలసి వచ్చినప్పుడు సైనికులు గ్రంథాలను తమ వెంటనే తీసుకు వెళుతూవుంటారు. చైనా సైనికులలో ముఖ్యంగా ఈ ఎయిత్‌రూట్ ఆర్మీలో వారందరికీ యుద్ధతత్వం బాగా తెలుసును. తాము ఎందుకు ఈ యుద్ధం సాగించుతూ వున్నారోకూడా తెలుసును. కమ్యూనిస్టు సేనా సాంప్రదాయముల ననుసరించే ఎయిత్‌రూట్ ఆర్మీకూడా సైనికులలో పనిసాగించుతూవుంది

.క్కాటే తేడా అప్పటికీ ఇప్పటికీ. కమ్యూనిస్టులు తమ యుద్ధాన్ని వర్గసంఘర్షణా సిద్ధాంతమును అనుసరించి పాటకపు ప్రజల శత్రువులు అందరిపైనా సాగించే వారు అప్పుడు. ఇప్పుడు కేవలం ఎయిత్‌రూట్ ఆర్మీ జపాన్ వ్యతిరేక పోరాటమునే సాగించుతూ వుంది.

మరో ప్రధానమైన శాఖ "శత్రు స్నేహ" శాఖ. ఖైదీలుగా దొరికిపోయిన జపాన్ సైనికులలోనూ అసలు జపాన్ సైనిక బృందములలోనూ జపాన్ ప్రతి కూల ప్రచారమును సాగించడమే ఈ శాఖ పని. ఎయిత్‌రూట్ ఆర్మీలోని సైని కులలో ప్రతి పదిమందికి ఒక సైనికునికి జపాన్ భాష బాగా వచ్చివుంటుంది. శత్రువును ఎదుర్కొనవలసి వచ్చినప్పుడు జపాన్ భాషలోనే నినాదాలు ఇవ్వవలసి వుంటుంది.

యుద్ధం ప్రారంభమైన మొదటిరోజులలో చావ సిద్ధంగావున్నా జపాన్ సైనికులు లొంగిపోయేవారుకారు. పట్టుబడితే చైనావారిచేతుల్లో అయినా చావవలసి వున్నది గనుక ప్రతిఘటిస్తూనే ప్రాణాలు విడవడం వీరధర్మం అని వీరికి జపాన్ సైనిక ఉద్యోగులు బోధించినారు. ఎయిత్‌రూట్ ఆర్మీవారు ఫిరంగులతోనూ, తుపాకులతోనే గాక ప్రచారక అస్త్రముల సైతం ఉపయోగించి శత్రుసేనలను జయించుతూవున్నారు. "మీరు యుద్ధం మానివేయండి. మా పక్షం చేరండి. మాతోబాటు స్వాతంత్ర్యమును అనుభవించండి" అని చైనా ఉద్యోగులు జపాన్ సైనికులలో ప్రచారం చేస్తూవున్నారు. ఈ ప్రచారఫలితముగా వందలాది జపాన్ సైనికులు స్వపక్షమును వదలివచ్చి చైనావారిని చేరుతూవున్నారు. వీరిలో చాలా మంది తిరిగి సైన్యంలోచేరి జపాన్ సేనలను ప్రతిఘటించుచున్నారు. కరపత్ర ములద్వారా జపాన్ సైనికులలో విప్లవ ప్రచారమును సాగించుతూ వున్నారు. ఫాసిజం ప్రతికూలురయిన ఈ జపాన్‌వారిని భారత వైద్యులు కలుసుకొనినారు. ప్రజా సత్తాకములోనూ, అభ్యుదయ ఉద్యమములలోనూ వీరు కనబరచిన ఆసక్తి సామ్రాజ్యతత్వము, ధనస్వామ్యము అంటే వీరికిగల అసహ్యము భారత వైద్యు లకు నచ్చినది. సాధారణమైన రైతు కుటుంబములనుంచివచ్చే జపాన్ సైనికులను అభ్యుదయ మార్గములలోకి మార్చివేయడము సులభమే. కాని సేనానులు, సైనిక

ఉద్యోగులు మాత్రము ఏమిచేసినా మార్పుచెందరు. ప్రజాస్వామిక సిద్ధాంతములు వీరిని ఆకర్షింపలేవు. సామ్రాజ్య వ్యతిరేక వాదము వీరి తలకెక్కదు.

* * *

రెండు వారములు విశ్రాంతి దొరికినది. ఇక్కడి వివిధ శాఖల కృషిని పరిశీలించడము పూర్తి అయినది. వెంటనే తమపని ప్రారంభించినారు. సైనిక చికిత్సాలయములకు చెందిన భాగములు అన్నీ ఒకేచోట లేవు. దగ్గర దగ్గర గ్రామములలో వీలునుబట్టి ఏర్పాటు చేసినారు. అన్నింటికీ వీలుగావుండిన ఒక గ్రామములో చికిత్సా కేంద్రమును ఏర్పాటుచేసినారు. ఇక్కడ మందులు తయారు చేసి నిలువచేస్తారు. శస్త్రచికిత్సలు అన్నీ ఇక్కడనే జరిపించుతూ వుంటారు. వ్యాధిగ్రస్తులను పరీక్షచేయడానికి వైద్యులే గ్రామ గ్రామానికి వెళ్ళవలసి వుంటుంది. 'కాలి నడక'నే ఈ గ్రామాలకు పోయిరావలసివున్నది. ఉత్తర చైనాలో దారుణమైన చలి. ఆ అతిశీతల ప్రదేశములలో ఇది అంత ఆనందప్రద మైన అనుభవము కాదు.

భోజన సౌకర్యములు అంత తృప్తికరముగా లేవనే చెప్పాలి. "ఎయిత్ రూట్ ఆర్మీ" ఆహారము అంత పుష్టికరమైనది గాదు. డాక్టర్ అట్టాల్ ఆరోగ్యము బొత్తుగా చెడిపోయినది. నెత్తురుకూడా పాడైపోయినది. ప్రమాదకరమైన కురుపు ఒకటి లేచినది. భారత దేశమునకు పోయి ఆరోగ్యము బాగుచేసుకోవల సినదని తోటి వైద్యులు అట్టాల్‌కు సలహా ఇచ్చినారు. ఆ ప్రకారము ఆయన మార్చి మాసములో యెనాన్‌కు బయలుదేరినారు. ఒకటిన్నర సంవత్సరము దళ నాయకుడుగానూ, ఆదర్శ సహచరుడుగానూ వుండిన అటాల్ వెళ్ళిపోవడము వలన ఏర్పడిన వెల్తిని కొట్నీస్, బాసు చాలా కాలమువరకు భర్తీ చేసుకొనలేక పోయినారు. ఆయన లేని లోటు వారికి అనుక్షణము కనిపించుతూనే వుండేది.

ప్రళయకాలమున ప్రత్యేక వ్యక్తిగత భావాలు, అభిమానాలు దూరముగా ఉండిపోవలసినదే. ఒక్కొక్క సమయమున ప్రేమ, వాత్సల్యము కల్గిన మిత్రులు సైతము కడగా ఉండవలసివస్తుంది. భారతీయ వైద్యులు పనిచేస్తూవున్న ఆసుపత్రులు రణరంగమునకు ఎంతో దూరముగా వున్నవి. అక్కడ గాయపడిన

సైనికులు ఈ ఆసుపత్రులు చేరడానికి రెండు మూడు రోజులుకూడా ప్రయాణము చేయవలసి వుంటుంది. కొందరు మార్గమధ్యములోనే మరణించేవారు. మరికొందరిస్థితి విషమించుతూ ఉండేది. భారతవైద్యులకు తరుచు డాక్టర్ బెదూన్ మాటలు స్ఫురణకు వస్తూవుండేవి. "గాయపడినవారు తమవద్దకువచ్చేవరకూ వైద్యులు ఆగివుండరాదు. వైద్యులే వారివద్దకు వెళ్ళవలె" అని బెధూన్ చెప్పినాడు. ఇతడు ధీరుడు; ప్రతిభావంతుడు. ఈయనే సంచారక ఆసుపత్రులను ఏర్పాటు చేసినవాడు. ఈయన ఒక కెనడా ఆదర్శవాది. ఈయన పద్ధతి మూలకముగా సమరభూమికి సమీపములో—దాదాపు రెండుమైళ్ళ లోపునే—గాయపడిన సైనికులకు వెంటనే చికిత్స చేయడము సాధ్యమైనది. ఇలాంటి సంచారక చికిత్సా దళములో ఒక వైద్యుడు, ఆయనకు తోడుగా వుండగల మరొక వైద్యుడు, వైద్యుల సూచనల ప్రకారము మందులను తయారుచేసి ఇవ్వగల కాంపౌండర్ ఒకడు, ఇద్దరు పరిచారికలు మాత్రమే వుంటారు. వీరి సామానును తీసుకువెళ్ళేటందుకు ఒక గుర్రం వుంటుంది. వీరు. నిమిషాలమీద ఎక్కడికైనాసరే కబురు వచ్చీరావడముతో బయలుదేరి వెళ్ళడానికి. తయారుగా వుండాలి.

. ఈవిధమైన సంచారక చికిత్సా దళమును ఏర్పాటుచేయ బాసు, కొట్నిస్‌లు ఉత్సహించినారు, అధికారులున్నూ అందుకుసమ్మతించినారు. కాని కొంతజాగ్రత్త అవసరం అని భావించి, నిర్విరామముగా సమరము సాగుతూవున్న ప్రాంతమున గాక, మెరుపు యుద్ధము సాగించు దళములకు అదనపు సాయముగా ఉండునట్లు ఏర్పాటు చేసినారు. భారతీయ వైద్యులకు ప్రాణాపాయము సంభవించకుండగలందులకే అధికారులు ఈ ఏర్పాటు చేసినారు. ఒక మాసము రోజులు వీరు ప్రత్యక్షముగా పోరాటము జరుగుతూవుండిన ప్రదేశములోనే ఉండి పనిచేసినారు. హమేషా సైనిక దళమువెంట వుండి ఆ దళముతోబాటు తిరుగుతూనే వుండేవారు. ఈ దళము అకస్మాత్తుగా అక్కడక్కడ శత్రువు పైనబడుతూవుండేది. ఏ నిమిషములో ఏమూలకు వెళ్ళవలసి వుంటుందో తెలిసేదికాదు.

"ఎయిత్‌రూట్ ఆర్మీ" సైనిక చర్యలను స్వయముగా ప్రత్యక్షముగా చూడడానికి భారతీయ వైద్యులకు వీలు కలిగినది. వీరు అంటివున్న సైనికదళం అన్ని హంగులూ కలిగివున్నది. శత్రువునుంచి అపహరించిన, పట్టుకొనిన మర

తుపాకులు విస్తారముగా వున్నవి. గాయపడిన సైనికులను రైతు వాలంటీరులు నిమిషాలమీద వీరివద్దకు తీసుకువస్తూ వుండేవారు. ప్రథమ చికిత్సచేసి వెంటనే పెద్ద ఆసుపత్రికి పంపించివేసేవారు. ప్రజలు, సైన్యముతో బాగా సహకారము చేస్తూ ఉండినందువల్ల అన్ని పనులూ సునాయాసముగా, సవ్యముగా జరిగిపోతు వుండేవి. రైతులు ఏపనికి పడితే ఆపనికి సర్వదా సిద్ధముగా వుండేవారు. రోగులకు పండ్లు తీసుకురావడము దగ్గర్నుంచి, తాత్కాలిక ఆసుపత్రుల నిర్మాణము వరకూ వీరు చేస్తూవుండేవారు.

ఇక్కడ ఒక నెల వుండినారు. ఇక్కడనుంచి వూటైకు వెళ్ళవలసినదిగ భారతీయ వైద్యులకు ఉత్తరువులు వచ్చినవి. ఇంతకుపూర్వం అక్కడ డాక్టర్ బెథూన్ వుండేవాడు. ఏప్రిల్ మాసములో బయలుదేరి వీరు 1600 మైళ్ళు ప్రయాణముచేసి సెప్టెంబరు మాసములో హోపె—ఛాహార్—షాన్సి సరిహద్దు ప్రాంతమును చేరినారు. జపాన్ సేనలను తప్పించుకుంటూ పోవలసివచ్చినందున ఈ విధముగా ఎక్కడెక్కడికోపోయి, ఎన్నో ఇబ్బందులు పడవలసి వచ్చినది. ఈ ప్రయాణములో వీరు దాదాపు పెకింగ్ వరకూ వెళ్ళినారు. ఆ అమర నగరమును వీరు జులై మాసములో చూచినారు. పర్వతాగ్రమునుంచి పట్టణమును యావత్తూ చూచినారు. రాత్రివేళ అవడమువల్ల కాంతివంతమైన దీపాలతో దగద్ధగాయ మానముగా వున్నది. కాని అది చైనా కళ, సంస్కృతి, నాగరికతలకు కేంద్రముగాక జపాన్‌వారి సైనిక స్థావరము అనే విషయము తలుపుకు వచ్చేసరికి విషాద అనుభవం కలిగినది.

ప్రయాణము ఏమీ ఖులాసాగా లేదు. ఎన్నో దఫాలు వీరు శత్రుశ్రేణుల రహదారుల దాటిపోవలసి వచ్చినది. ఈ విధమైన ప్రయాణమునకు అలవాటుపడి వున్నా ప్రమాద భరితమైన ప్రయాణం గదా! ఒక్కొక దఫా శత్రురక్షణ స్థావరలకు దాదాపు అరమైలు లోపునుంచి పొలాల మీదుగా ప్రయాణము చేయవలసి వచ్చేది. హెచ్చుగా రాత్రిపూటే వీరు ప్రయాణము చేస్తూవుండేవారు. ఒకరోజు రాత్రి వీరు మరీ దగ్గరగా శత్రుస్థావరాలమీదుగా వెళ్ళవలసి వచ్చింది. డాక్టర్ బాసుకు నిద్దరమత్తు ఏర్పడినది. మత్తు వదిలించుకోవాలని సిగరెట్‌తీసి అంటిం

చాటుచున్నది. రైతుల బలవంతపరచి వారి ఇళ్ళకు దూరముచేసి ఈ కట్టడము పనిచేయించిన గాథలు ఇప్పటికీ బుర్రకథలద్వారా వినవచ్చుచున్నవి. నవకవులు, ఆధునిక జీవితము ననుసరించి ఈ బుర్రకథలను తిరిగి వ్రాసినారు. జపాన్‌ను ప్రతిఘటించుచున్న లక్షలాది చైనా ప్రజల రక్తమాంసముల సముదాయమును ఈ కట్టడముతో పోల్చినారు. బాంబుల కురిపించు విమానములను, అడ్డులేని టాంకులను, భారి సైనిక శకటములను ప్రయోగించు ఆధునిక శత్రువునుండి ఈ ప్రాచీన కట్టడము రక్షణ ఇవ్వలేదు. కాని శత్రుపురోగమనమును అరికట్టడానికి అప్రతిహతమైన చైనా ప్రజల ప్రతిఘటనాశక్తి ఫలితముగా—నిర్బంధ కార్మిక సేవవల్లగాక, ఇష్టములేని బానిసల కష్టమువల్లగాక—ఏర్పడిన ఈ మానవ సముదాయమను కొత్త కట్టడము ప్రయోజనకారి కాగలదు.

* * *

సెప్టెంబరు మాసమున చహార్ రాష్ట్రములోని లైయు అన్ను కొట్నిస్, బాసు చేరుకోకలిగినారు. రెండు విడి విడి దళములనంటి పనిచేయుటకు సంచార చికిత్సాలయములను ఏర్పాటు చేయవలసినదిగా, వారిని ఆదేశించినారు.

బాసు పనిచేస్తూవున్న దళము డంగ్‌టున్‌పో గ్రామమును పునరాక్రమింపవలసి వచ్చినది. ఆ గ్రామమును ఒకే ఒక జపాన్ దళము కేవలము మర తుపాకులతో మాత్రమే కాపాడుతూవున్నదని చైనావారికి వర్తమానము వచ్చినది. ఈ దాడిలో ప్రమాదములు హెచ్చుగా వుండవచ్చునని భావించుటవలన బాసు చికిత్సాదళము, పోరాటము జరుగుతూవున్న తావుకు ఒకమైలు దూరమునకు లోపునే వుండవలసి వచ్చినది. 1500 మంది చైనా సైనికులు ఈ దాడిని సాగించినారు. రాత్రి అంతా పోరాటము సాగుతూనేవుంది. గాయపడినవారిని ఎప్పటికప్పుడు డోలీలలో చికిత్సాస్థానమునకు తీసుకొనివస్తూ వున్నారు. తెల్లవారేసరికి శత్రు తుపాకుల సద్దుమణిగినది. వీరు జపాన్ ప్రధాన కార్యస్థానమునకు పంపిన రేడియో సందేశమువల్ల వారిదగ్గర మందుగుండు సామగ్రి నిండుకొన్నట్లు తెలిసిపోయినది. ఈ సందేశమునకు సమాధానముగా ఒక విమానము మందుగుండు సామాగ్రిని పారచూట్లుద్వారా పంపినది. కాని గాలి వాలు అనుకూలంగా లేకపోయినందున ఈ గాలి గుమ్మటాలవారు మరో ప్రాంతంలో దిగవలసి వచ్చి

నది. ఈ 20 మందినీ వెంటనే చైనావారు పట్టుకున్నారు. ఇందు అయిదు లక్షల తోటాలు, మంచి ఖరీదైన సిల్కుతో తయారయిన గాలి గుమ్మటాలూ దొరికినవి. అంతేగాక అంతర్జాతీయ ధర్మసూత్రములకు విరుద్ధముగా జపాన్‌వారు "ఢం. ఢం" తోటాలను ప్రయోగించుతూ వున్నట్లుకూడా స్పష్టమైంది. ఈ తోటాలు గుండెలోగాని, కడుపులోగాని దూరుకుంటె ఇక మనిషి బ్రతకడము అనేది వుండదు. ఈ తోటా మందు శరీరములో ఏ భాగములో చిక్కుకుంటే ఆ భాగమును నరికి వేయవలసినదే!

* * *

అదనపు సప్లయిలు రాగల అవకాశములు లేవని నిర్ధారణ చేసుకొని జపాన్ సైనికులు తమ స్వాభావిక పద్ధతిని అనుసరించి హత్యచేసుకున్నారు. అక్కడవుండిన 120 మందిలోనూ 25 మందిమాత్రమే బ్రతికినారు. వీరు తప్ప తాగి, స్త్రీల చెరచి, పురుషుల చంపి, నానా అపభ్రంశపు పనులుచేసి పెద్ద ప్రేలుడు ముద్దలను జోరాలలోవుంచి, వానిని శరీరమునకు చుట్టుకొని నిప్పుల్లో దూకినారు. ఇదే హారకిరి! అపజయము అనివార్యమని తెలిసినప్పుడు జపాన్‌వారు అనుసరించు ఆత్మ విధ్వంసక విధానము యిదే.

చైనా సేనలు ఆ గ్రామమును ప్రవేశించినప్పుడు అతి భయంకరమగు దృశ్యములు కన్పించినవి. కాల్చివేయబడిన గుర్రములు, తగలబడుతున్న మందు సామాగ్రి గొట్టాలు, కాలిపోయిన శకటములు, కుప్ప తిప్పలుగా పడివున్న మానవ అస్థిపంజరములు—ఇవే వీరికి కన్పించినవి. చైనా సైనికులను చూచి గ్రామస్థులందరూ మూల మూలలనుంచీ మూగినారు. అనేక వారాలుగా వీరు మనోవ్యాకులతతో బాధ పడుతూ వున్నట్లు వీరి ముఖాలు తెలియజేసినవి వయోవృద్ధులగు తండ్రులు పసికందులగు తమ పిల్లలను తీసుకొని చికిత్స కోసరము వచ్చినారు. జపాన్ వీరుల అత్యాచారములను బాసు ప్రత్యక్షముగా చూడ కలిగినాడు.

లైయువాన్ ప్రాంతమును చైనా సేనలు తిరిగి ఆక్రమించినవని వీరి పరప్రాంతముల రైతులు అమితోత్సాహంతో సైనికునికు రకరకాల బహుమతు

తీసుకు వచ్చినారు. మిత్రులు మరల ఒకరి నొకరు కలుసుకో కలిగినారు. వీరి ఆనందానికి అంతులేదు. లైయువాన్‌లో ప్రజలు భరించిన కష్టాలనుంచి భవిష్య త్తును గురించి కొత్త ఆశలు కలిగినవి. క్రమక్రమంగా గ్రామం తరువాత గ్రామం శత్రు అధీనంనుంచి సంపాదింపగలం అనే ధైర్యం, నమ్మకం కలిగింది చైనా సేనలకు.

డాక్టర్ కొట్నిస్‌కూడా బాసు పొందినమాదిరి అనుభవాన్నే పొందినాడు. అతను పనిచేస్తూవున్న సేన, ఇలాగే ఒక గ్రామమును ఆక్రమించినది. ఇరు వురూ ఫూపింగ్‌లో కలుసుకొనినప్పుడు ఒకరి అనుభవాలను మరొకరికి చెప్పు కొనడానికి చాలా విషయాలు వున్నాయి. డాక్టర్ బెథూన్ స్మారకచిహ్నంగా "బెథూన్ అంతర్జాతీయ శాంతి చికిత్సాలయము"ను, వైద్య పాఠశాల నొక దానిని ఫ్యూపింగ్‌లో ఏర్పాటుచేసినారు. కొట్నిస్‌కు చైనా భాష బాగావచ్చి వున్నందున అతన్ని ఈ పాఠశాలలో అధ్యాపకులుగా పనిచేయమన్నారు. డాక్టర్ బాసును యెనాన్ పంపినారు.

రెండు సంవత్సరముల సహచర్యం అనంతరం ఉభయులకూ ఎడబాటు ఏర్పడినది. తిరిగి కలుసుకొని, భారతదేశానికి కలసి వెళ్ళడానికి నిశ్చయించుకొని నారు. కాని తిరిగి కలుసుకోలేమని వారికి ఏమి తెలుసు?

---

# 15. ప్రజా స్వామికమునకు నమూనా

లేవండీ :
బానిసలుగ నుండనొల్లని
మీరంతా, లేవండీ :
మన రక్త, మాంసములతో
నవ్య ప్రపంచమును నిర్మిద్దాం.
కష్టకాలము దాపురించెనూ
ప్రతి పౌరుడు ఎలుగెత్తి చాటవలెనూ.
లేవండీ :
ఏక హృదయముతో
లక్షలాదిగా మనమున్నాం
శత్రు ఫిరంగుల, అగ్నిజ్వాలల
నెదిరించిన సైన్యంగా మనమున్నాం.

—చైనా జాతీయగీతం.

ఆరువందలమైళ్ళు కాలి నడకను ప్రయాణంచేసి బాసు యెనాన్ చేరుకున్నాడు. రెండుమాసములు పట్టింది. ఇతనివెంట చాలామంది చైనా కాందిశీకులున్నూ వున్నారు. అనేక దఫాలు జపాన్‌వారు వీరిని వెన్నాడినారు. మారుమూలల గ్రామాలలో సైతం చిన్న ఎత్తుగ మామూలు రైతుల అవసరాలను తయారుచేయడానికి పరిశ్రమలను స్థాపించినారు. ఔషధాల కొరతే నానాటికీ ఎక్కువవుతూ వున్నది. జపాన్ ఆక్రమణక్రిందనున్న పట్నంనుంచి మందుల సంపాదించి చైనాలోకి చేరవేయడము ఒకమారు మాత్రం సాధ్యమైంది. ఈ సంగతి జపాన్‌వారు తెలుసుకొనినారు. అప్పట్నుంచీ మందుల కంట్రోలు చర్యల నెక్కువ చేసినారు. చైనావారు స్వయంగానే మందులు తయారుచేసుకోవడము ప్రారంభించినారు. ఒక సహకార యంత్రాగారములో గాయాలకు కట్లు కట్టడానికి అవసరమైన దూది, గుడ్డ వగైరాలను, చిన్నచిన్న శస్త్రచికిత్సా పరికరములనూ తయారుచేయడాన్ని బాసు ప్రత్యక్షంగా చూచినాడు. ప్రాచీన వైద్యవిధా

మును పునరుద్ధరించడానికి గట్టి ప్రయత్నములు, పరిశోధనలు జరుగుతూ వున్నవి. మందు లన్నింటినీ మాత్రలుగా తయారుచేసినారు. కొన్నిరకాల మందులను మాత్రం తయారుచేయలేక పోయినారు.

1940 డిసెంబరులో బాసు యెనాన్ చేరగా అతనిని అంతర్జాతీయ శాంతి ఆస్పత్రిలో ముక్కు, నోరు, చెవి, కన్ను శాఖకు ప్రధాన వైద్యునిగా నియమించి నారు. లోగడ వీరు ఏర్పాటుచేసిన ఆదర్శ చికిత్సాలయమునే ఇప్పుడు ఈ విధ ముగా మార్చినారు. యెనాన్‌కు దగ్గర యీ ఆసుపత్రిని స్థాపించినారు. వెనుకటి లాగానే ఇప్పుడున్నూ ఈ ఆస్పత్రిని గుహల్లోనే ఏర్పాటుచేసినారు. గాని వేరే ప్రత్యేకంగా కొన్ని కుటీరాలనూ ఏర్పాటుచేసినారు. అక్కడేవుండి చికిత్సపొం దుతూ వున్నవారు ఒక ముప్పదిమంది బాసు అధీనములో వుండినారు. దినమూ ఒక వందమందివచ్చి మందుపుచ్చుకు పోతూవుంటారు. అక్కడ ప్రత్యేక ప్రవీ ణులు అంటూ ఎవ్వరూ లేనందున అన్నివ్యాధులలోనూ బాసుగారే ప్రత్యేకనైపు ణ్యాన్ని సంపాదించుకోవలసి వచ్చినది.

షాంఘై, కాంటన్‌లో నాటువైద్యంచేసే భారతీయులవల్ల, ప్రత్యేకం కంటి జబ్బులను కుదుర్చడములో భారతీయులు ప్రత్యేక ప్రతిభగలవారని పేరువచ్చింది. ఈ వర్తమానం నాలుగుమూలలకి తెలిసేసరికి ప్రతినిత్యమూ వందలమంది కంటి చికిత్సకోసరము వస్తూవుండేవారు. మరీ వింత కేసు ఒకటి వచ్చినది. ఒక రైతు యువకునికి—రణరంగంలో బాంబు ప్రేలి ఆ ముక్కలు కంట్లో పడి చూపు పోయింది. కంటి నరాలు పూర్తిగా దెబ్బతినిపోయినవి. సైన్యంలోనుంచి అతనిని పంపించి వేసినారు. ఆ తరువాత అతనికి మరో దురవస్థ పట్టినది. అతనిభార్య అతనిని వదలివేసి వెళ్ళిపోయినది. ఆమెను అతడు విపరీతముగా ప్రేమించినం దున ఆమె పోవడముతో పిచ్చెత్తింది. ఆ స్థితిలో బాసుపేరు విన్నాడు. అమాంతం బాసు వద్దకు పరుగెత్తుకు వచ్చినాడు.

బాసు రెండు కళ్ళనూ అతి జాగ్రత్తగా పరిశీలించినాడు. ఒక కన్నును బాగుచేయడం సాధ్యంకాదని నిర్ధారణ చేసినాడు. రెండవకన్నుకూ శస్త్రచికిత్స చేయవలసి వున్నది. ఆ తరువాత చూపువస్తే రావచ్చునని చెప్పినాడు. కాని బాసువద్ద అంత సునిసితమైన శస్త్ర చికిత్స చేయడానికి పనికరములు లేవు.

ఊరంతా గాలించినారు. పరికరములు దొరుకలేదు. గ్రామ కమ్మరికి మాదిరి చూపించి తయారుచేయించినారు. అవి మరీ మోటుగావున్నవి. కర్రలతో మంచి పదునైన పనితరములనే తయారుచేయవచ్చునని ఒకరు సూచించారు. ఇంతలో ఎవరో ఒకరు మీసాలు కత్తిరించుకుంటూ వుంటున్న కత్తెరను చూచినారు. వెంటనే వెళ్ళి దానిని తీసుకువచ్చి, బాగుచేసి, బాసు ఫలప్రదంగా శస్త్ర చికిత్స చేసినాడు. చికిత్సాక్రమం పూర్తికానేలేదు. అతడు "నాకు కన్పిస్తూవుంది. నేను చూడగలిగాను" అని కేకలు వేసినాడు.

ఈ కథ సుఖాంతం గమనించ తగింది. అతని భార్య తిరిగి అతనివద్దకు వచ్చింది. అతను మళ్ళీ తనదేశ స్వాతంత్ర్యంకొరకు పోరాడడానికి సైన్యంలో చేరినాడు!

భారతీయ వైద్యులు చికిత్స చేసిన 25,000 మంది లోనూ ఇతడొకడు!

* * *

1940 డిసెంబరునుంచి 1943 జూన్ వరకూ బాసు యెనాన్‌లోనే వున్నాడు. అంతకుపూర్వపు పనితో పోల్చిచూస్తే ఈ రెండున్నర సంవత్సరములూ మామూలుగానే గడిచిపోయినవని చెప్పవచ్చు. ఈ సమయంలో వేల రైతులకు చికిత్స చేయడం అలావుండగా పెద్ద పెద్ద వారున్నూ ఇతనివలననే చికిత్సపొందినారు. మావ్‌ట్సీ టంగ్, చూటేలకున్నూ ఇతను వైద్యంచేసినాడు.

అక్కడ యెనాన్‌లో వివిధ జాతులవారు వుంటూ వున్నారు. కొరియావారు, ఫార్మోజావారు, జావావారు, సయాం దేశీయులు, మలయా దేశీయులు, ఫాసిస్టు వ్యతిరేక జపాన్‌వారూకూడా వుంటూవచ్చినారు. ప్రాచ్యదేశాల ఫాసిస్టు వ్యతిరేక సంఘం ఒకదాన్ని బాసు స్థాపించినాడు. జనరల్ చూటే యీ సంఘ అధ్యక్షుడు. రెండువందలమంది సభ్యులు వున్నారు. రేడియో, ఉపన్యాసములు, కరపత్రములు—వీటిద్వారా ఫాసిస్టు వ్యతిరేక ప్రచారము చేయడమే ఈ సంఘోద్దేశ్యం.

కొద్దిరోజులలోనే ఈ సంఘం బాగాపనిచేయడము ప్రారంభించింది. పరిహద్దు ప్రభుత్వం ఈ సంఘంను గుర్తించింది. ప్రాంతీయ పార్లమెంటుకు ప్రతినిధులను పంపే హక్కు ఈ సంఘమునకు ఇచ్చినది. ఈ పార్లమెంటుకు పాఠశాలలు, కళాశాలలు, రాజకీయ—సారస్వత సంఘములు ఇవన్నీకూడా ప్రతినిధులను పంపుతవి.

వీరుగాక ఇతర నియోజకవర్గములనుండి ఎన్నిక అయినవారున్నూ ఈ పార్ల మెంటు ప్రతినిధులుగా వుంటారు. యుద్ధం తీవ్రంగా సాగుతూవున్నా, సంవత్స రంలో రెండు మూడు దఫాలు గ్రామాలు గ్రామాలు చేతులుమారుతూవున్నా వయస్కులందరికీ వోటు అన్న సూత్రాన్ని అనుసరించి ఎన్నికలు జరుగుతూనే ఉన్నవి. యుద్ధకాలములో ఎన్నికలు జరుపడానికి వీలులేదు అనే సామ్రాజ్య వాద పాలక వర్గాల సిద్ధాంతం అర్థరహితం అని వీరు ఋజువు చేసినారు.

అన్ని దేశాలలోనూ, అన్యదేశీయులు పౌరహక్కులను సంపాదించడానికి ఎన్నో ఇబ్బందులు ఉంటవి. కకేషియన్ జాతికి చెందనివా రెవ్వరికీ అమెరికాలో పౌరస్వతం లభించదు. దక్షిణాఫ్రికాలో భారతీయులకు వోటు హక్కులేదు. కాని యుద్ధకాలపు చైనాలో పౌరసత్వం లభించడానికి ఇతర అర్హతలు ఏమీ అవసరంలేదు. చైనా ఉద్యమాలలో సంపర్క సంబంధాలు ఉంటేచాలు. పార్ల మెంటు సభ్యత్వం సైతం లభించుతుంది. ప్రాచ్య రాజ్యాల ఫాసిస్టు వ్యతిరేక సంఘం పార్లమెంటుకు బాసును ఎన్నుకోవడంతో ఇది బాగా ఋజువు అయింది. అంతేకాదు. ఖైదీలుగా చిక్కిన జపాన్‌వారికి ప్రబోధం చేయడమునకుగాను ఒక పాఠశాలను యెనాన్ సమీపములో ఏర్పాటు చేసినారు. ఈ పాఠశాల ప్రతినిధు లుగా ప్రాంతీయ పార్లమెంటుకు ఇద్దరు జపాన్‌వారు ఎన్నిక అయినారు. అన్ని వర్గాలవారికీ ఇందులో ప్రాతినిధ్యం వున్నది. రచయితలు, విద్యావంతులు, రైతులు, భూస్వాములు (సిల్కు గౌనులుధరించి కొవ్వి వున్నవారు), స్త్రీలు, సైనికులు, ఉద్యోగులు అందరికీ ప్రాతినిధ్యం వున్నది. మంగోలియన్లు, టిబెటన్లు, మంచూకో దేశీయులు, ముస్లింలుకూడా ఈ పార్లమెంటుకు ప్రతినిధులను పంపే హక్కున్నది. ఇతర అల్పసంఖ్యాక వర్గమునకున్నూ ప్రాతినిధ్యం ఇచ్చినారు పార్లమెంటులో. చైనా పార్టీలలోకూడా క్యుమింటాంగ్, కమ్యూనిస్టులకూ ప్రాతి నిధ్య ఉంది. మొత్తం పార్లమెంటు సభ్యులలో మూడోవంతు మాత్రమే కమ్యూ నిస్టుపక్ష సభ్యులు వుంటారు. చైనా భవిష్యత్తు ప్రజా సత్తాక నమూనాయే ఇది!

బాసు 1941 నవంబరులో ఈ పార్లమెంటుకు సభ్యుడుగా ఎన్నుకోబడి నాడు. అప్పటినుంచీ చైనా వదలివచ్చేవరకూ బాగా ఈ పార్లమెంటు కార్యక్రమ ములో పాల్గొంటూవచ్చినాడు. ఇప్పటికీ ఇతను ఈ పార్లమెంటులో సభ్యుడే.

ఆ ప్రాంతము ఆరోగ్య పరిస్థితిని పరిశీలించి అభివృద్ధి పరచుటకు సూచనలు చేయవలసిందిగా ప్రభుత్వము కోరినది. చర్చకు వచ్చిన ప్రతి విషయంమీదా అందరూ స్వేచ్ఛగా మాట్లాడినారు. శాసనసభ ప్రారంభం అప్పుడు మావ్‌ట్సీ టంగ్ తన పార్టీ సభ్యులనే, ఐక్య సంఘటన విషయమై తగిన శ్రద్ధవహించడము లేదని విమర్శించినారు. ప్రజాస్వామిక పరిపాలనలో పాల్గొనడానికి అల్పసంఖ్యాక వర్గములను ఆహ్వానించవలెనని, ప్రజల జపాన్ వ్యతిరేకాంగణమును విచ్ఛిన్నం చేయగల జాతి తత్వములకు తావు ఇవ్వరాదనీ హెచ్చరించినారు.

అయిదు సంవత్సరములు నిర్విరామముగా పనిచేసిన తరువాత 1943 జూన్‌లో భారత దేశమునకు తిరిగి రావాలని బాసు సంకల్పించినాడు. తనదేశములో అనేక ప్రధాన సంఘటనలు జరుగుతూ వున్నవి. పూర్తి వివరములు అతనికి తెలియడము లేదు. అతి సంగ్రహంగాను, పాక్షికంగాను వచ్చే రాయిటర్ వార్తలవల్ల నిజస్థితి తెలుసుకోవడానికి వీలుగాలేదు. భారత దేశంలోని నిజపరిస్థితిని తెలుసుకొని సంబంధం ఏర్పరచుకోవడానికి భారతదేశమునకు వెళ్ళి తీరాలి. తన చైనా మిత్రులను వదలి పోవడానికి విచారపడినాడు. కాని వారికోసరమే తను భారతదేశానికి వెళ్ళాలి. వీలైతే ఎక్కువ మందులు తీసుకొని ద్వితీయ వైద్య దళంతో చైనాకు తిరిగి రావాలనుకున్నాడు.

అతనికి వీడ్కోలు ఇవ్వడానికి ఎన్నో విందులు చేసినారు. సభలు జరిపినారు. ఆసందర్భంలో చైనావారు వెల్లడించిన సుహృద్భావం ఆయన హృదయమును ద్రవింపచేసినది. ముఖ్యంగా ఆయన నయంచేసిన రోగులు తెలిపిన కృతజ్ఞత మరీ జాలి కలిగించింది. కొందరు కన్నీరు కార్చినారు. ఒక విద్యార్థి "మీరు దయచేసి తిరిగి వచ్చి నా కళ్ళు బాగుచేయాలి. లేకుంటే నాదేశంకొరకు నేను ఎలా పోరాడగలను?" అన్నాడు.

బాసు హృదయ భారానికి మరొక కారణంకూడా వున్నది. భారతదేశానికి తనూ, కొట్నీస్ కలసి వెళదామనుకున్నారు. యెనాన్‌నుంచి చుంగ్‌కింగ్‌కు విమానములో బయలుదేరేటప్పుడు అతని మనోవేదన విపరీతముగానుండెను. కొట్నీస్ తనవెంటరావడములేదు. కొట్నీస్ మరి ఇక ఎన్నటికీ భారతదేశానికి తిరిగిరాడు. అతను మరణించినాడు.

---

# 16. ఒకడు మరలి రాలేదు!

చూడు! అంతరాత్మ, భగవంతుని ఉద్దేశముల ఆదినుంచి గమనించలేదా ?
భూమినంతనూ సంబంధ బాంధవ్యములతో ఒకటిచేయలేదా ?
జాతులూ, ఇరుగూ—పొరుగూ వివాహం చేసుకోవడమూ, వివాహాలు చేయడమూ,
సముద్రముల దాటడమూ, దూరపువారిని దగ్గరకు చేపడమూ !
దేశములన్నీ కలియగట్టడమూ.

—వాల్ట్ విట్మన్

బాసు యెనాన్‌కు వెళ్ళిపోయిన తరువాత హూపింగ్‌లో కొట్నీస్ ఒక్కడే ఉండిపోయినాడు. బెథూన్ స్మారక చికిత్సాలయమును, పాఠశాలను ఏర్పాటు చేయడములో పూర్తిగా నిమగ్నుడై పోయినాడు. చైనా భాషను బాగా ధారాళంగా మాట్లాడటం నేర్చుకున్నాడు. ఆ స్థానంలో ఏ చైనా డాక్టరు ఉన్నా ఏ విధంగా చేసేవాడో అంత సమర్థతతోనూ కొట్నీస్ వ్యవహారమును నిర్వహించినాడు. ఉత్సాహం, శ్రద్ధతో తనపనికి పూనుకొనినాడు. దేశంమీద ప్రత్యేక అభిమానము ఏర్పడినది. దారుణ యుద్ధమును సాగించుతూవున్న చైనాను ప్రత్యక్షముగా చూచేసరికి, స్వంతంగా అన్ని అనుభవములను పొందడమువల్ల పూర్తిగా ఫాసిస్టు వ్యతిరేకి అయినాడు. మంచి పట్టుదల ఏర్పడింది. ఆర్థిక రాజకీయ గ్రంథముల పఠనం, వివిధ విషయాలమీద చర్చలు సాగించడము—వీటన్నింటివల్లా ఎయిత్ రూట్ ఆర్మీకి చెందిన తన కమ్యూనిస్టు మిత్రుల లక్ష్యములతో ఏకీభవించడం, వారి ధోరణిలోనే పడిపోవడమూ జరిగింది.

ఉత్తర చైనాలోని ప్రతిగ్రామములోనూ సేనలు వుంచడము జపాన్‌కు సాధ్యముగాని పని. అందుచేత సంవత్సరాని కొకదఫా ప్రజల భయభ్రాంతుల చేయడానికి గ్రామాలన్నింటిమీదా ఒకేదఫా జపాన్‌వారు ధ్వజం ఎత్తుతారు. అక్కడక్కడ ఉన్న గెరిల్లా దళములను నాశనము చెయడానికి ప్రయత్నిస్తారు. ఎయిత్‌రూట్ ఆర్మీ ప్రధాన కార్యాలయమూ, బెథరన్ ఆస్పత్రి, వైద్యపాఠశాల కూడా ఈ ఉపద్రవమునుంచి తప్పించుకోవలసి వచ్చినది. క్షణ క్షణమూ ఒక చోటినుంచి మరొకచోటికి మారుతూవుండేవారు. రాత్రి సమయమున ఎదురు దాడులు జరుపుతూవుండేవారు. బాసు వెళ్ళిపోయిన తరువాత మొదటిమాసము లోనే కొట్నీస్ ఈ చీకాకు కార్యక్రమములో తగులుకొనినాడు. ఈ కార్యక్రమ

మును సాగించడానికి మంచి పటుత్వం వుండాలి. రాత్రిళ్ళు నిద్దరవుండదు. తరచు తిరుగుతూ వుండాలి. సమయానికి ఆహారము లభించదు. శత్రు ఫిరంగుల మ్రోత లతో చెవులు దిబ్బళ్ళు పడిపోతూ వుంటవి. అయినా అతి సామాన్య విషయము లాగా కొట్నిస్ 1941 జనవరి 16 వ తారీఖున బాసుకు వ్రాసిన లేఖలో ఈ అను భవాల్ని పేర్కొన్నాడు—

"మీరు ఇక్కడ్నుంచి వెళ్ళిపోయిన నెలలోపునే శత్రుసేనలు "ఊడ్పులు" ప్రారంభించినవి. ఈ దఫా శత్రువు చాలా పట్టుదలతో వున్నాడు. తూర్పు చైనాలోని జపాన్ ఉన్నత సైనికోద్యోగి స్వయంగా 20,000 సైనికులను నడి పించినాడు. దాదాపు ఒక మాసమురోజులు, శత్రువుకు అందకుండా దాగుడుమూత లాడినాము. ఈ నెలరోజులూ ప్రతినిత్యమూ తిరుగుతూనే ఉన్నాము. పాఠశాల అధికారులే యావత్తు పనినీ నిర్వహించడం విశేషంగా కన్పిస్తుంది. శత్రుసంచలన మును గురించిన భోగట్టాను విద్యార్థులే సంపాదించుకు వచ్చేవారు అయిదుగురు విద్యార్థులు శత్రు పరమైనారు. ఇక నా విషయం—త్వరలో మొదటి మూడు ముతాల పరీక్షలు పూర్తిచేయ నిశ్చయం అయినందున ఇతరులమాదిరే నేను కొంచెం తీరికలేకుండా వున్నాను. రేపే పట్ట ప్రధానోత్సవం. విద్యార్థుల శస్త్ర చికిత్సా విధాన శిక్షణ త్వరగా పూర్తిచేయవలసి వున్నది. పైగా డాక్టర్ పెంగ్ శస్త్ర శిక్షణను నేనే స్వయంగా చూస్తూవున్నాను. అంచేతకూడా విరామకాలం అనే కన్పించదు. ఏమైనా ఇక్కడి జీవిత సంచలనంతో లీనమై పోయినందుకు ఈ కొద్దికాలములోనే నేను గొప్ప మార్పును పొందుతూ వున్నాను."

ఈలోపున కేవలం స్వంతానికి సంబంధించి, భావోద్రేక కారకమైన ఒక సంఘటన జరిగింది. స్వతంత్ర చైనా యెడల కొట్నిస్‌కు ఏర్పడిన గాఢ భక్తికి చిహ్నము కావచ్చును. ఒక చైనా యువతిని ప్రేమించినాడు.

ఆమె పేరు క్యూ చింగ్ లాన్. ఆమె చాలా ఖులాసా మనిషి. అందం గానూ ఉంటుంది. దాదాపు అయిదడుగుల ఎత్తు ఉంటుంది. చంద్రబింబం లాంటి గుండ్రని ముఖం. లావుపాటి సులోచనాలు ధరించి వుంటుంది. కొట్నిస్ ప్రిన్సిపాల్‌గావున్న బెథూన్ పాఠశాలలో ఆమె నర్సింగ్ విద్య చెప్పుతూ వుండేది. మొదట పేపింగ్‌లోని ఒక ధనిక కుటుంబానికి చెందినదే. యూనియన్

మెడికల్ కాలేజీలో విద్య నభ్యసించినది. యుద్ధంవల్ల ఆమె తన కుటుంబం నుంచి వేరైపోయింది. ఇలాంటివారు చైనాలో వేలుగా వున్నారు. శత్రు బారి నుండి తప్పించుకోవడానికి వందల మైళ్ళు తిరిగివచ్చి ఎయిత్‌రూట్ ఆర్మీని చేరుకున్నది.

కొట్నిస్‌వద్దనే పనిచేస్తూవున్నందువల్ల అతడు ఆమెను ఆకర్షించడములో ఆశ్చర్యము ఏమీలేదు. అతడు ఆమె దేశంకొరకు ఎంతో త్యాగము చేసినాడు. అభిమానం ప్రేమగా పరిణమించింది. ఇక కొట్నిస్ విషయంలో అతన్ని చైనాకు కట్టివేసే బంధాలలో ఇదొకటిగా తయారయినది. ఇతర చైనా యువతులవలె ఈమెకు అంత బిడియములేదు. పైగా ఆంగ్లము ధారాళముగా మాట్లాడగలదు. కొట్నిస్, ఈమె అనేక పర్యాయములు అనేక విషయములగురించి మాట్లాడు కుంటూ వుండేవారు. ఇండియా, చైనా, ప్రపంచం, ఆఖరికి తమ్ము గురించీ మాట్లాడుకుంటూ వుండేవారు. ప్రచండ యుద్ధము సాగుతూవున్న సమయంలో ఏ క్షణంలో అయినా శత్రు తుపాకీ గుండు తగిలిగాని, బాంబు పడిగాని మరణించ వచ్చు. కనుకనే శాంతి సమయంలోవలె తాపీగా ప్రణయ ప్రసంగాలు, ఇతర లాంఛనలు, తలి తండ్రుల అనుజ్ఞ ఇలాంటివాటికి వ్యవధిలేదు. అయితే ఆమెను వివాహమాడవలసిందని కోరడానికి ముందు దీర్ఘంగా విచారించినాడు. ఆమె యెడల న్యాయంగానూ, ధర్మంగానూ వర్తించినాడా? చైనాయెడల తను అపచా రము చేస్తున్నాడా? చైనా ప్రజలు తనకుచూపిన గౌరవ—మర్యాదలను, ఆదరాభి మానములను దుర్వినియోగము చేస్తున్నాడా? పాతకాలపు చైనాలో పరాయిదేశస్థు లంటే ఒక దురభిమానము వుండేది. అంతర్జాతీయ వివాహాలను చైనా సాంప్రదా యము అనుమతించదు. తన వివాహం అలాంటి భావాలకు విరుద్ధంగావుండి చైనా భారతదేశాల సౌహార్ద్రానికి, ఐక్యతకు భంగం కలిగిస్తుందా? తాను అక్కడ కేవలము కొట్నిస్‌వలె లేడు. భారత ప్రతినిధిగా వుంటున్నాడు. ఇన్ని విషయా లను ఆలోచించిగాని అతను ముందడుగు వేయడానికి వీలులేదు.

తన చైనా మిత్రులకు ఈ వివాహము సంగతిని కొట్నిస్ తెలియచేయగా వారెవ్వరూ అభ్యంతరం చెప్పలేదు సరిగదా అందరూ అభినందించినారు. చుట్టు పక్కలగ్రామాల్లోని పెద్దలు సైతము హర్షించినారు. ఎంతో సంతోషపడినారు..

యుద్ధము మహా దారుణమైనదే. కాని అనేక దురభిమానములను, ప్రతిబంధకము లను నిర్మూలించి మానవ కుటుంబంలో ప్రాథమిక ఐక్యతను ఏర్పాటుచేస్తుంది. స్వార్థరహిత సేవవల్ల ద్వారకనాథ్ కొట్నీస్ చైనా ప్రజల మన్ననలను పొంది నాడు. "చుంగో హైజా" (చైనా పుత్రుడు) అని అతన్ని ఎంతో వాత్సల్యంతో పిలుస్తూవుండేవారు. ఇప్పు డతడు చైనాకు అల్లుడైనాడు. ఇందుకు అందరూ సంతోషపడినారు. వధువు తలితండ్రులు, వరుని భారతీయ మిత్రులులేని లోటును తీర్చవలెనని వారి చైనా మిత్రులు ఎంతో శ్రద్ధ వహించి చేయకలిగినదంతా చేసినారు.

ఈ సమయంలో ఇతను బాసుకు వ్రాసిన జాబులవల్ల అతని మనస్సు ఎలా పనిచేస్తూవున్నదీ, అతను ఏమిచేస్తూవున్నదీ తెలుసుకొన వీలవుతుంది. ఈ ఉత్తరాలు యెనాన్ చేరడానికి కొన్ని మాసాలు పట్టేది. యెనాన్‌కు తిరిగి వెళ్ళే కామ్రేడ్స్‌ద్వారా వీటినిపంపాలి. వారు ఎన్నో మెలికలుతిరిగి, శత్రు ఆక్ర మిత ప్రాంతములనుంచి తప్పించుకు పోవలసివుంది. పైగా ఈ జవాబులు యెనాన్ చేరుతవనే నమ్మకములేదు. అందుచేత వ్రాసిన సంగతులనే వ్రాస్తూవుండే వాడు. 1942 జనవరి 4 వ తేదీన బాసుకు వ్రాసిన జాబులో తనుచేస్తూన్న పనిని గురించి తన వివాహమును గురించి ఇలా వ్రాసినాడు—

"గడచిన సంవత్సరములో ఇక్కడ నేను ఏమి చేసినదీ సంగ్రహంగా వ్రాస్తాను. అధికారరీత్యా గత జనవరిలో నేను ఎయిత్‌రూట్ ఆర్మీలో చేరిన తరు వాత నన్ను అంతర్జాతీయ శాంతి చికిత్సాలయమును చూడమని చెప్పినారు. ఇది వరకు ఉన్న వార్డుకు మరొకవార్డు చేర్చినాము. ఈ రెండున్నూ బెథూన్ వైద్య పాఠశాలకు అధనముగా వున్నవి. ఈ రెండు వార్డులలోనూ సగటున రెండు వందలమంది రోగులు వుంటారు. ఆస్పత్రి పెత్తనందారుగా ఉన్నందువల్ల శస్త్ర రోగుల విషయమై శ్రద్ధ వహించడముతోబాటు ఆసుపత్రి వ్యవహారకాండకూడా నేనే చూడవలసి వచ్చినది. అందువల్ల పని కొంచెం తీరికలేకుండా వుంటూ వున్నది. శస్త్ర చికిత్సలు చేయడము, ఆ రోగుల గమనించుతూ వుండటమూ విద్యార్థులకు శస్త్ర విద్య నేర్పుతూ వుండటమూ నా వైద్య కార్యక్రమమునక సంబంధించిన పనులు. సగటున దినానికి రెండు శస్త్రచికిత్సలు చేస్తూవుంటాము

కనుక ఆస్పత్రిలో రోగుల సేవ చాలా కష్టముగావున్నది. గతసంవత్సరం మొత్తముమీద 430 శస్త్ర చికిత్సలు చేసినాము.

"నేను ఇక్కడ చేస్తూవున్నపని ఇది. వైద్యశాస్త్ర విషయములో ఇక్కడ ఎవరూ ఏమీ చేయడానికి సాధ్యముకాకపోయినా, శస్త్రచికిత్సా విధానములో కొంత అభివృద్ధిని సాధించకలిగినాను.

"ఇక నా చదువు విషయం—రాజకీయాలమీద అంగ్ల గ్రంథములు లేకపోవడం గొప్ప లోటుగావుంది. యెనాన్‌నుంచి ఒక్క పుస్తకమూ రాలేదు. నాకు ఇక్కడ పుస్తకం ఏదీ దొరకలేదు. కాని ఈ సరికి చైనాలిపి బాగానేర్చుకున్నాను. 'చైనా విప్లవం' లాంటి గ్రంథాలను చదువకలుగుతూ వున్నాను. 'శబ్దార్థ చంద్రిక'ల సహాయం లేకనే పత్రికలను చదువుతూ వున్నాను. పత్రికల సంపాదకీయ వ్యాసములలో—ముఖ్యముగా యెనాన్‌నుంచి వెలువడే 'చెఫాంగ్', 'రోబాల్'—చదువతగిన విషయాలు ప్రధానంగా మార్పుచెందుతూవున్న రాజకీయ పరిస్థితుల గురించి చాలావున్నవి. ఉన్న ఇబ్బంది ఏమిటీఅంటే దేనికీకూడా వ్యవధి చిక్కడములేదు. వైద్య వ్యవహారకాండకు హెచ్చుకాలం వినియోగమౌతూవున్నది. వున్నవాస్తవం చెప్పాలీ అంటే రాజకీయసిద్ధాంతంగురించి నాకృషి నాకే సంతృప్తికరముగాలేదు.

"అయినా గత సంవత్సరము నేను సాధించిన గొప్ప విషయం ఎమిటీ అంటే నా 'నడవడి'లో మార్పు. యెనాన్ చేరడానికిముందు రాజకీయంగా నేను ఎంత వెనుకబడివున్నానో నీకు తెలుసును. నా మెదడు బూర్జువా భావాలతో నిండి వున్నది. జాతీయభావం నిండుగావున్నా విప్లవముగురించి అస్పష్టమైన అభిప్రాయాలే ఉన్నవి. ఇక్కడ సంవత్సరం పైగా వుండి "ఎయిత్‌రూట్ ఆర్మీ" సభ్యునిలా జీవితము గడుపుతూ సభల్లోనూ, సంభాషణలలోనూ సహచరుల విమర్శనల వింటూ వున్నందువల్ల నా తత్వమే మార్పుచెందినది. నా భావాలున్నూ మారినవి. అందుచేత 1941 నా జీవితములో అత్యంత ప్రధానములైన వాటిలో ఒకటిగా నేను భావిస్తున్నాను.

"భారతదేశానికి మనము మరలిపోవడముగురించి చర్చించడానికి పూర్వము నీకొక వర్తమానము తెలుపుతాను. 1941 నవంబరు 25 వ తేదీన కామ్రేడ్ క్యూచింగ్ లాన్‌ను వివాహమాడినాను. ఇక్కడ ఉపాధ్యాయుల వర్గంలో పని

చేస్తూవున్న సులోచనాల అమ్మాయే ఈ క్యూచింగ్ లాన్. దీర్ఘంగా విచారించిన మీదటే ఈ నిర్ణయానికి వచ్చినాను. ఆలోచనలతో తల నొప్పెత్తింది. వివాహానికి అనుకూలంగా నిర్ణయించడానికి దోహద మిచ్చింది యెనాన్‌లో నీవు ఏర్పాటుచేసిన ఫాసిస్టు వ్యతిరేక సంఘమే. నీవు ఆ ప్రాచ్యదేశాల సంఘములో ప్రధానపాత్రను వహించినావు. సరిహద్దు ప్రాంతప్రభుత్వములో ప్రతినిధిగాకూడా వెళ్ళినావు; ఇందువల్ల రాజకీయ కార్యక్రమంతో మునిగి తేలుతూ ఉన్నావనుకున్నాను. ఇండియాకు తిరిగిపోవాలనే తొందర నాకున్నూ లేదు. నీమాదిరే నేనున్నూ, మనం ఉభయులం కలసి భారతదేశానికి వెళ్ళవలెననీ, సాధ్యమైనంతవరకు కలసి పనిచేయవలెననీ భావించుతూ వున్నాను. యెనాన్‌కు, ఇండియాకు తిరిగిపోవడానికి ఈ వివాహం అంతరాయం కాకపోయినా, ఆలోచించవలసిన విషయమే;"

1942 జూన్‌లో కొట్నిస్ బానుకు మరొక పెద్ద ఉత్తరము వ్రాసినాడు—"ఈసరికి మీకు అనేకజాబులు వ్రాసినాను. యెనాన్‌కు వెళుతూవున్న కామ్రేడ్స్‌కు ఇచ్చిపంపినాను. వీరిలో చాలామంది, దురదృష్టవశాత్తూ, మధ్యనుంచే మళ్ళీ వెనక్కు వచ్చినారు. అందుచేత నా ఉత్తరాలు మీకు ఏవైనా అందినవో? లేదో? తెలియదు. మనమిద్దరమూ విడిపోయినదగ్గర్నుంచీ ఇంతవరకూ నేనుచేసిన పనిని సంగ్రహంగా వ్రాస్తున్నాను."

ఈ జాబులో తాను చేస్తూవున్న పనినంతనూ నివేదించిన మీదట ఇలా వ్రాసినాడు—"డాక్టర్ తరగతి విద్యార్థులకు శస్త్రచికిత్సమీద ఒక గ్రంథం వ్రాయవలసినదిగా పాఠశాలాధికారులు నన్ను కోరినారు. దీనికి నా వ్యవధి కాలమును చాలా భాగము వినియోగించవలసి వచ్చింది. ఇంగ్లీషులో వ్రాయడమూ, చైనా భాషలోనికి తర్జుమా చేయించడమూవల్ల బొత్తుగా తీరుబాటు కావడములేదు."

లోగడ వ్రాసినజాబు అందివుండని పక్షంలో తనవివాహ వృత్తాంతం తెలిసివుండదని తిరిగి ఇలా వ్రాసినాడు—

"గత సంవత్సరంజరిగిన మార్పులలో అత్యంత ప్రధానమైనవి ఏమంటే—నేను ఇక్కడ ఒక చైనా యువతిని వివాహం చేసుకున్నాను. మా పాఠశాలలో నర్సింగ్ మేష్టరుగావున్న కామ్రేడ్ క్యూచింగ్‌లాన్‌ను పెండ్లాడినాను. మేము గత నవంబరులో వివాహం చేసుకొన్నాము. ఈ వుత్తరం మీకు చేరేసరికి ఒక శిశువు కూడా కలుగవచ్చును;

"నేను యెనాన్‌కు తిరిగి రావడంవిషయంలో చాలా ఆతురతతో వున్నాను. ఇప్పుడు రెండు విషయాలకోసరం వేచివున్నాను. పుస్తకం పూర్తి కావడమూ, శిశు జననము. బహూశ ఈ సంవత్సరం ఆఖరులోగానీ, వచ్చే సంవత్సరం మొదటిమాసంలోగానీ నేను యెనాన్‌కు బయలుదేరవచ్చు. కాని యెనాన్ చేరడానికి ఎంతకాలం పడుతుందో నాకే తెలియదు.

"ఈ మధ్యనే ఇక్కడకువచ్చిన చియాంగ్ బూజింగ్‌ద్వారా మీరు వెంటనే భారతదేశమునకు వెళ్ళిపోవడములేదని తెలిసి సంతోషపడినాను. నాకోసరం వేచి వుంటారని ఆశిస్తున్నాను. ఉంటారుగదూ !

"భారతదేశ పరిస్థితులను పరికిస్తే ఎక్కువకాలం మనం చైనాలో ఉంటానికి వీలుపడేలా తోచదు. భారతీయరంగంలో మన అవసరం ఉండవచ్చు. మీరేమనుకుంటారు ?"

ఈ జాబులో అతి జాలికరమైన విషయాలు వున్నాయి. "నాకోసరం ఆగి ఉంటారని ఆశిస్తున్నాను. ఉంటారుకదూ !" అని కొట్నీస్ వ్రాసినాడు. నిజానికి బాసు, కొట్నీస్‌కూడా వస్తాడనే ఆగినాడు. దురదృష్టం, కొట్నీస్ తిరిగిరానేలేదు. అతను మరెన్నటికీ తిరిగిరాడు !

కొట్నీస్ మరణ సంఘటన అతి విషాదభరితమైనది. అంచేత ఎంత హృదయ విదారకమో అంత ఆశ్చర్యకరము గూడాను. 1941 నవంబరులో వివాహం చేసుకొనినాడు. 1942 జులైలో శిశు జననం. 1942 డిసెంబరు 9 వ తేదీని అతడు మరణించినాడు.

జపాన్‌వారి "ఊడ్చివేత" కలాపంవల్ల ఇతని ఆరోగ్యం పూర్తిగా చెడిపోయినది. దాదాపు ఒక సంవత్సరం మూర్ఛలతో బాధపడినాడు. ఆ సంగతి ఆఖరుకు తన భార్యకైనా చెప్పలేదు. ఎవ్వరికీ ఇతని వ్యాధి విషయం తెలియదు. అతను డాక్టరు అవడంవల్ల మూర్ఛ రావడానికి ముందే తెలిసేది. వెంటనే ఎక్కడికో, ఎవ్వరూ ఉండనిచోటుకు వెళ్ళిపోయేవాడు. ఆ మూర్ఛ పోగానే తిరిగి వచ్చేవాడు. తనమూలంగా ఎవ్వరూ బాధపడరాదని, ఎవ్వరికీ కష్టం కలుగరాదని అతని అభిప్రాయము. విశ్రాంతి లేకపోవడం, తినే ఆహారంలో ఏమీ బలంలేకపోవడమూ, మించినపనీ, సరియైన మందులు దొరక్కపోవడము—వీటన్నింటివల్లా

మంచి వయస్సులో వున్నప్పటికీ అతనిశరీరం వ్యాధిని ప్రతిఘటించలేకపోయినది. తుదకు వ్యాధికి లొంగిపోయినాడు.

ఉత్తర చైనాలో ఒకమారుమూలన మట్టి ఇంట్లో పరుండి పరమవదించినాడు ! తిరిగి తన తల్లివద్దకు రావాలనీ చైనాను సేవించినట్లే తన మాతృదేశమును సేవించాలనీ ఆశించినాడు.

మృత్యు దేవత మూసుకువస్తూవుండగా ఆఖరుసారి తన ప్రియురాలు— అర్ధాంగివంక అలాచూచి, ఆమె చేతులలోని ఆ పుత్రునిచూచి అసువులు వీడినాడు. చైనా—భారతదేశ ఐక్యమునకు సజీవ చిహ్నం . ఆ శిశువు ! జీవించి వున్నప్పు డెంత నిర్భయంగా, ధైర్యంగా వుండేవాడో మరణావస్థలోనూ అలాగే వున్నాడు కొట్నీస్.

కుటీరం వెలుపల చైనా ఉద్యోగులు, సైనికులు దుఃఖంతో తలలువంచుకొని గుంపుగా నిలబడినారు. ఒక కామ్రేడ్ కొరకు దుఃఖించుచున్నారు.

దూరాన భారతదేశములో ఒక తల్లి ఈ విషాదవార్తను కేబిల్‌ద్వారా అందుకున్నది. ఎవరి జననమునకు తాను కారణమో అతని మరణదుఃఖమును అనుభవించవలసి వచ్చినది. ఆమె దుఃఖమును ఒక జాతియావత్తూ పంచుకొనినది. రెండు జాతులు ఆమె విచారములో భాగము పంచుకొనినవి. స్వాతంత్ర్యంలోనూ, మానవసేవలోనూ విశ్వాసంగల వారందరూ కూడా ఆమె దుఃఖమును పంచుకొనినారు. రానున్న తరాలవారు మరలిరాని ద్వారకనాధ్ కొట్నీస్‌ను స్మరించుతూనే వుంటారు.

భారతదేశమున కంపిన ఒక సందేశములో సన్‌యెట్‌సెన్ సతి చెప్పినట్లు—

"డాక్టర్ కొట్నీస్ స్మృతి మన ఈ రెండుగొప్పజాతులకే చెందివుండలేదు. స్వాతంత్ర్యం కొరకు, మానవాభ్యుదయం కొరకు పోరాడు వీరుల వర్గములన్నింటికీ చెందినది. అతను భవిష్యత్తుకొరకు పోరాడి నిహతుడైనందున వర్తమానం కంటే భవిష్యత్తే అతన్ని అధికంగా గౌరవిస్తుంది."

---

Printed by P. S. Venugopalaswamy Naidu, Vinodan Press, 33, Jones Street. G. T. Madras, Q. H. No. M. S. 311 (4—4—46) For Cultural Books Limited Vangal Buildings, Perambur, P. O. Madras. 11. Q. H. No. M. S. 19.

*Dr. Kotnis Re. 1—0—0*

130

# సంస్కృతి ప్రచురణలు

1. సోవియట్లదేశం * .... రూ. 0
2. ఫ్రాన్స్ పతనం * .... .. 0
3. నేటి జపాన్ * .... .. 0
4. సోవియట్ రష్యా .... .. 0
5. చైనాలో నూతన జీవితోద్యమం .. 0
6. బోల్షివిజం * .... .. 0
7. పాకిస్తాన్ * .... .. 0
8. సోవియట్ సంయుక్తరాష్ట్రం—మన మిత్రరాజ్యం 0
9. ప్రపంచ ఆర్థిక దుస్థితి .... .. 0
10. సోవియట్లదేశం (రెండవ భాగం) .. 0
11. నేటి చైనా .... .. 0
12. ప్రజా యుద్ధం .... .. 0
13. యుద్ధకాలపు చైనా * .... .. 0
14. సోవియట్ రష్యాలో .... .. 0
15. లెనిన్ .... .. 0
16. గాంధీజీ * .... .. 0
17. హిందూ పద్ పాదుషాహి .... .. 2
18. డాక్టర్ కొట్నిస్ .... .. 1
19. ఇండియా స్వాతంత్ర్య సమస్య.... .. 0
20. ప్రపంచ పరిణామము (జవహర్‌లాల్ నెహ్రూ కుమార్తె ఇందిరకు వ్రాసిన లేఖలు) .... .. 1

* ప్రతులు లేవు.

CULTURAL BOOKS LIMITE

Perambur Post :: MADRAS